## ఆయుధాల కొరకు
## ఆభరణాలను ఇవ్వండి

## వదంతులను వినకండి
## వదంతులను ప్రచారం చేయకండి

# ఉత్తరాలు

## ముఖచిత్రం

నా అభిమాన నటి రాజశ్రీ ముఖ చిత్రం అమోఘంగా ఉంది. దానిని చూచి మేము చాల సంతోషించినాము. కాని ఆ ఫోటో ఏ చిత్రంలోనిదో తెలుపలేదు.

గానిగ రాజా రాంబాబు (గుంతకలు)

* * *

సంక్రాంతి సంచికలో అట్టపద్ధతి మార్చి వేస్తున్నామని పాత చింతకాయ పచ్చడిలాగ సినీ తారల బొమ్మలనే వేయుచున్నారు. ఈ పద్ధతి మార్చి, సంక్రాంతి సంచిక ముఖచిత్రంలాంటి మంచి చిత్రాలుగాని, కార్టూనులుగాని వేస్తే బాగుంటుంది అని 'ఇచ్చట పలుపు రనుకుంటున్నారు; నేను కూడా. మా కోరిక తీరుస్తారని ఆశించవచ్చునా?

సీతారామమూర్తి, (కాకినాడ)

* * *

క్రొత్త నటి అందాలతార 'శీలా' ముఖచిత్రముగా యెన్నుకొనుట మీ పత్రికకు ఒక చక్కని మాతనాలంకారమును చేకూర్చినది. తొణకిసలాడు నవ యవ్వనము, మన్మథ బాణాలలా హృదయాన్ని తపింపజేయు ఓరచూపులు జితేంద్రియులను సైతము ఉద్రూత లూగించును. అధరాలనుండి సతత ధారగా ప్రవహించు చిరు దరహాసము వెన్నెల రాజును వెలవెలబోవునట్లు చేసినది. ఈ కళారాధిక, సినీ పరిశ్రమలో చేరుటవలన సినిమారంగము అదృష్టవంతురాలు అయ్యెను. ఈమె భవిష్యత్తునందు సినీ పరిశ్రమలో అఖండ ఖ్యాతి గాంచగలదని తలంతును. ఇట్టి మాణిక్యమును మాకు పరిచయము చేసినందులకు మీకు మా హృదయ పూర్వక కృతజ్ఞతలు. మా అభిమాన తార శీలాగారికి మా అభినందనలు తప్పక తెలుప వలసినదిగా కోరుచున్నాము.

ఎస్. వి. యస్. రెడ్డి (గార్లదిన్నె)

* * *

ముఖచిత్రము చాలా అద్భుతంగా ఉందండి. క్రొత్త నటి శీలాను చూచి, నేను కృష్ణకుమారి అనుకున్నానండి.

చొప్పర్ల వెంకటసత్యనారాయణ (తెనాలి)

* * *

25—1—63 వ తేదీ సంచిక ముఖచిత్రం ఆకర్షణీయంగా వున్నది. నేను మొదట ఇ. వి. సరోజ అని భ్రమపడ్డాను. తీరా పేజీ తిప్పేసరికి కొత్తనటి శీలా అని వుంది.

పట్నాల కృష్ణమూర్తి, వెంపాడ నాగేశ్వరరావు (కాకినాడ)

* * *

## కథలు

యద్దనపూడి సులోచనారాణిగారి "నాకీ పెళ్ళి వద్దు" కథ చాలా బాగున్నది. సుఖ, దుఃఖాలతో నిండి యున్న కథ మా హృదయాలకి హత్తుకున్నవి. కథలో కూడా మంచి పటుత్వము ఉన్నది.

[illegible]

యద్దనపూడి సులోచనారాణిగారి 'నాకీ పెళ్ళి వద్దు' చదివాక పత్రికలో ఇంకో కథ చదవ బుద్ధి పుట్టలేదు. ఆవిడవి ఎప్పుడూ 'ప్రత్యేకథలు' శిఖరం, కారుకి ప్రమాదం జరిగిన దగ్గరనుంచి శిఖరం క్షేమంగా తిరిగి వచ్చిందాకా కథలో పోషింప బడ్డ ఉత్కంఠ, వూపిరి తీసుకోనివ్వకుండా చదువ నిచ్చింది. సుజాత, అదృష్టానికి ప్రతీ పాఠకుడు ఒక సుధాకరమయి ఆనందించాడంటే అతిశయోక్తి కాదు!

ఆ. వరప్రసాద్, (మద్రాసు)

* * *

సంక్రాంతి సంచికలో ప్రచురింపబడ్డ 'ఉచిత సలహాకోసం', 'వేట' కథలు చాల బాగున్నాయి! 'వేట' కథ చదువుతున్నంతసేపు నవ్వాపుకోలేక పోయాము. అంతంలో సుబ్బారావు అవస్థ చూస్తే నవ్వుతోబాటు జాలి వేసింది.

పి. రామలక్ష్మణ్ (కాకినాడ)

* * *

మొదటి "వేట" తాలూకు సుబ్బలక్ష్మి "నాకు అంతటి అదృష్టం కలిగించినందుకు కృతజ్ఞురాలిని" అని అన్నా, తరువాత తారసిల్లిన మీనాక్షిని చేపట్టటంద్వారా సుబ్బారావు మొదటి "పార్టీ"కి అన్యాయం చేశాడు.

ఎం. వి. సుబ్బారావ్ (విజయవాడ)

* * *

యస్. సరస్వతిగారి "పాపం చదుకొన్న అబ్బాయి" కథ చక్కగా ఉంది. స్త్రీ మనసిచ్చి మాట్లాడినంతమాత్రాన చెడుభావన తీసికొనే ఈ కాలపు మొగరాయళ్ళకు ఇది చక్కటి గుణపాఠం.

సూరమ్మ (పెద్దాపురం)

* * *

"పాపం చదువుకున్న అబ్బాయి" అనే కథ ఎత్తిపొడుపులాగా వుందిగాని, ఒక కథలాగలేదు. దీన్ని కొంచెం కుదించి కాస్తంత మార్చి వనితావాణిలో ఒక వ్యాసంలా ప్రాయాల్సింది. అప్పుడేమన్నా బావుండేది.

వై. వి. యస్. ఆర్. ప్రసాద్ (యద్దనపూడి)

* * *

చదువుకొన్న అమ్మాయి గురించి చక్కా బాగా వ్రాయించారు.

గాజుల పాండురంగారావు (శృంగవరపుకోట)

## రెండు రూపాల మనిషి

ప్రసిద్ధ సినిమానటి ఎలిజబెత్ టేలర్ గృహిణిగా, హాలీవుడ్ తారగా ఎలా ద్వంద్వ జీవితం సాగిస్తున్నదో రాబిన్ లెగాట్ హృదయంగమంగా చిత్రించారు. "ప్రపంచంలోవున్న డబ్బంతా ఇచ్చినా, ఆమె స్థానం నా కక్కర్లేదు!" అని లిజ్ ను గురించి ఒక 'ఎక్స్ట్రా' అన్న మాటలు, తీరని అశాంతితో ఇటీవలనే ఆత్మహత్యకు గురైన మారిలిన్ మన్రోను గుర్తుకు తెచ్చాయి. మనిషి సుఖపడటానికి కావలసింది కేవలం డబ్బో, లేక కీర్తి ప్రతిష్ఠలు మాత్రమో కావనీ, క్రమబద్ధమైన కుటుంబ వాతావరణమే వ్యక్తి ఆనందానికి దోహద మొనగునని, లెగాట్ వ్యాస సారాంశంగా భావింపవచ్చు. తన కళ ద్వారా అసంఖ్యాక ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్న లిజ్ ఇల్లాలిగా కూడా సుస్థిరతను పొందగలిగితే ఎంత బాగుండును!

[illegible]




వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 8—2—63
శుభకృన్నామ సం॥ మాఘమాసం॥ శు॥ పూర్ణిమ
సంపుటము : 55 సంచిక : 23

*

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకులు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద ( Sea Mail రూ. 20.00. విమానం ద్వారా (Air Mail ): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. (ఆస్ట్రేలియా : 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13.0.0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1





"వారపత్రిక"లో అంజలి.

## మనలో మాట

ఈ వారం 'ప్రత్యేక శీర్షికలు' రెండూ సినిమాకి సంబంధించినవే! 28, 29 పేజీలలో వేసిన 'రూప విచిత్రం' శ్రీ రూప తీసిన ఒక విచిత్ర చిత్రం. బాగుండాలనుకుంటే దానిని దూరం నుంచే చూడాలి.

హిందీ - సినిమా అభిమానులకు ఆహ్వానరేఖ వ్యాసం నచ్చవచ్చు. 'అనుకోని ముగింపు' ఉన్నట్లే అనుకోవచ్చు! ఇంకా కొందరు బొంబాయి సినిమా తారలవ్యాసాలు కూడా పైసంచికలలో ప్రచురిస్తాము.

*

ఈ సంచిక 12, 13 పేజీలలో చాలా ఉపయోగకరమైన రచన ఒకటి ప్రచురించాము 'పైకి రావా' లనుకుంటున్న ప్రతి ఒక్కరూ దీనిని చదవవలసినదిగా కోరుతున్నాము. 'కాకా లూతీయము' చిత్రాలు వేసినవారు శ్రీ బి. వి. సత్యమూర్తి (చదువుల్లావు). వీరిని వేరే పరిచయం చేయనవసరం లేదు...

కేవలం చిత్రాలలో బొమ్మలే కాక సినిమా తారలకు సంబంధించిన ఇతర చిత్రాలు కూడా 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లో వేయటానికి ప్రయత్నిస్తూఉన్నాము. ఆ సూతారల ఇటువంటి చిత్రాలు వారివారి అభిమానులు (ఫాన్)లకు ఆనందం కలిగిస్తాయని ఆశిస్తున్నాము.

*

ఆంధ్రసచిత్ర వారపత్రికకు చాలా రకాల కాగితాలు వాడుతూ ఉంటాము. కెనడా, రష్యా, స్వీడన్, ఫిన్‌లాండ్, జర్మనీ, భారతదేశం, మొదలయిన దేశాలలో ఉత్పత్తి అయిన 'న్యూస్‌ప్రింట్'మీద అచ్చువేసి పాఠకులకు అందిస్తూ వచ్చాము! వీటన్నిటిలోనూ వెల ఎక్కువగల రకం లోక ప్రసిద్ధిపొందిన 'నేపా' న్యూస్‌ప్రింట్. కాని, ఈ వారం సంచికలో వాడిన కాగితం నేపా కన్నా ధర ఎక్కువ. ఇది కూడా భారతదేశంలో తయారయినదే! నాణ్యత ఎటువంటిదీ పాఠకులే నిర్ణయించగలరు...

## లోకంపోకడ



"ఓహో! మీరు నేదాచుకున్న బంగారం గురించి బెంగగా ఉందా? మరి మద్య నిషేధోద్యమ నాయకునిగా చలామణీ అయ్యే మీరు దాచిన 'పానీయా'ల మాటేమిటి? అది బాగుందా?"

## విషయానుక్రమణిక

**కథలు :**



**సీరియల్ కథలు :**



**శీర్షికలూ, వ్యాసాలూ, సినిమా:**


ఒక తరహా వక్ర దృష్టి!
కొలంబో ప్రతిపాదనలు


దేశ విభజన వ్యతిరేకపు బిల్లు
స్వతంత్ర నాగారాష్ట్రం
ద్రావిడస్థాన్
పంజాబీ సుబా


దాచిన మూటలు
ఎంత బీదవాణ్ణో చూశారా!


అబ్బెబ్బే! నిన్నేం చెయ్యను ఏడవకు!

# 13 వ రిపబ్లిక్ దినోత్సవాలు

పదమూడోసారి భారత దేశమంతటా జనవరి 26 వ తేదీనాడు రిపబ్లిక్ దినోత్సవాలు జరిగాయి. ఇంతకుమించిన పెద్ద పండుగా, సంబరం వేరే లేకపోయినా ఈ సారి యీ ఉత్సవాలలో వేడుక కంటే బాధ్యత ఉద్యమాసక్తి ఎక్కువగా ఉన్నాయి. ఆందోళనా; ఆవేశం కూడా లేకపోలేదు. చైనా దురాక్రమణ దృష్ట్యా యీ ఉత్సవాలు, వేడుకలూ జాగ్రత్తకు జాగృత్తికీ దీక్షా ధారణ సమయంగా గడిచిపోయాయి. ఐతే దేశరక్షణ అనేది ఉపన్యాసాలవల్ల ప్రతిజ్ఞలవల్ల సాధ్యం కాదు. కార్యరూపేణా యిది అగుపించాల్సిఉన్నది. ఇది నాయకులైనా, ప్రజలైనా, ఎవరైనా సరే భారతీయులంతా గ్రహించవలసిన విషయం ఢిల్లీ, మద్రాస్ నగరాలలో జరిగిన ఉత్సవాల చిత్రాలను యీ పేజీలో చూడవగును,



ఢిల్లీలో ప్రధాని నెహ్రూ ప్రభృతులు ఉత్సవాలలో పాల్గొన్నారు.



మద్రాస్‌లోని ఎన్. సి. సి. బాలికలు విన్యాసం జరుపుతున్న దృశ్యం.



## జరిగిన కథ

సిరిపాలెంలో సూరపరాజుకరణం సూర్యనారాయణగార్ల కుటుంబాలు ప్రశస్తికెక్కినవి. సూరపరాజు తల్లి లక్ష్మమ్మ. ఆ ఇంట పెద్దబామ్మగా రున్నది, సూర్యనారాయణకి నలుగురు పిల్లలు.

ఊరికి వరదలువచ్చాయి నరసింహంగారూ, వచ్చారు. అంతకుక్రితం కూరపాడులో వేంకటశాస్త్రిగారి కూతురు పెళ్ళి ముప్పుబుసాయంలో జరిగింది. కాని,ఆమె మానభంగమైందనే అవమానంలో ఆత్మహత్య చేసుకుంది. శాస్త్రిగారు మరణించాడు ఆయన ఇల్లు తగలడిపోగా, కొడుకు మాయమయ్యాడు. కొత్తగావచ్చి నరసింహం సూరపరాజు మద్దతుతో సిరిపాలెంలో బడి పంతులయ్యాడు. సూరపరాజు కుమారుని వివాహం కారణంగా సూర్యనారాయణగారికి ఆయనకు స్పర్థ ఏర్పడుతుంది. సుబ్బారావు కుటుంబం ఆర్థికంగా చితికిపోతుంది. సూరపరాజుగారి మరణానంతరం సుబ్బారావు విశాఖపట్నంలో కాంట్రాక్టు వ్యాపారంలో నష్టపడి ఇంటికి వస్తాడు. తన కుమారుడు సూర్యాన్ని ఎలాగో అలా స్కాలర్‌షిప్‌లు సంపాదించి కాలేజీలో చేర్పిస్తాడు. సూర్యం ప్రేమించిన, కమలకు సూర్యం తండ్రి అంగీకరించినందున వేరొకళ్ళతో వివాహం జరుగుతుంది.

## (21) మలుపు

జీవితంలో కొన్ని మలుపులుంటాయి. ఇవి అందరికీ ఒక్కచోటా, ఒక్కమాటూ ఉండవు. ఎవరికి వారే జీవితంలో మలుపులు తిరుగుతుంటే తెలుసుకుంటూ ఉండాలి. ఒక్కొక్కప్పుడు తన జీవితంలో అలాంటి మలుపుందని గాని మలుపుకి రెండుపక్కల జీవితానికి హస్తిమశకాంతరం ఉండచ్చని గాని తెలుసుకోలేకపోవచ్చు. ఒక్కొక్క నిర్ణయం మనం తీసుకునేటప్పుడు అప్పటి పరిస్థితులు, మనకి అందుబాటులో ఉన్న అంచనాలూ లెక్కలోకి తీసుకుని నిర్ణయం తీసుకుంటాము. కాని దాని ఫలితాలు మనం అనుకున్న దానికంటె చాలారెట్లు ఉండచ్చు లేదా అసలు ఎప్పుడూ కలలోకూడా అనుకోని ఫలితాలు కలగొచ్చు. ఆ కలిగిన ఫలితాన్నిబట్టి "చూశావా నా తెలివితేటలు అప్పుడు ఆ నిర్ణయం తీసుకున్నాంగనుక ఇప్పుడు ఈ ఫలితం వచ్చింది" అనుకోవచ్చు. లేదా "ఏమిటో తొందరపడి నలుగురూ చెపుతున్నారని చేశాను. అయితే ఇలా అవుతుందని అనుకున్నానా నేను మాత్రం" అనొచ్చు. అందుకని మొదటి నిర్ణయం యొక్క తప్పొప్పులు సాధారణంగా తరువాతి ఫలితాల్నిబట్టే బేరీజువేస్తారు. ఆ నిర్ణయం ఈ ఫలితాలని లెక్కలోకి తీసుకోకుండా చేసిందయినప్పటికీను. ఇలా కొన్నికొన్ని నిర్ణయాలకీ, ఆ మలుపుకీ అవినాభావ సంబంధం ఉంటుంది. ఒక్కొక్కప్పుడు మలుపు తిరిగాక వెనక్కిపోదామని అనుకోడం కూడా కద్దు. అయితే అది అన్నిచోట్ల సాధ్యమయ్యే పనికాదు. జీవితంలో చాలామటుకు దార్లు 'వన్ వే ట్రాఫిక్' బోర్డులు తగిలించుకుని ఉంటాయి.

కొన్నికొన్ని మలుపులు ఎలా ఉంటాయంటే ఈదురోమంటూ మట్టిరోడ్డుమీద దుమ్ము కొట్టుకుంటూ ఎద్దుబండిలో వస్తున్నవాడికి మలుపుతిరగ్గానే అనుకోకుండా తారురోడ్డో సిమెంటురోడ్డో దొరకడం, ఆపైన అయాచితంగా ఏదో కారులో లిఫ్టు దొరకడంలాగ ఉంటాయి. దీనికి సరిగ్గా వ్యతిరేక పరిస్థితులూ ఉంటాయి; సుబ్బారావు జీవితాల్లాంటివి. అయితే మనం సుబ్బారావు జీవితంలో పస చచ్చిందని తెలియగానే ఆ 'స్లయిడ్' తీసేసి సూర్యం జీవితం స్లైడు ఎక్కించాము. ఇప్పుడు స్లైడు మారుతోంది. సూర్యం జీవితంలో పైన చెప్పినలాంటి మలుపొకటి తగులుతోంది. కాని ఇందులోకూడా రెండురకాలుంటాయి. కొందరు మనుష్యులు మట్టిరోడ్డు పూర్తిగా వదల్లేరు. అహ అదికాదు. మట్టిరోడ్డు వాళ్ళనిపూర్తిగా వదలదు. ఆ దుమ్ముధూళి అంటుకునే ఉంటుంది. ఇంకొక రకం: మనతోకూడా ఎద్దుబండిలో ఇంకా తనవాళ్ళొచ్చారు; వాళ్ళని మలుపుదగ్గర వదిలిపెట్టాం. వాళ్ళేమయ్యారో, వాళ్ళకేదైనా డొక్కు బస్సైనా దొరికిందో లేదో కూడా ఆలోచించరు.

—53 వ పేజీ చూడండి

# రాష్ట్ర ప్రభుత్వంపట్ల అలక్ష్యంచూపే కేంద్ర ప్రభుత్వం

కొత్త సంవత్సరం ఆరంభంలోనే యిద్దరి శత జయంత్యుత్సవాలు ప్రారంభమయినాయి. మహా మహులు జన్మించిన ఈ భరతఖండంలో యిలాంటి ఉత్సవాలు జరపటంలో అబ్బురమేమీ లేదు. వారు ప్రబోధించిన సిద్ధాంతాలను, ' చూపించిన మార్గాన్ని సంస్మరించుకుంటూ, వాటి విశిష్టత సర్వకాలీనమైనదని పదేపదే చాటటమే ఈ మహో త్సవాల ఆశయాలు. ఈ కారణజన్ముల జీవిత ధ్యేయాన్ని పునస్స్మరణ చేసుకుంటూ, మనం ఎంత వరకు ఈ మహదాశయాల సిద్ధికి తోడ్పడకలిగా మని ప్రశ్నించుకోవటం ఎంతైనా అవసరం. సర్వ జన సమ్మతమైన కాలతబద్ధతో ప్రగతి పథాన్ని కొలుచుకుంటూ, లక్ష్యసిద్ధికి ప్రతి వ్యక్తి తన వాటాను కేటాయించాలి.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత, కందుకూరి వీరేశలింగం పంతులుగారిని ఉచితరీతిని సంస్మ రించుకోవటం భావ్యమని ఈ ఉత్సవాలు ఏర్పాటు చేశాము. నిజానికి ఆయన శత జయంత్యుత్సవాలు అయితే ఎప్పుడో జరిగిఉండాల్సింది అని, రవీంద్ర భారతిలో జరిగిన సభలో మంత్రిపర్యులు తెలియ జేశారు. కేవలం, తారీకు ప్రధానంగానే సంస్మరించు కోవాలసిన అవసరమేమీ లేదు. పంతులుగారు జీవిత కాలంలో ఎలాంటి ఉద్యమాన్ని లేవదీశారు, ఎంత వరకు కృతకృత్యు లయ్యారు, ఆనాటి సాధక బాధకా లేమిటి, మొదలైన విషయాలు ఈనాటి తరంవారు కూడా సమగ్రంగా తెలుసుకోవటం చాలా ముఖ్యం. ఆనాటి సాంఘిక, రాజకీయ ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా, వారు చేసిన కృషి, సాధిం చిన అభ్యుదయం సామాన్యమైనవి కాదు. కాబట్టే, యుగపురుషులని ప్రఖ్యాతి చెందారు. 'హెర్క్యు లిస్ అంతటి ఉద్దండత' గల వ్యక్తి అని వారిని శ్లాఘించారు. ఇలాంటి సర్వతోముఖ సంఘ సంస్కర్త సంస్మరణ సందర్భంగా జరిగిన సభలో చాలామంది ఉపన్యసించారు. ప్రభుత్వాధ్వర్యంలో జరుపబడిన ఈ సమావేశానికి ఆంధ్రప్రదేశ్ గవర్నరుగారు ప్రారంభకులుగా విచ్చేసి తెలుగులో, ఇంగ్లీషులో రెండు 'సావనీర్సు' ఆవిష్కరించారు. క్రమశిక్షణతో, ఎక్కువ ఆర్భాటా లేమీ లేకుండా ప్రశాంతంగా జరిగిపోవటం, ఈ సభ కొక ప్రత్యే కత. 'అభిజ్ఞాన శాకుంతలం' లో కొన్ని దృశ్యాలు ప్రదర్శించటం మెచ్చుకోతగ్గ ఆకర్షణ.

అయితే అసలు విషయం ఏమిటి ? పంతులుగా రెవరు ? ఆయన లేవదీసిన ఉద్యమా లేమిటి ? విధవా వివాహాలు ప్రోత్సహించిన సంఘ సంస్కర్త అని ఒకరంటే, మహా రచయిత అని యింకొక రన్నారు. సంచలనాత్మక శక్తితో, నిద్రాణమైన జాతిని లేవకొట్టిన మహాపురుషుడని మరొక రన్నారు. ఈ ఉపన్యాసాల మధ్య అతి సూక్ష్మంగా ఆయన వ్యక్తిత్వాన్ని నిర్దుష్టంగా ప్రస్ఫుటం చేసే, వాణి ఒకటి వినబడింది. ఆ వాక్కు సారాంశం ఇదే ! పంతులుగారు ఒక వ్యక్తి గారు. కనక ఆయనకు చావులేదు. ఆయన 'జనం' 'మంద', వ్యక్తికి మరణమంటూ ఉంటుంది. మందకు, జనా నికి చావంటూ ఉండదు. అలా ప్రవాహంలాగా సాగిపోతూనే ఉంటుంది. దీంట్లో ఎంతో గంభీర మైన సత్యం ఇమిడిఉంది. ఆనాటి ప్రజా బాహుళ్యంయొక్క "చైతన్యస్రవంతి" ప్రతిబిం బమే పంతులుగారి మూర్తి స్వరూపం. సాంఘిక దురాచారాలకు బలయిపోయి, పాత కట్టుబాట్లను తెంచుకోలేక సతమతమయిపోతూ మగ్గిపోతున్న జనంయొక్క ఆశయాలకు, ఆవేశాలకు ప్రాతి నిధ్యం వహిస్తూ దండయాత్ర సల్పిన తేజో మూర్తి పంతులుగారు. ఆనాటినుంచి ఉధృతంగా ప్రారంభమయిన ఈ 'యుద్ధం' ఈనాటికి కూడా ఏదో రూపంగా జరుగుతూనే ఉంది. అత్యాచారాలు, అక్రమాలు మానవజాతి పట్ల ఉన్నంతవరకు యిలాంటి ధర్మబద్ధమైన పోరు తప్పదు. ఈ పోరు సాగుతున్నంతవరకు పంతులుగారిలాంటి వ్యక్తు లను సంస్మరించక తప్పదు.

ఇలాంటి మహాయోధుని జ్ఞాపకార్థానికి ప్రత్యే కంగా ఏవో ఏర్పాట్లు చెయ్యాలనుకోవటం నిజానికి హాస్యాస్పదంగానే కనబడుతుంది. కాని ఆచారంగా కొన్ని పద్ధతులు మన ప్రభుత్వంవారు యిలాంటి వారి సంస్మరణార్థం అవలంబిస్తూ వచ్చారు. ఆ నియమాన్నే యిక్కడ కూడా పాటించాలి.

51—వ పేజీ చూడండి

# కాటూరికి స్మృత్యంజలి

కడుపున పుట్టనన్నది యొకండు కొరంతయొ
కాదు; నెమ్మదిన్
కొడుకుల మీదనైన తనకుం గల కూర్మి అదె
ట్టిదో వినం
బడ, దెపుడే, నదెల్ల శరభయ్య యెరుంగు నొకండె;
నేటికిన్
బడుగయివాడ తాదృశ కృపా మహితాత్ముని బాసి
మద్గురున్.

వింశత్యబ్దము లేగె నిన్ను తొలుతన్ వీక్షించి;
నాకుం ద్రయ
స్త్రింశాబ్దంబి పుడైన నేరను సుమీ! శిష్యత్వమో
సఖ్యమో !
భ్రంశల్లోక వయో విభేదము భవద్వాత్సల్య
భోనిధిన్
బ్రాంబూదాత్త మనీష ! నే గడిన నిర్వాణం
బనిర్వాచ్యమై.

ఏ సుకృతమ్ము నా యెడ ఫలించియొ! నా పసి
నాటి నేకువన్
దేశిక భావమందున ప్రతిష్ఠితమైన వెలుంగు;
ఆంధ్ర వా
ణీ సదనీకృతాననము నిల్పినదిర్వది యేండ్లు,
నేటి కా
నా సుకృతమ్ము దవ్వు చనెనా! మనసా ! యిక
జోగినై ధరన్.

నీతో నేర్చితి నాంధ్రగీః పిక వధూ నిర్హ్రాదముల్
స్వాదువుల్
నీతో వెన్నెలరేల పండితి హిమానీ స్వచ్ఛలన్
శయ్యలన్
నీ తోడన్ బడి రాను స్వర్గపురికిన్, నీ వేగితాంధ్రీ
వచ
శ్శ్రీతో జాతుండ వచ్చటన్ సురవచశ్శ్రీ బాలివై
యున్నదో !

అనువర్తించితి శిష్యుని ట్లను గురుండై యుండి
యు నీవు; ని
న్ననువర్తింపని శిష్యుడన్ గద! గురున్ హార్దా
వారాన్నిధిన్
నను నో నాడి యెరుంగ వెన్న, డిచట న్మర్మంబు
నీ, నా, యెరిం
గిన దెవ్వారి కగవ్య, మా శుభములన్ గీర్తించెదన్
మద్గురూ !

ప్రాణం బిత్తువు మిత్రమన్న మడికిన్ బ్రాల్మాల
వెన్నండు నీ
ప్రాణప్రాణములుండి రిచ్చట సఖుల్ పాయంగ
నెట్లోర్చితో!
వాణీమూర్తి భవద్గురుండు గురుసేవా బుద్ధివై
వేగితో!
తా నొక్కండె ప్రియుండు నీకు నిఖిల త్రైలోక్య
మందారయన్.

నీ యనురాగ దివ్య మధు నిర్ఝరశోభ దలిర్చి
యున్న నా
ప్రాయమునందు నా మనియె రాదిక యెన్నటికిన్
దురంత తా
పాయత మో నిదాఘమిది ! జడాయిత మోళి
శిరంబొ జీవిత
వ్యాయతి యెల్ల పట్టె బయలై దిగులై నొగులై
భరంపడెన్.

నీ చమత్కార నిర్ఝరవనీ వ్రత తీనిపతల్లతాంత ధా
రాచితమయ్యె సమ్మదభరస్నుత దివ్య గవీ పయ
స్సుధా
సేచితమై ప్రహర్ష వివశీకృత దివ్య వనీవన
ప్రియా
శ్రీ చిరరుద్ధ కంఠకుహళీ విగళన్మధు నిర్భరాశమై.

మ. శరభయ్య.




దుర్గయ్యగారి జీవితంలో మరుపురాని ఘట్టాలు చాలా ఉన్నాయి అవి రకరకాలు! అవన్నీ ఆయన మేధస్సులో చోటు చేసుకుని మనస్సును వేధించ సాగాయి!

పార్వతి ఆయనభార్య!

రహమాన్ కొడుకు!

ఉద్యోగం ఉపాధ్యాయవృత్తి!

తోడునీడలేని బ్రతుకు ఆయనిది.

అన్నీ సమస్యలే! అన్నిటినీ ఎదుర్కొ కలిగాడు! ఇంటికి తోడు మేరీ క్రొత్తగా వచ్చింది!

దుర్గయ్యగారు తన జీవితాన్ని పర్యాలోకన చేసు కుంటూ కూర్చున్నాడు అనుర సంధ్యవేళ ఎందుకో ఆలోచన ప్రారంభమైంది ఆయనలో! వాటినుండి తేరుకునేంతలో ఊరు మాటుమణిగి, కారు మబ్బులు అలుముకుని వానకూడ ప్రారంభమైంది

జల్లు వచ్చి ఇంట్లో పడుతున్నది! లేచి వెళ్లి తలుపుకు గడియపెట్టి వచ్చాడు ఇంతవరకు దీపం వెలిగించలేదన్న సంగతి జ్ఞాపకంవచ్చి, అరవ య్యేళ్ల దుర్గయ్యగారు క్షణం నవ్వుకుని తన ఆలోచనలకు, దీపం వెలిగించారు.

మేరీ చాపమీద నిద్రపోతున్నది! అన్నం పెట్ట మని మేరీ అడగలేదు అడిగిందేమో, ఆయనకు జ్ఞాపకంలేదు

మంచంమీద గుడ్డలు దులిపి, మేరీని ఎత్తు కుని, మంచంమీద పడుకోబెట్టాడు!

'అమ్మ' అని ఆ మూడేళ్ల మేరీ పెదవులు అస్పష్టంగా ఉచ్చరించాయి!

మేరీ ఆ యింటికొచ్చి కొద్ది రోజులే అయింది. ఆవేళ వాన కురుస్తోంది ధారాపాతంగా! గాలి కూడా

45-వ పేజీ చూడండి



# ఉజ్జయిని పర్వం- 13

సృష్టి జరిగి ఎంతకాలమైనది! ఈ కాలములోపల ఎన్ని సప్తములు రాలేదు. కాని ద్వాపరమున ఈ సప్తమి యంత యందముగ, మరియొక సప్తమి లేదు. ఈ సప్తమినాటి యుషస్సును పోలి, సూర్యుని ఉదయమును పోలి మరి యంతకుపూర్వపుటుషస్సులు గాని సూర్యోదయములు గాని లేవు. ఇట్టి విచిత్రములైన భావము లానాడు వామాక్షీ, సుదాములయందు పొడచూపినవి. వారియందిట్టి భావములు కల్గుట సహజము. వారు కొత్త పెండ్లికూతురును, పెండ్లికొడుకును. మరి శ్రీ కృష్ణునియందు, మిత్రవిందయందుగూడ నిట్టి భావములే కల్గినవి. భగవంతునికిది యే విచిత్రమనిపించినది. ఇది తనకు క్రొత్త జన్మయా! తనకు జన్మయన్నది యున్నదా! తాను వివర్తము నెందియుట్లుగా తానైనాడు. తనయందు లేని భావమనుచు నొకటున్నదా! మరి ఈ భావమిప్పుడేల క్రొత్తగనున్నట్లగపడుచున్నది. ఆయన నవ్వుకొనినాడు. నవ్వుకొని సుదామునివంక చూచినాడు. అప్పటికింకను తెల్లవారలేదు. మహారాజుల యిండ్లలో ప్రాతరనుష్ఠానములకు ప్రయత్నములు జరుగుచున్నవి. అగ్నిగృహ బహిర్ద్వారమున నందినినిపోలి కపిలయొక్క డంభానినాద మధురముగ స్వాధ్యాయ నిష్ఠుడైన ఉత్తమ బ్రాహ్మణుని కంఠస్వరమువలె మ్రోగినది. వాకిట రథము మొక్కడాగినట్లయినది.

"సుదామ !"

"ఏమి ! శ్రీ కృష్ణ !"

"తల్లి పిలుచుచున్నది !"

సుదాముడు మాటాడలేదు. అతని ఆలోచనము లతనివిగా నున్నవి.

"సుదామ !"

"ఏమి శ్రీ కృష్ణ !"

"పెండిలియైన నన్ను మరిచిపోయెదవు."

సుదాముడు కన్నులు తెరచినాడు. ఆ కన్నులు సూర్యకిరణముల తాకిడికి పద్మపత్రములు విచ్చినట్లుగా నున్నవి. శ్రీ కృష్ణుడా కన్నులను తదేకముగా చూచినాడు. సుదాముని కన్నులింత యందమైనవా యనుకొన్నాడు. అతని యందమంతయు నా కన్నులలో నున్న దనుకొన్నాడు. అప్పుడా కన్నులు ఉపాధిగతుడైన జీవుండంతర్ముఖుడై జ్ఞాన విజ్ఞానముల కలయికగా కన్నులను తెరచినట్లులున్న వనుకొనినాడు.

"ఏమి శ్రీ కృష్ణ !" అనినాడు సుదాముడు.

"ఏమున్నది. ఏమియునులేదు." అనినాడు శ్రీ కృష్ణదేవుడు.

"కాదు ! ఏదో అన్నావు. పెండిలియై నన్ను మరతునన్నావు. శ్రీకృష్ణ ! నేను పెండిలియగుట నీ చలువ. నేను మనుటయు నీ చలువ. నీవు ఆశ్రమమునకు రాకముందు నా జీవితమేమి ! ఇప్పుడేమి ! భగవాన్ ! నీవు నా ఆత్మవు. దానిని వామాక్షియందు నేను చూచినాను....."

శ్రీ కృష్ణదేవుడు నవ్వుచు నన్నాడు:

"నన్ను పెండ్లియాడుదునందువా యేమి !"

సుదామునకు నవ్వువచ్చినది.

"శ్రీకృష్ణ ! నీవు అన్నిటను పరిహాసశీలివి" అనినాడు. మరల ఇట్లనినాడు:

"భగవాన్ ! నేను నిన్ను ఎట్లు మరతును. మరతునేమో కాని, నన్నుఆ మరుపు ఆవరించకుండా వామాక్షిని నా కిడి పెండ్లిచేయుచున్నావు. అది నీ అచ్చమైన చెల్లెలు. నేను మరతునుపో, అది మరువనీయదు."

అతడు గంభీరుడైనాడు. మరల ఇట్లు లన్నాడు: "ఈ వివాహము, ఈ భార్య, ఈ సంసారము— ఇదియంతయు బంధమనుటయున్నది. కామగూడ కావచ్చును. కాని భగవాన్ ! నీ యందు నిత్యజాగరూకున కివి యన్నియు నెచ్చట. బంధములను త్రెంచుట మోక్షము కావచ్చును. మరి యా బంధములలో నుండి, యుండనట్లుగా నుండి, మోక్షము నేల సాధించరాదు. మోక్షము రాయివలె చైతన్యము లేని జడము కాదుకదా! సంసారముండి మోక్షమును పట్టుదును. నీ దయయున్న చాలును"

శ్రీ కృష్ణుడు మాటలాడలేదు. అట్లనా అన్నట్లు సుదాముని చూచి మందహాసమువాత్రము చేసెను. అంతలో ప్రాతరాహ్నికములను తీర్చుకొనిన రాజా వెంటరా ఆచార్యాణియు, రాజాధిదేవియు వచ్చుటకు వచ్చిరి. వారి ఆ వచ్చుట చూచి శ్రీ కృష్ణదేవుడు నవ్వెను. మహారాజును చూచెను. మహారాజాతనిని చూచెను.

"ఏమయ్యా ! యాదవ ! నన్నుచూచి నవ్వుచున్నట్లున్నావు" అనెను.

"మహారాజ! మిమ్ము చూచి నే నేల నవ్వవలయును. ఊరక నవ్వువచ్చినది. నవ్వితిని."

"యాదవుల బుద్ధి పోనిచ్చితివికాదు. మహారాణి ముందును, వెనుక మహారాజును (నేను) వచ్చుట చూచి నవ్వితివని యేల నవవు ! నీవు మేనయల్లుడవు. ఆమె నీ మేనయత్త ! ఇట్లు సంభావించక పోయిన నేమగునోయని......"

"మహారాజ ! మీకు ఎప్పుడును నన్నును, నా పుట్టినింటి వారి నేదో యనుటయే పని. దాని కిది సమయము, ఇదికాదు అనిగూడలేదు" అన్నది మహారాణి.

"ఊహూ ! బలము చూచుకొని మాటాడుచున్నదయ్యా ! గోపాలకృష్ణ ! మీ యత్త...."

శ్రీ కృష్ణదేవుడు గట్టిగ నవ్వినాడు.

"ఎంతకైనను మామగారిది పైచేయి" అన్నాడు.

"ఎప్పుడు నట్లుగా నగునట్లు చేయుము" అనినాడు మహారాజు.

వారి ఈ సంభాషణ మండలికిని యర్థము కాలేదు. మహారాణియే మహారాజును విచిత్రముగ చూచినది. మహారాజు ఎప్పుడును పరిహాస శీలిత ముగ నవ్వెడివాడిప్పుడట్లు చేయులేదు. ఆయన గంభీరుడయ్యెను.

"ఏమో ! మీ మాటలు మా కర్థముగుటలేదు" అన్నది మహారాణి.

"ఎవరికి ? మాకా ! అబ్బో రావరికమ్మ తల్లి గారివద్ద గూడాను."

"మహారాజులు ఊరుకొనరు. మరల హాస్యము మొదలైనది" అన్నది మహారాణి.

"చూచితివయ్యా ! యాదవ ! నీ యండ చూచుకొని మీ యత్త నన్ను విదూషకుని క్రింద కట్టివేసినది."

ఆచార్యాణియు, రాజాధిదేవియు, శ్రీ కృష్ణ, సుదాములును గూడ గట్టిగ నవ్వినారు.

"తల్లీ ! అంత నవ్వువచ్చు మాట నే నేమని నాను" అనినాడు మహారాజు.

"జయత్సేన ! నీ కింకను చిన్నతనము పోలేదు" అన్నది ఆచార్యాణి.

"తల్లీ! ఇట్టి మాట విని యెంతకాలమైనది. మా అమ్మగారు గూడ మీ వలెనే నన్నిట్లనెడివారు. సరి ! సరి ! ఆచార్యసుదామ...."

ఈ మాట యని మహారాజు కన్నులతో నవ్వులుగా సుదాముని చూచెను.

"తల్లీ ! యేమి చెప్పమందురు ?"

"జయత్సేన ! నేను చెప్పెదను." అన్నది ఆచార్యాణి.

సుదామునితో ఇట్లులన్నది:

"సుదామ ! నిన్ను ఇప్పుడు పెండ్లికొడుకును చేయవలెను. మీ అమ్మగారిని చేయమంటిని గాని, ఆమె యొప్పుకొనలేదు. 'అక్కా ! వానిని నీ చేతిలో పెట్టితిని, నీవు మాకు పెద్దదానవు. నీవే వానిని మాడున ఇంత చమురుపెట్టి తలయంటి, నీరార్చి, పెండ్లికొడుకును చేయుము. నేను నిమిత్తమాత్రురాలను. నీవు పీటలమీద కూర్చుండమన్న కూర్చుందును. తక్కిన యన్నిపనులను నీవే సంబాళించుకొనవలయును.' అన్నది. ఆచార్యులును, మీ తండ్రియు నట్లభ్యర్థించినారు. ఆచార్యులు సరియేనన్నారు. నిన్ననే ఈ విషయము చెప్పెదమనుకొన్నాను గాని, ఏలయని యూరకొన్నాను. అది అట్లుంచుము. లెమ్ము!...."

అని యామె శ్రీ కృష్ణుని దిక్కై చూచినది. ఆ చూపులో ఆమె తల్లి—తనమంతయు నున్నది. రాజాధిదేవి యనుకొన్నది: ఈమె యశోదయు, దేవకియు ఒక్కమూర్తిగా నైనది. యశోద తల్లితనము పెంచుటయందున్నది. దేవ తల్లితన మాత్మయందున్నది. మరి ఆచార్యాణి తల్లితనమో సాకుటయందు, ఆత్మయందు; ఆ గుణము కన్నులలోని చూపులుగా ప్రవర్తిల్లుటయందు, సర్వ శరీరగత సర్వేంద్రియ పరమార్థము నందున్నది. ఈ శ్రీ కృష్ణుడెట్టివాడు! ఆమెయు శ్రీ కృష్ణుని చూచినది. అతడు ఆచార్యాణికి శిశువు. తనకట్లు లగుపించుటలేదు. తన మిత్రవిందకు భర్తయైన యల్లునివలె యగుపించుచున్నాడు. కొత్త పెండిలికొడుకువలె కనిపించుచున్నాడు.

"తండ్రీ ! నన్ను రక్షించినావా !" యనుకొన్నది రాజాధిదేవి.

అంతలో విషాదాచ్ఛాదిత ముఖారవిందయైనది. ఉదయసూర్యుడు కప్పుకొనిన ప్రాతరాహార్య ప్రావారమువలె నా విషాదమప్పుడు భాసించినది. అట్లు లది తన మనస్సులో ననుభావించగా రాజాధిదేవి మందహాసము చేసినది. భర్తను మందహాసముతోడి కన్నులతో తిలకించినది.

"మహారాణి ! ఎచ్చటనో యుద్ధము చేసి విజయము సాధించినట్లున్నారు" అనినాడు మహారాజు.

—హారీత శివశర్మ. ★




'కాకా' అంటే 'నేడి' అనే అర్థం ఒకటి లోకంలో వాడుక ఉంది. కాని, మీరు ఆ విషయాన్ని గూర్చి వ్రాస్తే, చదవరు. అందుకని, 'కాకా' అనే వేరొక విచిత్ర మానసిక తత్వశాస్త్రాన్ని గూర్చి చెబుతాను.

ప్రతిరోజూ, మన దైనందిన జీవితంలో ఎక్కడో అక్కడ, ఎప్పుడో ఒకప్పుడు, ఎవరి నోటో నొకరినోట యీ 'కాకా' అనే మాట వింటూనే ఉంటాము.

ఉదాహరణకి :

"వాడు వొట్టి కాకారాయుడ్రా" అనో, లేక, "అబ్బే, యీ రోజుల్లో కాకా మయమంటి యీ ప్రపంచమంతా" అనే వేదాంత ప్రవచనమో, లేక, "కాకా పట్టాడూ, నేటికి (తన) బాకా తానే వూద గల స్థితిలో కొచ్చాడూ ఆ కాకారావు" అనే సాధారణ నిర్వచనమో, లేక, "కాకా పట్టవోయ్ మీ బాస్‌ని, హాయిగా పని గిట్రా లేకుండా తోకాడించవచ్చు ఆఫీసులో" అనే హితోపదేశ బోధనో— వింటూనే ఉంటాం— మనం ప్రతిరోజూ. ఇంతకీ సామాన్యమానవుడిని ఇబ్బంది పెట్టే యీ 'కాకా' అనే పదానికి సరైన తెలుగు అర్థమేమిటి ?

నిర్వచనం :—

నాకు అనుభవపూర్వకంగా అర్థమయినంతలో "కాకా అంటే : ఒకానొక శక్తిగల వ్యక్తి ఆదరణా, సహాయం, ఉపకారం ఎక్కువ కష్టపడకుండా పొందటానికి, వేరొక తెలివిగల వ్యక్తి (ఎవరికీ 'కాక' తగలకుండా) పడే బాధ" అని అనవచ్చును.

కాకా చరిత్ర :—

ఈ 'కాకా తత్వం' నేటికాలంలోనేనా లేక అనాదిగా ఉందా అని తీవ్ర పరిశోధన చేస్తే, తేలిన యదార్థ మేమిటంటే,—మానవుడు ఈ భూమి మీద కాలిడిన లగాయితు, 'కాకా చేసే యత్నం' ఉందని రూఢిగా తేలింది. ఈవ్ అనే మొదటి ఆడది, ఆడమ్ అనే ప్రథమ పురుషునికి, "కాకా అనే ఫలం" తినిపించి, మనందరి జన్మకీ కారణభూతురాలయింది! అందుకే ఆ మహాతల్లిని మనం నేటికీ మరువలేకుండా ఉన్నాము.!!

రకరకాల కాకాలు :—

'కాకా' లు పలురకాలు. వస్తురూపేణా (రేడియో మొదలుకుని సిగరెట్టు దానం చేయడం దాకా) కార్యరూపేణా (ఇల్లు చూపి పెట్టడం మొదలుకుని బజారునుంచి కూరగాయలు వ్రటావడం దాకా) మాటరూపేణా ("మీరు అచ్చం శశికపూర్ అంటి లగాయితు "అబ్బ: మీరు అవతారాన్నతి బ్రహస్పతి తారాపతి కులపతి—మీరు మాట్లాడుతుంటే ఎంచక్కా ఉంటుందనుకున్నారు ?" వగైరా వగైరా వరకు) ధనరూపేణా (పద్దులు నిర్ణయించలేరింకా!) మొదలైన రకరకాల రూపాలలో యీ 'కాకా' విలయతాండవం, నేటి ప్రపంచ (నాటక) రంగస్థలంమీద మనం చూడవచ్చును.

పౌరాణిక 'కాకాత్ములు' :—

పురాణాలలోని భక్తులూ, దేవతలూ, దేవుళ్లూ చాలా గొప్ప 'కాకేశ్వరులూ', "కాకాత్ము"లూనా! ప్రహ్లాదుడూ—ధృవుడూ (విష్ణువుకు), హనుమంతుడు (రాముడికి), అర్జునుడు (కృష్ణునికి), గణపతి (పార్వతీ పరమేశ్వరులకి), ఇంద్రుడు (త్రిమూర్తులకి ఏకంగా!) కాకాపట్టిన పురాణపు మొగవాళ్లలో చెప్పతగ్గవాళ్లయితే, ద్రౌపది (కృష్ణుడికి) సీతా—అహల్యలు(రాముడికి), అనసూయ (త్రిమూర్తులకి) సావిత్రి (యముడికి) పౌరాణిక ఆడవాళ్లలో "కాకేశ్వరిణు"లు !! నామీద కోపగించక పై చెప్పిన వ్యక్తులు తమ తమ ఇష్ట దైవాలని మెప్పించి మేలు పొందడానికి ఎలా "కాకా దండకాలు" చదివిందీ తిరిగా చిత్తగించండి.

వీళ్లందర్నీ తలతన్నినవాళ్లు, అడవుల్లో షికార్లు చేసిన మునులు ! ఒక్కొక్క ముని అరడజనుకి తక్కువ కాకుండా, "కాకా శాస్త్రాలు" వ్రాశారు. మనకు అవి కాకాశాస్త్రపు ఎన్సైక్లోపీడియాలిటాటి !! ఇక సరేసరి,—వాళ్ల "కాకాణువులు", (మునులని తమ 'రాజగురువు' లుగా వేసుకున్న)

మహారాజులు !! దశరథుడు వశిష్ఠ, విశ్వామిత్రుల విద్దరినీ 'కాకా పాకం" తో సంతుష్టిపరచి 'మిత్రుల' ని చేసుకుంటే, ధర్మరాజు "కాకాటవి"లో కృష్ణుని వేటాడించాడు !

సాహిత్య కాకాధిపతులు :—

రాజరాజనరేంద్రుడు 'నన్నయ్య' కి 'కాకావంకా' విసిరి, రాజులకే కాకుండా, సాహిత్యరంగంలో కూడా రాజేంద్రు డయ్యాడు. మనుమసిద్ధి 'తిక్కన' కి తన 'కాకా ధూపం' తో వూదరగొట్టి, తిక్కవెర్రు లెక్కించి, తాను "సిద్ధి" పొందాడు. కృష్ణదేవ రాయలు 'కాకాపాకం' కొద్దిగా చిక్కటిది. 'పెద్దన'కి పెద్దవాడవని 'కాకాయణం' చదివి వినిపిస్తూనే, "అష్ట కాకాజాల" ని కొత్తపదం "కాకా పదకోశా" నికి చేరుస్తూ, ఎనిమిదిమంది 'కాకేయు'(కవు)లకి భారీఎత్తున "కా(కి) కా బురఖా" వేశాడు వాళ్లు ఎటూ వెళ్లకుండా. శ్రీనాథుడు మహారాజుల 'కాకా వాయిద్యా' నికి (నాగస్వరానికి పాము నృత్యం చేసి నట్లు) సాహిత్య కవనం చేశాడు. ఎటొచ్చీ, 'కాకా' నీడ పడనిది పిచ్చిపోతనకే ! నేటి రచయితలో, అంటారా ? మీకు తెలియందేముంది ?!

చారిత్రాత్మక కాకా ఛత్రపతులు :—

అశోకుడు 'బౌద్ధమత వుద్ధ(రి)రణ" అంటూ ప్రజలకి "నిద్రమత్తు (మందు)" తీర్థం తలా కాస్త చేతిలో వడ్డించాడు. అక్బరు "హిందూ ముస ల్మానుల సఖ్యత" అనే "కాకాపాడి" కళ్లల్లో చల్లి, కాలం వెళ్లబుచ్చాడు. శివాజీ "ముస్లిమ్ నాశనం" అనే "కాకామందు" వాడ్తే, ఔరంగజేబు "హిందూ విధ్వంసం" అనే కాకాదవా" శ్రీ నన్నయి జరిపాడు.... పాత చరిత్ర లెందుకు, ఆధునిక యుగ 'కాకా చిత్రాలు' చెప్పమంటారా ? సరే—యిక చదవండి:

మాస్కో:— కమ్యూనిజం వ్యాప్తి అంటూ ప్రజలకి "కాకా జోలపాట" పాడేడు బతి కున్నన్నినాళ్లూ స్టాలిన్. ప్రస్తుతం, "కేపిటలిజంతో పోరాటం, మానవుని విశ్రాంతరాళ పయనం" అనే "కాకా యుగళగీతం" కృశ్చేవ్ బృందం పాడుతోంది.

పికింగ్ :—వేరే చెప్పక్కరలేదు .... సహకార వ్యవ సాయం అంటూ "కాకాహాలం" ప్రజలచేత పట్టిం చారు యిన్నాళ్లూ అక్కడి బకాసుర నియంతలు. ఎంత దున్నినా, పంట లేకపోతే, వచ్చింది చాలక పోతే, ప్రజల గుండెల్లో 'మంట' మళ్లీ బయలు దేరింది. కసితీర్చుకోడానికి వేరే మార్గంలేక, 'అదే' పనిగా (చేసేపని ఏం లేక !) జనాభా (నిగుమతి) ని పెంచారు. ఆ జనాభా తగ్గుదలకి, గొంగళిపురుగు చైనా అధినేతలు పరదేశ దురాక్రమణ చేయడాని కనే రూపాన, జనాభాని కొద్దిగా పరలోకాలకి సర్దు బాటు చేశారు. ఆ 'కాక బ్రహ్మ' కృప ఉంటే, "మిగతాది" కూడా మరికొద్ది రోజుల్లో సర్దుబా టవవచ్చని వోక ఆశావాది కుశంక !

వాషింగ్టన్ :—సీ. టో, నా. టో (కాటో గాటో వేటో లేటో వగ్గురా వగ్గురా ....) లంటూ సంపా దించినది ఖర్చుపెట్టలేనంత ఆదాయుంగల (?) సామాన్యపౌరుడి 'పర్సు' ని కొల్లగొన్నారు అక్కడి పరిపాలకులు. ప్రస్తుతం, వెనకపడ్డ బడుగు దేశా లకి సహాయం రూపేణా, అదే 'కాకాయిజం" వ్యాప్తి చేస్తున్నారు నేటి అమెరి(కా)కా వాసులు!

లండన్ :—భారత్ తమ చేతుల్లో ఉన్నంత [illegible] "రవి అస్తమించని [illegible]" [illegible] దంటూ "కాకా ఆక్రందన" లు చేశారు. ఆ రవి కాస్తా అస్తమించిన తరువాత, 'సూయజ్ కాలువలో ఇంగ్లండీయుల ఈత' అంటూ "కాకూవులు" వూగారు ! అదీ ముగిసింది .... ప్రస్తుతం ? 'కాకా గీతాలు' తిరిగ్గా థేమ్సు నది వొడ్డునా, ఐర్లండు దీవి మధ్యనా కూర్చుని పాడుకుంటున్నారు.

కరాచి :—కాకుంటే—రావల్పిండి :—హిందూ ముసల్మాన్ జాతి విద్వేషం, కాశ్మీర్ ఆక్రమణం, నదీ నీటి తగాయిదాలనే మూడు సితార్ల మీద కర్ణ కఠోరమైన "(కా)కవ్వాలీ" లు పాడారు మొన్నటి దాకా. ప్రస్తుతం, భారత్‌కి విదేశీ సహాయం గూర్చి కరాచీ (పాకిస్థాన్ ప్రధాన బాకా !) రేడియో స్టేషన్ నించి "కాకా విషాద (విలాప) గీతాలు" భారీ ఎత్తున ప్రచారం చేస్తున్నారు ప్రధాన పాలకుల సౌకర్యార్థం .... (ప్రజలు "వివిధ భాగతీ'—సిలన్‌ల మధ్య నృత్యం చేస్తుంటారు)




హస్తినాపురి :—ప్రతి అయిదు సంవత్సరములకీ, భారత దేశీయుల్లో కొందరు ప్రజలకి తమ ఇష్ట ఫలసిద్ధి ప్రాప్తికోసం, అందరూ కలిసి "ఎన్నికల (కాకా) సందోహం" జరుపుతారు. ఆ 'కష్టం' ప్రాప్తించిన ప్రతివాడూ, "కాకోపనిషత్తు" క్షుణ్ణంగా పఠించి, సామాన్య ప్రజల పాద సన్ని ధికి వాల్తాడు, నానా అడ్డమైన వాగ్దానాలూ చేస్తాడు, ఓట్లు కూడా వేసుకుంటాడు ! సర్వజన విదిత విషయం కనుక, ఆ విషయం గూర్చి వేరే వివరించను.

"కాకా మేడీజీ" "దశసూత్ర ప్రణాళిక" :—ఈ క్రింది పద్ధతిలో "కాకా పులావు/తైలము" తయారుచేసుకుని, సత్ఫలితముల బడయవచ్చును :

(1) తాలూకాఫీసులో చలానా కట్టాలా ? అక్కడి ప్యూను(డి) కి పై పులావు తైలము ప్రాసి మాలిశ్ [illegible]

(2) బస్సులో సీటులేదు, అయినా, మీరు 'క్యూ' లో నిలబడ తలచుకోలేదు కదూ ? "కండ క్టర్ సాబ్ .... జరా కృపాకరో .... " బస్ : ఆ బస్సు మీ యింటిదాకా వస్తుంది. అలాగే సినిమావాళ్ల దగ్గర టికెట్లు తీసికోడానికి కూడా ! వీలయితే 'ఆడవాళ్ల' ని, లేకుంటే క్యూలో ముందున్న పురుష పుంగవుని మీ 'కాకా తైలం' తో సత్కరించండి : కాని పనంటూ లేదు !

(3) కాలేజీలో చదవక, పరీక్షలు బాగా వ్రాయక, తప్పుతానని భయపడుతున్నారా ? భయపడకండి. మీ ప్రొఫెసర్‌జీకో భార్యకో (అదే, వారి) కుమార రత్నానికో—చేతనయిన విధంగా "తైర్" (అన్య భాషాపదం మన 'కాకా' కి: ఆంగ్లంలో 'ఫ్లానింగ్' అని, హిందీ—ఉర్దూల్లో "మస్కా మాలిశ్" అని [illegible]) కొట్టండి. అంతే ! మీరు [illegible] కాకున్నా, కనీసం '(గేస్' (మార్కుల') తో పాస్ గట్టున పడ్తారు.

(4) మీ 'కాజువల్ లీవ్' (సాధారణ సెలవు— అని ఒక సోదరుడి స్వేచ్ఛానుకరణ!) అయిపోయింది కదూ ? కానీ, మీరు ఆఫీసు ఎగ్గొట్టాల్సిన అత్య యిక (అవ్‌కోర్సు అనవసర) పని ఉందా ? ఆల్ రైట్ : రేపు ఆఫీసు ఎగ్గొట్టా లనుకుంటే, నేడు మీ ఆఫీసరువర్యు లన్నమాటకల్లా 'ఎస్సర్' అనండి, సర్వసాధారణంగా ఆయన వేసే నేలబారు జోకులయినా సరే, (అవి మీరు యిదివరలో వెయ్యిమార్లు విని ఉన్నా సరే !) "బాకుల్లా అవి నా మదిలో దిగినయ్ సుమా"—అని ఆయనకి తట్టేలా, తెరలు తెర లుగా ఆయనకి ఆత్మవిశ్వాసం కలిగేలా నవ్వండి ....

41–వ పేజీ చూడండి

## వనితాలోకం

# "చిన్నపిల్లలూ - పెద్దమాటలూ!"

**ఎస్. సత్యవతీమూర్తి**

ముఖ్యంగా ఈ వ్యాసం కొంతమంది ఇటువంటి పిల్లలను చూశాక వ్రాయాలని బుద్ధి పుట్టింది. చిన్నపిల్లలు, పెద్దకబుర్లు ఎందుకు చెప్తారూ? అంటే.... అది వారి తల్లులు పెంపకం మీద ఆధారపడి ఉంటుంది. పిల్లలకు మంచి శిక్షణ యివ్వక, వారిమీద శ్రద్ధాశక్తులు తీసుకోక పోవటమే దీని ముఖ్యకారణం. చిన్నపిల్లల మనస్తత్వం చాలా విచిత్రమైనది.. ఆ తెలిసీ తెలియని జ్ఞానంలో పిల్లలు ఎటు త్రిప్పితే అటు తిరుగుతారు. ఏ పద్ధతిలో పెంచుతే, ఆ పద్ధతిలోనే పెరుగుతారు' అందుకనే ప్రతిస్త్రీ ఎవరి పిల్లలవట్ల వారు, తల్లిగా తమ బాధ్యత నిర్వహించాలి. అలా చేసిననాడు పిల్లలు వృద్ధిలోకి రాగలరు.

సంసారంలో భార్యా—భర్త లిరువురకూ సమాన బాధ్యత ఉన్నా పిల్లల విషయంలో భర్తకంటే భార్య ఎక్కువ శ్రద్ధతీసుకోవాలి. ఏమైనా, పిల్లలను మంచి మార్గంలో పెంచే పద్ధతి తల్లికి తెలిసినంత బాగా తండ్రులకు తెలియదు. అందుకే పిల్లల ప్రవర్తన బాగులేకపోతే "అదంతా తల్లి యిచ్చిన శిక్షణ అంటారుగాని, తండ్రి యిచ్చిన శిక్షణ" అని మాత్రం అనరు. అది లోకసహజం, నిజంకూడా!

ముఖ్యంగా ఆడపిల్లల విషయంలో తల్లులు శ్రద్ధా, జాగ్రత్తా తీసుకోవాలి. పిల్లల వడవడికా, మాటలతీరూ గమనిస్తూ— వారు అనవసరమైన పెద్ద విషయాలు మాట్లాడినా, ఇంటి విషయాలు బైటపెట్టినా, వెంటనే తల్లి మందలించి.... మరి ఎప్పుడూ పిల్లల నోటినుండి అటువంటి విషయాలు బైటకురాకుండా సరియైన త్రోవలో పెట్టాలి. పిల్లలు చూస్తే వేలెడంత ఉండరు — మాటలు కోటలు దాటుతాయి. పెద్దవారికి కూడా లేనంత అనుభవంతో మాట్లాడుతారు. ఆ మాటలతీరు చూస్తూ ఉంటే, కోపంతోపాటు జాలి కూడా వేస్తుంది. "వృద్ధిలోకి రావలసిన పిల్లలు సరైన క్రమశిక్షణలేక ఎలా పాడయిపోతున్నారో! అనిపించి క్షణకాలంపాటు వారి 'తల్లులు'కూడ మనస్సులో మెదలకపోరు.

నాకు మొన్నిమధ్య జరిగిన సంఘటన గుర్తుకు వస్తోంది. ఆరోజు మధ్యాహ్నము నాకు ఇష్టమైన 'శరత్' నవల చదువుతూ కూర్చున్నా! ఘమంగా కథ పట్టులో ఉంది. ఆత్రుతగా చదువుతున్నాను. అదే సమయంలో మాకు తెలిసిన "ఒకామె" వచ్చింది ఆమెను పలకరించి, కూర్చుందికీ చాపపరచి.... అమ్మతో చెప్పాను. అమ్మ రాగానే, నా గ్రంథ పఠనంలో లీనమయిపోయాను. ఆమె అమ్మతో మాట్లాడుతున్నదల్లా మధ్యల్లో ఆపి "ఏమమ్మా? అలా మొహాన పుస్తకం పెనుకు, కూర్చోకపోతే మాతో ఏమైనా కబుర్లు చెప్పరాదూ?" అంది. "ఏ మున్నాయండీ.... చెప్పటానికి?" అంటూనే మర్యాదగా ఉండదని పుస్తకం మూసి వారి ప్రక్కన వచ్చి కూర్చున్నాను. నిజానికి చెప్పాలంటే కబుర్లు ఉంటూనే ఉంటాయి. కాని అనవసరంగా మాట్లాడటం నాకు ఇష్టముండదు. ఆ మాట, ఈ మాట మీద 'సరోజ' ప్రసక్తి వచ్చింది. "సరోజ పురిటికి వచ్చిందట....మీకు తెలుసా?" అంది అమ్మతో ఆమె. "ఇప్పుడు మీరు చెప్పటమేగాని.... కాకూ, తెలియదు. అయితే ఎన్నోనెల?" అంది అమ్మ యదాలాపంగా.

"ఏమో! నాకూ సరిగా తెలియదండీ? అయినా మా 'రాధ'ను అడిగితే మనకి అన్నీ తెలిసిపోతాయి. దానికి తెలియనివంటూ లేవు" అంది గొప్పగా. ఇంక ఆమె వెళతారనగా కూతురు రాధ రానేవచ్చింది. వస్తూనే అమ్మా!.... నీవు ముచ్చట్లు చెప్పటానికి ఇక్కడికి వచ్చి ఉంటావని...అనుకొనేవచ్చాను. ఇంట్లో నీ కాలు నిలవదుగా! అంది ఆ పిల్ల. "సరేగానీ, రాధా! సరోజ పురిటికి వచ్చిందటగా!.... వచ్చి ఎన్నాళ్లవుతోందో?" అంది కూతుర్ని చూస్తూ తల్లి. అడిగిందే తడవు వెంటనే అందుకుంది ఆ అమ్మాయి. "అవునమ్మా! వచ్చివారం రోజు లయింది. ఎనిమిదవ మాసం వచ్చేసిందని స్వయంగా మొగుడేవచ్చి దిగబెట్టాడట. పురుటికి అయే ఖర్చులకు డబ్బుకూడా పంపుతానన్నాడట పిల్లకి (21) 'ఇరవై యొకటి చేసుకొని, తీసుకొని వెళ్లిపోతాడట. ఎందుకంటే అతడికి హోటలు తిండి పడదట," కీ యిచ్చి వదలిపెట్టినట్లు గుక్క తిప్పుకోకుండా చెప్పేసింది రాధ. ఆ పిల్లకి నిండా పట్టుమని పదేళ్లైనా, లేవు. "పిట్టకొంచెం, కూత ఘనం" అన్నట్లుగా మాటలు. ఆ పిల్లమాటలు తీరు చూస్తూ ఉంటే ఆశ్చర్యంతోపాటు చెప్పలేనంత బాధకూడ కలిగింది.

"అయితే, రాధా! ఈ సంగతులన్నీ నీకు ఎలా తెలుసూ?" అన్నాను ఉండబట్టలేక.

"తెలియటానికేముంది, మొన్నబడిలో సీత చెప్పింది వాళ్ల అక్కయ్య గురించి అన్నీనూ!" అంది.

"మీరు చదువుకోకుండా ఈ విషయాలే మాట్లాడుకుంటారా?" అన్నాను. నవ్వుతెచ్చుకుంటూ! ఆ అమ్మాయి ఏమీ మాట్లాడలేదు. తల్లే, ఎత్తుకుంది.

"ఎందుకు చదవదూ?.... బాగానే చదువుతుంది. ఎంతా, చదవకపోతే ఐదవతరగతి కెలా వచ్చిందమ్మా? పోతే తెలివైనది. అన్నీ తెలుసుకుంటుంది" అంది ఆవిడ సగం నొచ్చుకుంటూ, కొంత గర్వంతో.

వాళ్లు వెళ్లగానే అమ్మ అంది, "అంతచిన్న పిల్ల! రాలుగాయిలా ఎలా మాట్లాడిందో చూశావా? అని. "అదంతా ఆ తల్లి ఇచ్చిన క్రమశిక్షణ" అన్నాను, ఏమిటాలో తోచక.

కొంత మంది తల్లులు పిల్లల్ని ఈ విధంగా పాడుచేస్తూ ఉంటారు. పిల్లలు తెలిసో, తెలియకో, అటువంటి పెద్దమాటలు మాట్లాడినప్పుడు వారికి నయానా, భయానా నచ్చచెప్పి, వారినోటి నుండి అటువంటిమాటలు వెలువడకుండా చూడాలి. ఇంకా కొంతమంది పిల్లలు ఉంటారు. వారు ఇంట్లో జరిగినవన్నీ పైవాళ్లకు పూసగ్రుచ్చినట్లు చెప్పేస్తారు, 'వాళ్ల అమ్మని నాన్న దెబ్బలాడేడనో, కొట్టేడనో, ఆ కారణంగా కోపంతో వాళ్లఅమ్మ అన్నంమానుకుందనీ." ఇత్యాదివి చెప్తారు. యింకా.... "వాళ్లకి ఎక్కడ ఎంతెంత అప్పువుందో! వాళ్ల అమ్మ ఒక్కొక్క చీర ఎంత ఖరీదుకు కొంటూ వుంటుందో!" అన్నీ లెక్కకట్టి చెప్పేస్తుంటారు. అది చూసి అన్నీ తెలిసిన పెద్దవారే కొంతమంది, వారిని దగ్గరగా కూర్చోపెట్టుకొని, యింకా గ్రుచ్చిగ్రుచ్చి అడుగుతూ వాళ్లచేత చెప్పిస్తూ! వినోదంగా ఆడిస్తారు. నిజానికి అమాయకమైన ఆ పసిహృదయాలకు, ఎక్కడ ఏ విధంగా మాట్లాడాలో! ఏవి మంచో, ఏవి తప్పో తెలియక పోవచ్చును. అవతల ఇంట్లో తల్లులకూ ఇవతల వింటున్న వాళ్లకూ, తెలుస్తుందిగా!.... మనం వాళ్లని కూర్చోపెట్టుకొని ఇంటి విషయాలన్నీ 'కూపీ' తీస్తూవుంటే ఆ పిల్లలు నిజంగా అన్నీ చెప్పవలసినవే కాబోలు!.... అనుకొని చెప్పేస్తూ వుంటారు. యిటువంటివారిని స్వయంగా చూశాను. సహృదయులూ, వివేకమున్నవారూ, అయితే ఆపిల్లల్ని అలా చెప్పకూడదనీ, తప్పనీ, మందలించి, తగిన జాగ్రత్త తీసుకోమని ముందుగానే తల్లులకు తెలియజేస్తారు. ఇటువంటి మంచివారుకూడ లేక పోలేదు. ఇంట్లోవున్న తల్లులకు, బైట పిల్లలు ఏ విధంగా మాట్లాడుచున్నదీ, తెలియకపోవచ్చును. కాని సాధారణంగా పదేళ్లలోపు పిల్లలకు, ఇంట్లో ఒకలాగా, బయట ఒకలాగా మాట్లాడే చాకచక్యం తెలియదు, ఆ వయస్సులో ఇంట్లో, బయటావారి ధోరణీ ఒకలాగే వుంటుంది. దాన్నిబట్టి వారు ఏవిధంగా మాట్లాడేదీ, వారి ప్రవర్తనా, జాగ్రత్తగా గమనిస్తూ — వారు చెడిపోకుండా ముందే మంచి త్రోవలో పెట్టాలి. ముఖ్యంగా పిల్లల ఎదురుగా భార్యా— భర్తల కీచులాటలుగాని, చేసిన అప్పుల గురించి చెప్పుకోటం కాని వీలయినంత మట్టుకు వారికి తెలిసేటట్లు చేయకూడదు. కొన్ని సందర్భాలలో అలా జరిగినా, తిరిగి ఆ విషయాలని పిల్లలు బైటపెట్టకుండా, తగిన అదుపాజ్ఞలలో వుంచాలి. సాధారణంగా పిల్లలవల్లా, నౌకర్లవల్లా ఇంటి గుట్లు బైటకు పొక్కుతాయి. వారిదగ్గరే మనం జాగ్రత్తగా మసలుకోవాలి.

పిల్లలు వయస్సుకి తగ్గట్టుగా మాట్లాడుతూ వుంటే, చూడటానికి ఇంట్లోవాళ్లకూ, బయట వాళ్లకూ అందంగా వుంటుంది. వయస్సుతో పాటూ, మాటలు పెరగనివ్వాలి. ఏణ్ణర్థం, రెండేళ్ల పిల్లలు చిన్నగా చిలకపలుకులు — పలుకుతూవుంటే ముచ్చటవేసి వాళ్లచేత పదే పదే పలికిస్తాం! మూడు నాలుగు సంవత్సరాల పిల్లలు ముద్దుగా వచ్చీ రానీ మాటలు అంటూవుంటే, మనకి వినాలనే అనిపిస్తుంది. ఇంక ఐదుసంవత్సరాలు దాటిన దగ్గరనుండీ అన్ని మాటలు వాళ్లచేత పలికిస్తూ, స్పష్టంగా చక్కటి ఉచ్చారణ నేర్పాలి. రాను రానూ వయస్సుని బట్టి పిల్లల మాటలకు మార్పు తీసుకురావాలి. క్రమేణా తల్లినుండి శిక్షణకు అలవాటుపడిన పిల్లలు జ్ఞానం వస్తున్న కొలదీ ఎక్కడ ఏవిధంగా మాట్లాడాలో, ఏవి చెప్పాలో, ఏవి గోప్యంగా వుంచాలో వారంతటవారే తెలుసుకుంటారు. ముఖ్యంగా

తల్లి, పిల్లలమాటల విషయమై — ప్రత్యేకమైన జాగ్రత్త, శ్రద్ధా తీసుకోవాలి. నిండా పదేళ్ళు కూడా నిండని పిల్లలు "ఇంట్లో అమ్మా—నాన్నల దెబ్బలాటల దగ్గరనుండీ! ఎవరు వూరికి వచ్చారో, ఎవరు రావాలో ! భర్త భార్యని ఎందుకు వదలిపెట్టాడో, విడాకులు ఎవరెవరు ఎందుకు పుచ్చుకున్నారో !.... అన్నీ భోగట్టాలూ, కృష్ణంగా తెలుసుకొని అడిగినవాళ్లకూ, అడగనివాళ్లకూ చెప్తూవుంటారు. గొప్పలు వేసుకుంటున్న "అంత చిన్నపిల్లలు—ఇంత పెద్ద మాటలు" ఎలా మాట్లాడగలరా ? అని ఆశ్చర్య మేస్తుంది. పిల్లలు చూస్తే వయస్సుకు చిన్నా, మాటలకు పెద్దా! అందుకే అంటారు మన పెద్దలు "మొక్కయి వంగందే, మానయి వంగుతుందా ?" అని. పిల్లలు ఈ తీరుగా మాట్లాడే ప్రథమంలోనే వారికి మంచిగా చెప్పి సులువుగా మాన్పించాలి. కొంతమంది తల్లులు, పిల్లలు అటువంటి మాటలు ఎదురుగా మాట్లాడుచున్నా, పట్టించుకోక, నిర్లక్ష్యంగా ఊరుకుంటారు. మరికొందరు వారిపిల్లలు ఆ విధంగా మాట్లాడడం ఏదో పెద్ద తెలివితేటలని మురిసిపోతూ, కుతూహలంగా అడుగుతూ యింకా ప్రోత్సాహమిస్తారు. కొన్ని సమయాలలో అవే మాటలు ప్రమాదాలకు, కూడ దారితీసే అవకాశముంది. అంత చిన్న పిల్లలు పెద్దమాటలు చెప్తూవుంటే తల్లులకెలావున్నా ! వింటున్నవాళ్ళకి మోటుగా, ఏహ్యభావంగా వుంటుంది వారిమీద అసహ్యభావం ఏర్పడినా, వెనువెంటనే వారిని మంచి మార్గంలో పెట్టాలనిపించే, ఆలోచన కూడ స్ఫురిస్తుంది. మరి ఈ కాలంలోకూడ ఇంకా ఇటువంటి పెద్ద విషయాలను ప్రత్యేక శ్రద్ధతో తెలుసుకుంటూ, పెద్ద కబుర్లు చెప్తున్న పిల్లలు వుండటం విచారించదగ్గ విషయమే !

తల్లులు పిల్లలకి చిన్నతనంనుంచి మంచి బుద్ధులు చెప్తూ, మర్యాదగా మాట్లాడటం నేర్పుతూ, చక్కని అలవాట్లను చేయిస్తూ, శ్రద్ధతో మంచి "క్రమ శిక్షణ"తో పెంచాలి. ఈ విధంగా జాగ్రత్త తీసుకున్ననాడు "నేటి బాలలు రేపటి భావిభారత పౌరులు"గా వెలుగొందుతారు. గుణవంతులుగానూ, విద్యావంతులుగానూ పెరిగి, తల్లిదండ్రులకు మంచి పేరును తేగలరు. "ప్రతితల్లి పిల్లల్ని ఆ విధంగానే పెంచుతుందా?" అనీ, "మేమంతా మా పిల్లలకి మంచి శిక్షణే ఇస్తున్నామనీ," మీరు అనవచ్చు. నిజమే ! అసలు నిజం చెప్పాలంటే, తల్లిదగ్గర 'మంచి క్రమశిక్షణతో' పెరిగిన ముచ్చటైన పాపలనూ, గౌరవ మర్యాద అలవరచుకొని చక్కగా మాట్లాడే అమ్మాయిలను చాలామందిని చూశాను. నిజంగా అటువంటి పిల్లలను చూస్తూవుంటే, ముందు ఆ తల్లులను మెచ్చుకోకుండా వుండలేము. ఈ వ్యాసం అందర్నీ ఉద్దేశించి వ్రాయలేదు. అంతా అలాగే ఉంటారని నా ఉద్దేశము ఎంతమాత్రం కాదు. కాని ఈ మధ్య యిటువంటి పెద్ద కబుర్లు చెప్పే పిల్లలను చూశాక యిక వ్రాయకుండా ఉండలేకపోయాను. "వనితావాణి" సోదరీమణులంతా నాతో ఏకీభవిస్తారని ఆశిస్తాను. ★

# అందాలకు చిట్కాలు - 2

## కేశ సౌందర్యం:

కేశ సౌందర్యం అంటే కేశ సంరక్షణ గురించి మాత్రమే రాస్తాను కాని కేశాలంకరణ—జడ వేసుకోవటం ఎలా, ముడి ఏ విధంగా ఉంటే బావుంటుంది—గురించి ఏమీ చెప్పను ! అవన్నీ ఎవరి అభిరుచినిబట్టి వారు అలా మార్చుకోవచ్చు.

## తెలియనవసరం లేని కొన్ని వివరాలు :

1. ప్రతి మనిషి తలమీదా సగటున 120,000 వెంట్రుకలు ఉంటాయి.

2. వీటిలో రోజుకి 40 నుంచి 100 దాకా రాలిపోవచ్చు.

3. చర్మం మీద భాగంలో వెంట్రుకలకి నరాలు కాని, రక్తనాళాలు కాని ఉండవు.

4. సాధారణంగా కేశాలు దినానికి 0.25 నుంచి 0.75 అంగుళాల వరకూ పెరుగుతాయి.

## కేశాలలో రకాలు :

ఇది ప్రత్యేకంగా చెప్పే అవసరం లేదు—కొందరి జుట్టు పొడిపొడిగా ఉంటుంది; మరి కొందరికి పొట్టు రాలుతూ ఉంటుంది; ఇంకా కొందరిది కొంచెం జిడ్డుగా ఉండవచ్చు. కొందరి కేశాలు సన్నగా ఉంటాయి. కొందరివి దట్టంగా, గట్టిగా ఉంటాయి. వాటి స్వభావాన్నిబట్టి ఒక్కొక్క విధంగా 'పోషణ' జరగాలి.

## సబ్బు :

చవకబారు సబ్బులు క్షార గుణం అత్యధికంగా కలిగిఉంటాయి కాబట్టి సుకుమారమైన కేశాలకు హాని చెయ్యవచ్చు. సబ్బు కన్నా షాంపూలు, కుంకుడుకాయ, సీకాయ వంటివి మంచివి.

'పొడి' గా ఉండే జుట్టుకి చమురు పదార్థాలు కొంచెం అధికంగా అవసరం. మరీ చవక సబ్బులు వాడరాదు. ('క్రీం షాంపూ' అని అని అమ్ముతారు. వీటిని వాడొచ్చు.) తలమీద స్నానం చేసేప్పుడు ఎక్కువగా వేడి నీరు ఉపయోగించాలి. అంతేకాక, తలమీద చర్మం వేళ్లతో బాగా 'మర్దనా' చేస్తే మంచిది. తలంటి పోసుకోవటం ఎంత మంచిదో ఆలోచించి చూస్తే తెలుస్తుంది.

మరీ 'సన్న' గా ఉండే జుట్టుకి మరింత జాగ్రత్త అవసరం. ఈ రకం కేశాలు తేలికగా విరిగిపోతాయి. వాటిని దువ్వేటప్పుడు పళ్లు ఎడంగా ఉన్న దువ్వెన వాడితే మంచిది.

ఇటువంటి వెంట్రుకలని బ్రష్‌తో తరచు దువ్వటం అవసరం. మెత్తటి బ్రష్‌లు వాడటం మంచిదని వేరే చెప్పక్కర్లే దనుకుంటాను. వెంట్రుకల 'మొదళ్ల' కింద కొన్ని గ్రంథులు ఉంటాయి. ఇవి మరీ చురుకుగా పనిచేస్తే జుట్టు జిడ్డు కారినట్లు కనిపిస్తుంది. ఇటువంటి జుట్టుకి ధూళి తేలికగా అంటుకుని దుమ్ముకొట్టుకు పోయినట్లు కనిపించవచ్చు. (కొందరు 'కోడిగుడ్డు షాంపూ—ఎగ్ షాంపూ'—వాడుతూ ఉంటారు. అభ్యంతరం లేనివారికిది బాగా పనికొస్తుంది.) ఈ రకం వెంట్రుకలకి కొద్దిగా ఘాటుగా ఉన్న సబ్బు వాడినా ఫరవాలేదు.

## ఒక చిన్న చిట్కా :

ఇదీ ఒక చిట్కాయేనా అని అనిపించవచ్చు కాని—దువ్వుకునే సమయంలో దువ్వెనమీద దూది కొంచెం ఉంచి దువ్వితే జుట్టుమీద దుమ్మంతా దానికి అంటుకుని, తేలికగా తీసెయ్యొచ్చు.

## చుండ్రు—డాండ్రఫ్ :

చుండ్రు —'డాండ్రఫ్'—ఇది తలమీద కొన్ని సూక్ష్మ క్రిములు చేరటంవల్ల వస్తుంది. అందువల్ల డాక్టర్‌కి చూపించుకోవటం మంచిది.

## తలమీది స్నానం :

తలమీద స్నానం—ఎన్నిసార్లు చెయ్యాలి? వారం, పది రోజుల కొకసారి చేస్తే మంచిదని 'నిపుణులు' చెప్తారు. జిడ్డుగా ఉండే జుట్టు కలవారు కొంచెం ఎక్కువసార్లే తలంటుగా నీళ్లు పోసుకోవాలి.

తలమీద చర్మం చేతివేళ్లతో ఎంత తరచు 'మర్దనా' చేస్తే అంత మంచిది.

బ్రష్, దువ్వెనలు వాడే సమయంలో తలమీద చర్మంలోకి రక్త ప్రసారం ఎంత అయితే అంత శ్రేయస్కరం. అందుచేత తల ముందుకు బాగా వంచి దువ్వుతారు కొందరు.

## అన్నిటికన్నా అతిముఖ్యమైన చిట్కా :

కేశాలని వీలయినంత శుభ్రంగా ఉంచి జాగ్రత్తగా పోషించటం !

—వై రా జీ. ★




## సవరించుకోవలసిన కొన్ని లోపాలు

సరోజగారు వ్రాసినట్లుగా అత్తగారు, తల్లి, ఆడబడుచులు, చెల్లెండ్రు, అక్కలు, మా వదినకు మగపిల్లవాడు కలుగుతాడు, మాకు మనవడు కలుగుతాడు అంటారుకాని ఆడపిల్ల అన్న శబ్దము తప్పుజారి అనరు. ఆ మాట విందామన్నా వినలేము. వ్యాసమునకు మణిపూసలాంటి మాటలు వాడేరు. "ఆడపిల్ల లేకపోతే కాలచక్రం దొర్లదన్న విషయం ఎవ్వరు గ్రహించలేదు." అన్నమాట వ్యాసమునకు అందము చేకూర్చినది. ఇటు భార్యలను అనుమానించేవారు ఉన్నారు. అందుల ఈకాలపు చదువుకున్న పురుషులు ఆడది ఒంటరిగా కనబడితే ఏడిపించకుండా వదిలిపెట్టరు. వాళ్లకు ఇంటిదగ్గర ఇట్లాంటి అక్కలు, చెల్లెళ్లు ఉన్నారని తెలిసికూడ ఇట్లా దిగజారిపోతున్నారు.

ఎం. సుభద్రా బలరామ దుర్గరాజా
(చెరుకుమిల్లి)

* * *

ఎం. సరోజగారు వ్రాసిన "సవరించుకోవలసిన కొన్ని లోపాలు" వ్యాసం చదివిన తరువాతనైనా పురుషులు కాస్త అదుపులో ఉంటారని ఆశిస్తాను.

వల్లి. (బొబ్బిలి)

* * *

ఇదివరలో వ్యాసాలు వ్రాసిన సోదరీమణు లందరూ ప్రత్యేకంగా ఒకే ఒక విషయం ఆధారంగా తీసుకొని వ్రాశారు. కానీ సరోజగారు మగవారి నిజమైన తప్పులన్నీ ఒక చిన్న వ్యాసం ద్వారా తెలియపరిచారు. ఈ వ్యాసంలో ప్రతి విషయం గ్రహింపదగినది.

డి. కె. మాయి (గుంటూరు)



వనితాలోకంలో ఎం. సరోజగారు తన వ్యాసంలో సవరించుకొని తీరవలసిన కొన్ని లోపాలు :—

1. ఆడపిల్ల లేకపోతే కాలచక్రం దొర్లదు." కాలచక్రం దొర్లడానికీ (?) మగపిల్లవాడూ ఉండాలి.

2. "స్త్రీలు ఎదుటపడగానే తమ సోదరీమణు లన్న భావన యెవ్వరికీ కలుగదు."

మగవాళ్లు యెదుటపడగానే తమ సహోదరు లన్న భావన స్త్రీ రత్నములకు కల్గునా ? (కలగదని భావము.)

ఇటువంటి చిన్న చిన్న లోపాలను (కోపాలను) వనితలు తగ్గించుకొంటే వ్యాసా లింకా విన్యాసంగా ఉండొచ్చు. రమణ (విశాఖపట్నం)

* * *

ఎం. సరోజగారు లోపాలను గూర్చి చాల పక్షపాతంతో వ్రాశారు. నాకు తెలిసిన ఒక బంగారు వ్యాపారి తన పెద్ద కొడుక్కు తాళా లివ్వలేదు. తన కూతురుకు ఇస్తాడు. కారణం. బుద్ధిమంతురాలు కావటమే.

అనుమానం విషయంలో ఆడవాళ్ల విషయం అందరికి తెలిసినదే. అందితే జుట్టు అందకపోతే కాళ్లు. సహృదయంతో, సానురాగంతో తన్నుజూచే భార్య నెవ్వరనుమానించగలరు ?

శ్రీమతి కె. యమునారాణి (ధేనువకొండగ్రామం)

* * *

నిత్య జీవితంలో ఇటువంటి సంఘటనలు ఎన్నో జరుగుతూ ఉంటాయి. సభ్యత చదువునుబట్టి రాదు. పెరిగిన వాతావరణం, పరిస్థితులను బట్టి ఉంటుంది. చదువుకున్న పురుషులలోనేకాదు; స్త్రీలలో కూడా ఇటువంటి లోపాలు ఎక్కువ కనిపిస్తూ ఉంటాయి. కొంతమంది (పురుషులు, స్త్రీలు) సినిమాలు చూసి, నవలలు చదివి వాటిలోని పాత్రలను, సంఘటనలను ఎదుటివారికి అన్వయించి బాధపెడుతూ ఉంటారు. కొన్ని మరపలేని సంఘటనలను మనస్సులో పెట్టుకుని వాటిలా నటించబోయి కృతకృత్యులు కాలేక బాధపడుతూ, ఇతరులను బాధపెడుతూ ఉంటారు. ఇది చాల శోచనీయమైన విషయం. కల్పనలతో కూడిన కథలను, సన్నివేశాలను వాస్తవికతకు ముడిపెట్టడం తెలివితక్కువ.

విజయలక్ష్మి (కూచిపూడి)

* * *

సిటీ—బస్సులకోసం వెయిట్‌చెయ్యడం నిజమవ్వచ్చు. కాని అక్కడ చాలా సభ్యతగా రోడ్లపై వెళ్తారు. కాని పట్టణాలనుకొనేవన్నీ ఆ విధంగానే ఉంటాయనుకుంటాను. ఇక్కడ కంటే హైదరాబాద్ ఎన్నోరెట్లు నయం. ఇక్కడివారు, రోడ్లు తమ ఇంట్లోని వసరాయే అన్నట్లు నడుస్తారు. బెల్‌కొట్టినా లేవరు. వారిలో మార్పు మరిరాలేదేమో!

ఎస్. కిరణ్మయి (విజయనగరం)

## "ఇంటివారి పోరు"

అద్దె యింట్లో ఉంటున్నవాళ్ల పరిస్థితులను రచయిత్రిగారు బాగా తెలిపారు. మన యింటి దగ్గర ఒకావిడ ఉంది. ఆమె తన ఇంటిని అద్దెకు యిస్తూ ఆ యింట్లోనే ఆవిడకూడా ఉంది. అంచేత బాడిక్కి వచ్చే వాళ్లకి ఒకరిద్దరుతప్ప యెక్కువ పిల్లలు ఉండకూడదు. పిల్లలు ఎక్కువఉంటే యిల్లంతా గలీజా చేస్తారని ఆవిడ అభిప్రాయం. ప్రతిదానికి ఆవిడ పర్యవేక్షణ జరుపుతూ అద్దెకున్న వాళ్లను నానాహింస పెడుతుంది. అంచేత ఎవరూ ఓ పది పదిహేను రోజులకన్నా ఎక్కువఉండక వెళ్ళిపోతున్నారు. పైగా ఆవిడ అంటుంది! "ఎంత మంచిగా ఉన్నా, యెవరూ ఉండక వెళ్లిపోతున్నారని". అలా బాధిస్తుంటే ఎవరుమాత్రం అనుభవిస్తూ ఉండగలరు !

నాగోజి. నాగలక్ష్మి (అనంతపురం)

* * *

ఈ వారం వనితాలోకంలో హైమగారు వ్రాసిన "ఇంటివారి పోరు" వ్యాసము సహజముగా లేదు. ఈ రోజుల్లో ఇంటివారి పోరుకంటే, అద్దెకున్న వారి పోరే ఎక్కువ అని చెప్పవచ్చు. వారు ఇచ్చినటువంటి బాడుగ తక్కువయినను, ఇంటికి వసతులు లేవని ఇల్లుగలవారిని పోరుపెడతారు. అదియునుగాక స్వంతయిల్లు కాదని ఇంటిమీద అంత శ్రద్ధ చూపరు. రచయిత్రిగారు వ్రాసిన ప్రకారము ఇంటివారి పోరు ఎక్కువంటే అసమంజసమే అని నా అభిప్రాయము.

కుమారి లీల (ప్రొద్దుటూరు)

* * *

ఈ వారం పత్రికలో "హైమ"గారు వ్రాసిన వ్యాసం "ఇంటివారి పోరు" చదివాను. అద్దెకున్న ప్రతి వాళ్ళకీ యింటివారి పోరు ఉండనే ఉంటుంది. వ్రాసిన ప్రతీ వాక్యమూ వాస్తవికంగా మనము చూస్తున్నదే కానీ అతిశయోక్తి వ్యాసంలో ఏ మాత్రమూ లేదు. కానీ, అద్దెకున్నవాళ్లు యింటి వాళ్లను ఏడిపించుకుతింటున్న విషయాలుకూడా వ్రాయాల్సింది. ఈ వ్యాసం చదువుతూంటే మా యింటి విషయం వ్రాయాలనిపించింది. మా యింట్లో ఒక వాటా అద్దెకిచ్చాము. భార్యా, భర్త, పిల్ల అని చెప్పి వచ్చి, తల్లి, తండ్రి, బావమరిది మొదలైన యింకా అయిదుగురు ఎక్స్ట్రా వచ్చి చేరారు. అదేమంటే మనుషులు లేరా కాదని పోట్లాడుతారు. నానా యాతనపడి వారిని వెళ్లగొట్టాము. మళ్లీ ఎవ్వరికీ అద్దెకివ్వలేదు. మరి వారి సంగతేమిటి ?

డి. కరుణ (గుంటూరు)

* * *

ఇంటివారి పోరు వ్యాసము చాలా సమంజసముగా యున్నది. మేము కూడా అద్దె ఇండ్లలో ఉండి, ఇంటివారి తిట్లను, వారు పెట్టే బాధలను అనుభవించాము.

వింజమూరి లీలావతి (భీమునిపట్నం)

## వి మ ర్శ

మన వనితావాణి సభ్యులు, లోపాల్ని సవరించుకోండి; సభ్యత నేర్చుకోండి; అమ్మలక్కల కబుర్లు అంటూ ఏవో వ్రాస్తూంటారు. ఈ వ్యాసాలు ఉబుసుపోక లోట్లు ఎంచి చెప్పుకునే అమ్మలక్కల కబుర్లలాగే ఉంటున్నవి కాని, ఈ వ్యాసాల్ని చూసి లోట్లు సవరించుకోవాలని, ఏ వనితలకు అనిపించదు. తోటి ఆడవాళ్ళ లోపాల్ని ఎంచి చూపే వ్యాసాలే కాని, సంఘానికి, దేశానికి పాటుపడిన మహిళలు, మన భారతదేశంలో ఎందరో ఉన్నారు. ఆదర్శమైన మహిళల గురించి వ్రాయమని రచయితలను కోరుచున్నాను.

జి. రాధ (గుడ్లవల్లేరు)

★




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

### 8-2-1963 శుక్రవారము మొదలు 14-2-1963 గురువారము వరకు

### గ్రహస్థితి

కర్కాటకంలో అంగారక రాహువులు; ధనస్సులో శుక్రుడు; మకరంలో సూర్య బుధ శని కేతువులు; కుంభంలో గురువు; కర్కాటక సింహ కన్య తులల్లో చంద్రుడు.

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

గ్రహబలం బాగున్నది. వృత్తి, వ్యవహారాలు మొదలయిన బాహ్య విషయాలలో అనుకూలమైన కాలం. మీరు చేయవలసిన కార్యకలాపాలను సకాలంలో జరుపుకొని స్థిమితంగా ఉండగలుగుతారు. రావలసిన ధనం చాలా భాగం ఈ సమయంలో వస్తుంది. ప్రయాణాలు సంతోషదాయకంగా జరుగుతవి. సుఖ సంతోషాలు లభిస్తవి. ఇతరులను నమ్ముకుని ఏ కార్యంలోను అజాగ్రత్తగా ఉండవద్దు. కుటుంబ విషయాలలో మనస్సుకు నెమ్మది లభిస్తుంది. బంధువులవలన ఇంతకుముందు కలిగిన సంకటములు తొలగిపోగలవు. ఆదాయమును చూచుకొని ఖర్చుచేయుటం అవసరం. ప్రతిపనీ నిబ్బరంతో నిదానంగా చేయుటానికి అలవాటు పడగలుగుతారు. 9, 10 తేదులలో గౌరవప్రాప్తి, క్రొత్త స్నేహం.

*          *          *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

గతవారంకన్నా చాలా అనుకూలమైన సమయం. మీరు మాత్రం వెంట వెంటనే ఒక నిర్ణయం చేస్తూ ముందుకు పోవటం అవసరం. ఆదాయం ఇంతకుముందుకన్నా బాగుంటుంది. ఒకటి రెండు సమయాలలో తెలియకుండా సుఖంలేని పనులలో ప్రవేశించి మరల తప్పుకొనటం జరుగుతుంది. బంధు మిత్రులలో మంచి పేరు లభిస్తుంది. తోటివారివల్ల మంచి పేరు లభిస్తుంది. అధికారులతో సంప్రదింపులు మొదలయిన వాటివలన మీరు అనుకున్నంత ప్రయోజనం కలుగదు. స్నేహితుల నిమిత్తం మీ ఉపయోగం వదులుకొనవలసి వస్తుంది. ధనసంబంధమైన పేచీలు తలఎత్తగల సూచనలున్నవి. ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకొనండి, ఉత్తర దిక్కునుంచి శుభవార్తలు తెలుస్తవి. 11, 12 తేదులలో ఉత్సాహం, స్వల్పలాభం.

*          *          *

### మిథునం :

**(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

బుద్ధిబలం బాగుంటుంది. ఎదటివారి మనస్సు తెలుసుకుని మీ పనిని సాధించుకొంటారు. కొంత వరకు ఆదాయవృద్ధి కనుపిస్తుంది. మిమ్ములను ఆశ్రయించేవారు అధికంగా ఉంటారు. అప్పులు చేయవలసిన అవసరం కలుగకుండా చూచుకొనటం అవసరం. రకరకాల సమస్యలు తలెత్తుతూ ఉంటవి. అయితే దైవానుగ్రహంవల్ల ప్రత్యేకంగా లోక్యం కలిగించుకొనవలసిన అవసరం మాత్రం రాదు. వారం రెండవభాగంలో మీ కార్యక్రమాలలోని హడావిడి, ఆదుర్దా తగ్గిపోతవి. మనశ్శాంతి లభిస్తుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. విలువగల వస్తువులు కొంటారు. బంధుమిత్రులవద్ద నుంచి వచ్చే వార్తలు నిరుత్సాహాన్ని సూచిస్తూ ఉంటవి. 12, 13 తేదులలో ధనలాభం, సుఖం.

*          *          *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)**

ఎంత శక్తి, సామర్థ్యమూ ఉన్నా పరిస్థితులను అనుసరించుకుని పోవలసి ఉంటుంది. ముందుగా మాటఇయటం వల్ల ఈ సమయంలో ఇరకాటంలో పడవలసివస్తుంది. కుటుంబ కార్యకలాపాలలోను, బాహ్యరంగాలలోను ఒకేదఫా డబ్బుకు వత్తిడి కలుగుతుంది. సరిగా వ్యవధిలేకుండా ఎప్పటికప్పుడు కార్యభారం పెరగగల సమయం. ఉన్నత స్థితి యందున్నవారి స్నేహం లభిస్తుంది. మీరు ఏ వ్యవహారంలో పాల్గొంటున్నా పొరపాట్లు రాకుండా సరిచూచుకొవవలసిన అవసరం కలుగుతుంది. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండండి. తలవని తలంపుగా చిక్కు వ్యవహారాలనుంచి బయటపడగలుగుతారు. వృత్తిలో మీ ఉద్దేశ్యాలకు అనుకూలమైన అవకాశాలు లభిస్తవి. 13, 14 తేదులలో ప్రయాణం, ధనలాభం.

*          *          *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ప్రస్తుతం అనేక విషయాలలో సులభంగా బయటపడగలుగుతారు. బంధుమిత్రుల ఆదరం బాగుంటుంది. ధనవ్యయం అధికంగా ఉన్నా లసం తృప్తికి అవకాశం కలుగదు. లోగడకన్నా మనో దారుఢ్యం బాగుంటుంది. సాధారణంగా మీ అభిరుచులకు అనుకూలమైన అవకాశాలు లభిస్తవి. వ్యవహారరంగంలో రాజీమార్గం అనుసరించటం వల్ల చిక్కులను తప్పించుకోగలుగుతారు. వెనుక ముందులు తెలియని సాహసకార్యాలలో ప్రవేశించవద్దు. శుభ, పుణ్యకార్యాలకు ఆటంకాలు రాగల అవకాశాలున్నవి. వృత్తిలో మీ విలువ, పేరు ప్రతిష్ఠలు పెరుగుతవి. కుటుంబ విషయాలలో ఆందోళన, విసుగుదల పెరగగల సమయం. 12, 13 తేధులలో శుభవార్తలు, కార్యసిద్ధి.

*          *          *

### ఈ వారము ధరలు

బంగారము ధరలో మధ్యమధ్య మందీ సూచనలు కనుపించును. మొత్తముమీద తేజీలోనే ఉండును. వెండి ధర నిలకడగా ఉంటుంది. నూలు ధర వారం రెండవభాగంలో తగ్గుదల వస్తుంది. ధాన్యము ధరలో కొద్ది గిరాకీ వస్తుంది. మిర్చి ధర తగ్గే అవకాశాలున్నవి. చింతపండు ధరకూడా మందీ అవుతుంది.

### కన్య :

**(ఉత్తర 2, 3, 4 పా., హస్త, చిత్త 1, 2 పా.)**

ప్రశాంతమైనకాలం. పుణ్యకార్యాలు, కుటుంబంలో శుభకార్యాలు మొదలయినవి సుఖంగా జరిగే సమయం, అధికారులవల్ల కొంతవరకు అనుకూలత కనుపిస్తుంది. వృత్తిలో అభివృద్ధి కనుపిస్తుంది. ఓర్పుతో పనిచేసి ఎదటివారి ఆదరాభిమానాలను పొందగలుగుతారు. ఒక సమయంలో అనవసరంగా అపవాదులు రానున్నట్లు కనుపిస్తుంది కాని, ప్రత్యక్షంగా అపకారం కలుగదు. చేతిలోని ధనాన్ని దుబారా కాకుండా జాగ్రత్తపడటం అవసరం. క్రొత్త మనుష్యులతో లావాదేవీలు లాభదాయకంగా సాగుతవి. ఏ విషయంలోను పట్టు పట్టకుండా చల్లగా ముందుకు సాగటం అవసరం. నిదానంగా ఫలితం లభిస్తుంది. నౌకరులతో పేచీలు రాగలవు. ప్రయాణాలు సాగటం కష్టం. 11, 12తేదులలో వృత్తిలో అభివృద్ధి, వస్తునష్టం.

*          *          *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ప్రస్తుతం మీరు సుఖంగా గడపటానికి అవకాశం కలుగదు. క్షణం తీరుబాటు ఉండదు. ఆర్థికంగా ఫలితం ఉంటుంది. అయితే ఎదటివారి మనస్సును అనుసరించి నడచుకొనటం అవసరం. మిమ్ములను అనవసరంగా కంగారు పెట్టేవారు ఉంటారు. ఈ సమయంలో దైవబలంవల్ల ఏ పనిలోను ఆటంకాలు, అగౌరవము ఏర్పడవు. మీ ఆరోగ్యము, సుఖము చూచుకొంటూ వ్యాపార వ్యవహారాలను సాగించండి. పిల్లల ఆరోగ్యం కూడా సరిగా ఉండకపోవచ్చును. సాహసంతో అప్పులు చేయుటం, క్రొత్తపనులలో పెట్టుబడి పెట్టటంవంటి పనులు చేయుతగిన సమయంకాదు. ఆడంబరం కోరకుండా ప్రశాంతంగా జరిగే మార్గం

కూడదండి. తలవనితలంపుగా కష్టవార్తలు, బంధుమిత్రుల విష్మరాలు వస్తవి.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

ఏ పని ఎందుకు జరుగుతుందో ముందుగా అవగాహన కాదు. ఒక పనికి మరియొక పని, ఒక వార్తకు మరియొక వార్త విరుద్ధ ధోరణిలో కనుపిస్తవి. చూస్తూ ఊరుకోవటానికి మనస్కరించదు. అయితే దైవికంగా అన్నీ ఒకే మార్గానికి వస్తవి. ముందు అనుకున్న ప్రకారం అన్ని వ్యవహారాలు సాగించగలుగుతారు. కుటుంబంలో శుభకార్య ప్రయత్నాలు నెరవేరుతవి. వృత్తి ఉద్యోగాలలో మీ శక్తి సామర్థ్యాలకు తగిన ప్రయోజనం కనుపిస్తుంది. బుద్ధి—వికాసం బాగుంటుంది. ఆదాయవృద్ధి. ప్రయాణం చేస్తారు. మంచి స్నేహితులు లభిస్తారు. సుఖ సంతోషాలు లభిస్తవి. సమయంలో ధనసహాయం లభిస్తుంది. పనులలో మనోనిబ్బరము; ప్రశాంతంగానూ, గోప్యంగాను జరుపుకొనటం అవసరం.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

పరస్పర విరుద్ధ లక్షణాలతో కూడిన సమయం. ఒకప్రక్క గౌరవం, ధనం లభించే సమయంలో మరోప్రక్క నిరుత్సాహ కరమైన వార్తలు తెలుస్తవి. ఆరోగ్యంకూడా లోపించే అవకాశాలున్నవి. సంఘంలో పలుకుబడి బాగుంటుంది. ఖర్చుల భారం పెరుగుతుంది. ఏ వ్యవహారంలోను పొరపాట్లకు అవకాశంలేకుండా చూసుకోండి. ఒకే సమయంలో అనేక సమస్యలు ఎదురు పడతవి. ఆర్థిక చిక్కులు కనుపించినా కార్యభంగంమాత్రం ఉండదు. దొంగతనంగా వస్తువులు పోయే అవకాశాలున్నవి. యంత్రాలు, ఆయుధాలు మొదలయిన వాటిని వినియోగించటంలో జాగ్రత్తగా ఉండవలసిన సమయం. 9, 10తేదులలో శ్రమ, కార్యసిద్ధి.

* * *

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

గతవారంలోని సూచనలే ఈ వారంకూడా అనుభవంలో కనుపిస్తూ ఉంటవి. సుఖము, లాభము లేని పనులు. స్నేహితుల సలహాలను వీలునుబట్టి వినియోగించుకొనటం మీ కర్తవ్యం. అయితే రాబోవు కాలమును గురించిన ఆశలుమాత్రం బాగుంటవి. బంధువుల మూలంగా ఖర్చులభారం పెరగతగిన సమయం. అధికారులను, ఇతర పెద్దమనుష్యులను కలుసుకొనే ప్రయత్నాలు కలిసిరావు. వృత్తిలో శ్రమ వృధాకాదు. కాని, సాధారణఫలితం లభిస్తుంది. కుటుంబంలో తరచు నిరుత్సాహం కనుపిస్తుంది. మీ మాటల మంచితనంతో గౌరవం కాపాడుకుంటారు. శుభవార్తలు తెలుస్తవి. 12, 13 తేదులలో ధనలాభం, విలువగల వస్తువులు కొనటం.

* * *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

మీస్థితి క్రమక్రమంగా బాగుంటుంది. ఇతరుల పోటీ తగ్గుతుంది. కోర్టు కచేరీలలోకూడా అనుకూల లక్షణాలు కనుపిస్తవి. పిల్లలమూలంగా సంతోషము సుఖము బాగుంటవి. ఆదాయం మామూలుగానే ఉంటుంది. ఎప్పటికప్పుడు మీ మాటలను సమర్థించే మనుష్యులు లభిస్తారు. ప్రయాణాలు చేయవలసి ఉంటుంది. ఒక సమయంలో చేసిన పనినే తిరిగి చేయవలసి రావటం వల్ల మనోనిబ్బరం తగ్గే అవకాశాలున్నవి. సంఘంలో మంచివారి సాంగత్యము, సహాయము లభించగలవు. మొత్తంమీద మీ వృత్తి వ్యాపారాలను శ్రమకరంగా నడుపుకొని రావలసిన సమయం. 9, 10 తేదులలో సంతోషవార్తలు, దుబారా ఖర్చులు.

## మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. మీ ఆలోచనలకు స్వల్పమైన మార్పులు వస్తుంటవి. కాని, అందువల్ల ఏ విధంగా లోపం కనిపించదు. వృత్తి ఉద్యోగాలలో మీ బాధ్యతలు సుళభంగా నెరవేర్చుకుంటారు. ఆడంబరం ఎక్కువ. స్థిరాస్తులకు సంబంధించిన మార్పులు మొదలయినవి సులభంగా జరగవు. ఆత్మీయులుగా ఉంటున్నవారే మిమ్ములను చులకనభావంతో చూస్తారు. కాని పర్యవసానంలో మీ మాటకే ప్రాధాన్యత లభిస్తుంది. మీ విధి నిర్వహణలో శ్రమను ఎదర్కొంటారు. కుటుంబ వ్యవహారాలు చల్లబడి విదానంగా ఒక మార్గానికి వస్తవి. 9, 10తేదులలో అనారోగ్య బాధలు, కలహప్రసంగాలు, కార్యానుకూలత.







### జరిగిన కథ

దుర్గాప్రసాద్, విశ్వేశ్వరరావు కుమారుడు; భార్య అనసూయమ్మను హింసిస్తూ ఉంటాడు. దుర్గాప్రసాద్ కుమార్తె శ్రీదేవి జగన్నాథం వద్ద సంగీతం నేర్చుకుంటూ ఉంటుంది. సంపన్న కుటుంబీకుడే అయినా దుర్గాప్రసాద్ పిల్లలను, భార్యను ఉపేక్షించి, త్రాగుడూ, స్త్రీలోలతలకు అలవడతాడు. ఒకనాడు అనసూయమ్మను పొడిచి గాయంచేసి వెళ్ళిపోతాడు. గాయం మానాక, విశ్వేశ్వరావుగారి విధవప్ప చెల్లెలు సుభద్రమ్మ అనే ఆమెను శ్రీదేవికి అత్తయ్య అని పరిచయం చేసింది. అక్కడ శ్రీదేవికి ఆమె మరిది వేణుతో పరిచయమై, అతనంటే ఆకర్షణ ఏర్పడుతుంది. శ్రీదేవికి, శ్యామల, సావిత్రి అనేవారు ఆత్మీయులౌతారు. కాలేజీ విద్యార్థిని నళిని వేణూని ప్రేమిస్తుంది. వేణూ శ్రీదేవులు, పారిపోయి వివాహం చేసుకోవాలనుకుంటారు.

(గత సంచిక తరువాయి)

మరికొంతసేపు తను ఈ ఇంట్లోంచి ఎలా తప్పించుకోవాలా? అని ఆలోచించింది. ఆ సమయంలో ఆమె గదిని శుభ్రం చెయ్యడానికి పనిమనిషి రామి వచ్చింది. శ్రీదేవికి బుర్రలో తళుక్కుని ఒక ఆలోచన తట్టింది. రామిద్వారా తను కొంత కార్యం సాధించవచ్చు. ప్రొద్దుటినుంచి రామితో తను మాట్లాడలేగు.

“[illegible]”

“పొరపాటయిపోయిందమ్మా! మిమ్మల్ని ఆ బాబుగారు దిగబెట్టి ఉంటారనుకున్నాను.”

“అయితే నువ్వు రాత్రి ఎంత సేపటికి వచ్చావు”

“నేను వచ్చేటప్పటికి మీరు పడుకున్నారమ్మా! పెదబాబుగారు మాత్రమే మేల్కొని ఉన్నారు. ఆయ నడిగినా అదే చెప్పాను.”

“ఆ! తాతయ్యతో చెప్పావా?” అని శ్రీదేవి నిర్ఘాంతపోయింది. రామి, తనను పెదబాబుగారు ఏమేమి అడిగిందీ, తనేమి చెప్పిందీ అన్నీ వివరంగా శ్రీదేవితో చెప్పింది. శ్రీదేవికి అప్పుడు, తన నెక్కడికి ఎందుకు వెళ్లద న్నారో అర్థమైంది. ముందు ఈ విషయం తాతయ్యతో చెప్పినందుకు పనిమనిషిని నానా చివాట్లూ వేసింది. పనిమనిషి బిక్కమొహంతో, ఈ విషయం రహస్యమని తనకి తెలియదని, తెలుస్తే చెప్పకపోదునని అంది. శ్రీదేవి మన

# మరువలేని మనిషి

**ఆషాపరేక్**

[అచిర కాలంలో నే హిందీ సినీమా రంగంలో తార పథానికి వస్తున్న కొందరు నటీ నటులను యీవ్యాసాలు రాయమని మేం కోరినప్పుడు, 'ఫలానా విషయమ'నే వారికి చెప్పాముగాని, 'రచన' యీ విధంగా వుండాలీ అని గాని, యిలా రాయండి అనిగాని మేం చెప్పలేదు. ఈవ్యాస రచయిత్రి ప్రఖ్యాత నటి ఆషాపరేక్‌కు పూర్తి భావప్రకటనా స్వాతంత్ర్యం, యివ్వడం జరిగింది. ఇలాగే మున్ముందు మీరు చదువబోయే యితర నటీనటులకు కూడా వాళ్ల యిష్టానుసారం రాయడానికి అవకాశం యిచ్చాము. ఇందులో సంపాదకుల ప్రమేయం ప్రభావం లేవు. ఈ వ్యాసం చదివాక పైనాలుగు ముక్కలు ఎందుకు అన్నామో పాఠకులే గ్రహించ గలుగుతారు. సం॥]



ఆంధ్రసచిత్రవారపత్రిక పాఠకులకు ప్రత్యేక శుభాభినందనల నందిస్తూ ఆశాపరేక్ తన ఆటోగ్రాఫ్‌తో పంపిన చిత్రం.

బొంబాయి చిత్రవిచిత్రాలతో నిండిన నగరం. ఈ మహాపట్టణంలో ఏ మూలకయినా వెళ్లండి మన దేశం మారుమూల ప్రదేశాల ప్రతినిధులు కనిపించక మానరు. ఈ ఊరు ఊసరవిల్లి రంగులు మారినట్లే రంగులు మారుతుంది. రాత్రి సమీపిస్తున్నదనగా ప్రాక్ దిశలో పెద్ద వ్యాపార కేంద్రాలలో ఒకటయిన బొంబాయి క్రమంగా నెమ్మదిగా తయారయి కొత్త ఆకారాలూ, వింత అందాలూ దాలుస్తుంది!

వివిధ వర్ణాల వింత నగరం అని సరిగ్గా పేరు పెట్టారీ బొంబాయికి.. ఇక్కడ రకరకాల వ్యక్తులను కలుస్తారు. అసలయిన బొంబాయి వాసులు ఒకరినొకరు పోలి ఉంటారు, పోలకుండానూ ఉంటారు.

నేనొక వ్యక్తిని కలిశాను. ఈ వ్యక్తినే 'మరువలేని మనిషి' అంటాను. అసంఖ్యాకులయిన బొంబాయి వాసులలో ఈమె ఒక 'హరిణాక్షి.' నా చిన్నప్పటినుంచీ ఈ మనిషికి ఇతరులపయిన అధికారం చలాయించటం అలవాటు. నామీద ఈమె ప్రభావం వర్ణనాతీతం. నా దృక్పథానే పూర్తిగా మార్చేసిందని చెప్పవచ్చు.

నాకు ఆరేళ్లవగా చిత్ర ప్రపంచపు వెలుగు నామీద పడింది. ఒక దశాబ్దంలో నన్ను తారగా మార్చి అత్యున్నత స్థాయికి తీసుకువచ్చేసింది. ఈ పది సంవత్సరాలలోనూ నామీద ఈమె ప్రభావం అత్యధికం అని చెప్పగలను.

నా మొదటి చిత్రం 'ప్రిమియర్' జరిగేరోజు. ఆ సంవత్సరానికే అత్యుత్తమమయిన వినోదంగా

ప్రకటించిన ఈ చిత్రాన్ని చూడటానికి వేలమంది పోలు చుట్టూ మూగారు. చిత్రసీమలో పేరెన్నిక గల వ్యక్తి పుణ్యమా అని నాకు చాలా ప్రశంస లభించింది. పరిచితులూ, అపరిచితులూ కూడా నా నటన ఉత్తమంగా ఉందని అభినందించారు.

నా స్నేహితురాలికోసం నిరీక్షిస్తూ ఉండి పోయాను నేను. నేను మరువలేని మనిషి అని చెప్పిన వ్యక్తి ఈమే! ఒక్కొక్కరుగా వచ్చినవా రందరూ వెళ్లిపోతున్నారు. చివరికి రానే వచ్చింది ఆమె. దగ్గరగా వచ్చి మెల్లిగా అన్నది, "ఇంత త్వరలో విజయం సాధించానని గర్వపడిపోవుకదా!" అని. ఆనేసి ఎంత నెమ్మదిగా వచ్చిందో అంత నల్లగా, ఇంకెవరి కంటికీ కనిపించనట్టుగా జారు కుంది.

అదొక తారలు వెండిన రాత్రి. భారత చలన చిత్ర ప్రపంచంలో ప్రసిద్ధిపొందిన ప్రతి ఒక్కరూ వచ్చారు. తమ తమ అభిమాన నటీనటులను కళ్లారా చూద్దామని వేలకొలది ప్రేక్షకులు గుంపులు గుంపులుగా వచ్చారు. నేనూ హాజర్ అయ్యాను. భరతనాట్యంచేసి చూపాను. అందరూ నన్ను సౌకుమార్యానికీ, కళా కౌశల్యానికీ చిహ్నం అన్నారు. అన్ని మూలలనుంచీ ఈ చిన్ని నర్తకి మీద ప్రశంసలు వర్షించాయి. కాని, నా కళ్ళు మాత్రం నా మిత్రురాలికోసం వెతుకుతూ ఉండి పోయాయి.

ఆమె యథావిధిగా వచ్చింది. ఈ పర్యాయం మరింత దగ్గరగా వచ్చి నా చెవిలో అంది, "ఈ క్షణమే నువ్వు నిర్ణయించుకోవాలి—ఒక్క రోజు యినా నీ భరతనాట్యం అభ్యాసం మానరాదని!" తిరిగి అదేవిధంగా అదృశ్యురాలయిపోయింది. నేను మాట పెగలకుండా ప్రతిమ నయిపోయాను.

ఇంకోసారి నేను నటించిన చిత్రం ఒకదానిని గురించిన సమీక్షలు చదువుతున్నాను. ఒక దానిలో రాసిఉంది :

"ఈమె పురుష హృదయాలను గాయ పరచి, చిత్రవధ చేసే ఉజ్జ్వల కాంతులు కల ఖడ్గం.."

"భారత నాట్య కళలో ఆరితేరినది, వెండితెరకే ఒక అలంకారం ...." నేను విచిత్రానుభూతులకు లోనయి ఉక్కిరిబిక్కి రయిపోయాను. ఇంతలో ఎక్కడినుంచి వచ్చిందో ఈమె, సన్నగా చెప్పింది, "ఇదంతా శాశ్వత మనుకుంటున్నావా ? క్షణ భంగురమనీ, బుద్బుదప్రాయమనీ తెలుసుకో!" అని. ఎప్పటిలాగే నాలో అహంభావం, గర్వం పెరగ కుండా అరికట్టింది.

రోజంతా షూటింగుతో అలిసిపోయి మా ఇంటి వరండాలో విశ్రాంతి తీసుకుంటున్నాను. ఆత్మ పరీక్షలో మునిగిపోయి ఉన్నాను. వైద్యవృత్తి అవలంబిస్తే బాగుంటుం దనుకున్నాను. మానవ సేవకన్నా ఉత్తమం ఏది అనుకున్నాను. ఆలోచనా తరంగాలు ఉధృతంగా వచ్చిపడి పోతున్నాయి. నా స్నేహితురాలు మళ్ళీ ప్రత్యక్షం అయింది. నేనేమి ఆలోచిస్తున్నానో ఎలా తెలుసుకుందో! "నీ వృత్తి మాత్రం ఉత్తమం కాదని ఎవరన్నారు ? ప్రతి దినం ఎందరికి ఉల్లాసం చేకూరుస్తున్నావ్ ? వారందరూ నీవల్లనే కదా వారి దినచర్యలను మరింత ఉత్సాహంతో చేసుకో గలుగుతున్నారు. నీవల్లనే కదా వారి కష్టాలు మర్చిపోగలుగుతున్నారు. కోట్ల మందికి విసుగు పోగొడ్తున్నావు చాలదా ?" అన్నది.

నేనేదో సమాధానం చెబుదా మనుకున్నాను కాని, ఆమె వినిపించుకోలేదు. ఆమె కంఠస్వరంలో అధి కారం ప్రతిధ్వనించింది. కాని సానుభూతికి తక్కువ లేదు.

ఈ మనిషే ప్రతి రోజున్నూ కలిసి నాకెంతో మనశ్శాంతి చేకూరుస్తోంది. నాకు తెలిసినవా రందరిలోనూ ఈమె నేను 'మరువలేని మనిషి.' ఈమె నెందుకు అనామకురాలుగా ఉంచాను ?

ఇలా ఉండటంచేతనే ఎవరికీ తెలియకుండా వచ్చి వెళ్లిపోతూ ఉంటుంది. ఆమె సలహా, హితోపదేశం ప్రోత్సాహం నన్ను వెంకడ తప్పకుండా కాపాడాయి.

అప్పుడప్పుడు అంటూ ఉంటుంది, "నువ్వు ఎక్కువగా నిన్ను నువ్వే కష్టపెట్టుకుంటున్నావు! నీ పనిలో మునిగిపోయి నన్ను గమనించటమే లేదు! నామాట వినక పోయావో జాగ్రత్త! ఒకరితో ఒకరు మాట్లాడుకుంటేనే మనశ్శాంతి, తృప్తి లభిస్తాయి."

ఈ మరువలేని మనిషి ఎవరో ఇప్పటికయినా తెలుసుకున్నారా ? ఇంకెవరో కాదు, అద్దంలో ప్రతిబింబంలాంటి నా నిజస్వరూపమే! నా చుట్టూ ఉద్భవించే వివిధ సమస్యలమధ్య నా మనోస్థైర్యం తప్పకుండా కాపాడే అనేపరేక్ ద్వితీయ స్వరూపం.

నేను కలిసినవా రందరిలో మరువలేని మనిషి, అంటారా, కలవనివా రందరిలోనూ మరువలేని మనిషి, అంటారా ? మీ ఇష్టం. ★



ఇద్దరూ తెలుగు తారలే "ఇద్దరూ బొంబాయి సినీరంగాన ప్రవేశించారు"
సావిత్రి, జమున [ఫొటో: ప్రభాకర్]

వచ్చే వారం మరో వ్యాసం
రచన
మనోజ్ కుమార్

## అమెరికన్ సైంటిఫిక్ ఫిలిం ఫోరమ్

సామాన్యంగా సినిమా అంటే కాలక్షేపానికి పని కొచ్చే పదార్థమనే దురభిప్రాయం ఉన్న మనకి సైన్సు గురించి సినిమాలు చూపిస్తే మొదట అర్థంకావనీ రెండోది అర్థం అయినా అంత బాగా చూసి నేర్చుకునే ఓపికా ఉండదనీ అనుకుంటారు. కానీ శాస్త్ర విజ్ఞానం పెంపొందించాలి అని ఎంతో శ్రమిస్తున్న యీ తరుణంలో అమెరికను సమాచార శాఖ, అమెరికన్ సైన్సు ఫిలిం సంఘంవారూ కలిసి నగరంలో గతమాసం 21 నుంచీ 24 వరకూ చూపించిన సైన్సు చిత్రాలు, విద్యాధికులను విద్యార్థులను కూడా ఎంతో ఆకర్షించాయి. పైగా ఎన్నో తెలియని విషయాలను బోధపరిచాయి. వీరు భౌతిక రసాయనిక వైద్య శాస్త్రాలకు చెందిన 'ఫిలిమ్సు' లా, ఆధునిక అంతరిక్ష యాన శాస్త్రానికి సంబంధించిన చిత్రాలు చూపించారు.

వీటి ప్రదర్శనను ప్రారంభిస్తూ 20 వ తేదీ (జనవరి) నాడు మద్రాసు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ డా. లక్ష్మణస్వామి మొదలియార్ యిటువంటి చిత్రాలు విద్యాబోధనకు, శాస్త్ర పరిజ్ఞానానికి

# అవీ - ఇవీ - అన్నీ

ఎంత అవసరమో పేర్కొన్నారు. ప్రయోగాలు, ప్రత్యక్ష సాక్ష్యాలు లేందే 'సైన్సు' చేయడమే గాదు, చూడటం, నేర్చుకోడం కూడా అసాధ్య మన్నారు. ఆరోజు 'సైన్సు బోధనకు కొత్త విధానాలు' అనే శీర్షిక క్రింద చేర్చిన రెండు సినిమాలు ముఖ్యంగా 'సైన్సు' విద్యార్థులకు కుతూహలాన్ని పెంపొందించేవి ప్రదర్శించారు. ఈ 'ఫోరమ్' నిర్వాహకులను అభినందించనివారు లేరు. అందరికీ యీ చిత్ర ప్రదర్శనలపట్ల కృతజ్ఞతా భావమే కలిగింది అంటే యీ సైన్సు ఫిలిమ్ ఫోరమ్ గురించి వేరే ప్రశంస అక్కరలేదేమో.

## ముడిఫిలిం గురించి

ముడి ఫిలిం డిస్ట్రిబ్యూషన్‌ను యికమీదట వాణిజ్య పరిశ్రమల మంత్రిత్వశాఖకు మారుగా సమాచార మంత్రిత్వశాఖ చేయగలదని యింత వరకూ ఈ నిర్ణయం జరిగిందేగాని, ఆచరణ జరుగ లేదని వార్త.

## వాసవీ చిత్రం

వాసవీ వారి తొలి చిత్రానికి నామకరణ మహోత్సవం పూర్తయిందనీ, "అనుబంధాలు" అని వీరు తమ తొలి కానుకకు పేరుపెట్టారని తెలుస్తోంది.

## జమునా – హిందీ సినిమా

గతమాసం తొలి వారంలో బొంబాయి రాక్సీతో సహా మరో డజన్ థియేటర్లలో రిలీజైన ప్రసాద్ ప్రొడక్షన్స్ 'హమ్‌రాహీ' ప్రీమియర్ షో బాగా జరిగిందని వార్తలు వచ్చాయి. ఈ చిత్రంలో రాజేంద్రకుమార్‌తోపాటు కథానాయికగా నటించిన తెలుగుతార 'జమున' ఉత్తరాది ప్రేక్షకులకూ పత్రికలకూ కుతూహలాన్ని పెంపొందింపజేసింది. బొంబాయినుంచి వస్తున్న వార్తలనుబట్టి జమున చిత్రోచితమైన రూపురేఖా విలాసాదులు గలదే గాని ఆమె ఉచ్చారణ కొంత నాసిగా ఉందని తెలుస్తోంది. హంరాహీలో మరో విశేషం ఐదుగురు ప్రఖ్యాత హిందీ హాస్యగాళ్ళు ధుమాల్, ఆగా, రాజేంద్రనాథ్, రత్నాన్‌లు ఉండటం. దీని దర్శకత్వం తాతినేని ప్రకాశరావు. విమర్శకుల ప్రేక్ష



"కుక్కపిల్లలను పెంచడం తార 'జమున' సరదాల్లో ఒకటి" [ఫొటో: ప్రభాకర్]

**కొత్త శీర్షిక!**

# తెర మీద - తెర వెనుక

**వివరాలు పైవారమే!**



"ఎదురీత" చిత్రంలో కాంతారావు, కృష్ణకుమారి.

కులు కూడా దీనిని బాగా మెచ్చుకుంటున్నారు ఈ చిత్రంలో 'శశికళ' నటన మరో మెట్టు ఎక్కింది అని జనవాక్యం. జమునా ప్రత్యగాత్మ మున్నగువారు దీనికి హాజరయ్యారు.

## హీరో దాత్త గాథ
## (లేక)
## కొత్త హిందీ సినిమాకి పేరు

'జూతా పాలిష్ కరేగా' అంటే 'బూట్లు తుడుస్తానా' అని తాత్పర్యం. ఇది హిందీ హీరో (బయిస్కోపుల ప్రపంచంలోనే సుమా) అన్నాడు. అన్నాడా? పాడేడు. కొన్నాళ్ల తర్వాత యిదే పేరుతో ఓ సినిమా వొస్తోంది. పేరులోనే గలదు పెన్నిధి అన్నారు. అందుకనే యీ సినిమా బాక్సాఫీసును చితగ్గొడ్తుంది. అది అలా ఉంచి యీ పేరు చూడండి 'ముఝే జీనేదో' నన్ను బ్రతకనివ్వండి అని తాత్పర్యం. సరే ప్రేక్షకులు నాలుగు డబ్బులిచ్చి చూసి, బ్రతకనిచ్చారు. ఆవెంటనే "మైనే జీనా సీఖ్ లియా" అని ఓ సినిమా. సరే 'నాకు బ్రతకడం వొచ్చింది' అన్న యీ హిందీ హీరో వూరుకున్నాడా? "మైన షేమేహూఁ" అన్నాడు. అంటే నాకు వొంటిమీద తెలివిలేదూ అని భావం! భేష్ యింకేం జనం విరగబడి చూశారు—హీరోకి వొంటిమీద తెలివి లేకపోవడమే కదా అసలు క్రైమ్ రోమాంసుకి నాంది అని కూడబలుక్కుని జనం మరీ మరీ చూశారు. ఓహో! యింకేం "దిల్ తేరా దివానా" అంటూ మరో బయిస్కోపు దిగింది. అంటే "నాకు నీ పిచ్చెక్కింది" అని అర్థం.

ఎందుకయ్యా యిదంతా జరిగిందీ అంటే బ్రహ్మదేవుడు ఓ అమ్మాయిని సృష్టించేడు. అది చూసి సినీబ్రహ్మ మరో హీరోయిన్ని కల్పించుకున్నాడు. ఇక ఆ హీరోయిన్ చుట్టూరా దీపంపురుగ్గా కొంచెం సినిమాల్లోనూ, ఆమ్మీదట మరిన్ని సినిమాల్లోనూ యిలా అలా అలా యిలా తిరిగి హీరో చివరకి "మంకీ బ్రాండ్ లో" తయారయ్యాడు. 'తుమ్ సా నహీఁదేఖా' అన్నాడు మొదట అనగా "నీలాంటిదాన్ని నే చూల్లేదు ప్రేక్షకులమీద వొట్టు" అని అర్థం. "దిల్ దేకే దేఖో" అంటే నీ గుండెకాయ (హృదయం) నిలా పారేసి చూడమని తర్జుమా. ఇలా అన్ని యిక్కట్లు పాల్లై పాడిపాడి "తేరేఘర్ కే సామనే" అంటే నీ "ఇంటిముందు" అన్నాడు (టైకొట్టొస్తాడు?) ఏం చేస్తాడో ఆ హీరో; మనకితెలీదు. బహుశా "మై దివానా హూఁ" నేను పిచ్చివాణ్ణి అంటూ కూలబడతాడు. అంతేనా, ఆ హీరోయిన్ యింటికి రాగానే "జీ చాహ్తా హై తస్వీర్ తో కోజానే ఆప్ కీ" అంటే "నీ ఫోటో పోటీ తీస్కోవాలని నా మనస్సు పీకుతోంది" అని (తెనుగర్థం)—అంటాడు. ఇన్ని యిలా అంటూనే "నాటీ బోయ్" (కోతి బాలుడు) వేషాలు "ఆఫ్ టికెట్" దొంగవేషాలు అవి వేస్తాడు—వేసి "హమ్ హిందుస్తానీ" అని అరుస్తాడు!!

ఆనక ఆఖర్న మళ్లీ 'మైతో తుమ్ పర్ మరేనా' (నేను నువ్వంటే పడి చస్తాను) "దునియా సే నహీఁ డరేగా" (ప్రపంచం అంటే భయం నాస్తి). "జూతా పాలిష్ కరేగా" (అంటే తొలి పేరా చూచునది) అంటాడు—అందుకనే యీ ఆఖరి 'చరణం' పేరుతో మరో సినిమా వస్తుందని పాఠ్యం అంటున్నా.

—వి. కృష్ణానంద్.

# సరాగమాల సందేహాలు

ఈమధ్య గీతాంజలి పాట ఒకటి వింటుంటే, కాకతాళీయంగా రావు బాలసరస్వతిగారు గుర్తువచ్చారు. నిజానికి వీరిద్దరి గొంతులకు దగ్గర సంబంధం ఉందా అని నా కనిపిస్తూంది అన్నట్టు ఈమధ్య బాల సరస్వతిగారు ఏమైనా పాటలు సినిమాల్లో గాని ప్రైవేటుగా గాని పాడారా ?

మరుపురాకుండా ఉండేట్టు ఆవిడ పాటల గురించి ఒక్క వాక్యం చెబుతారా ?

కస్తూరి (బొబ్బిలి)

* * *

మీరు ఇదివరలో ఇప్పుడును కూడ సి. రామచం[illegible] సంగీతాన్ని అనుకరించడం చాలా సాహసో



వాసవీవారి చిత్రంలో గుమ్మడి.

పేతమైన విషయం అవి, చాలా మేధావంతులకే తగును, అనీన్నూ చెప్పారు. మరి మేము వారి బాణీ కట్టిన పాటలు విన్నాము కాని వారి సంగీతంలో ఏమి గొప్పతనము కానరాలేదు. ఒకవేళ వారు మేధావంతులైతే శంకర్ జైకిషన్, ఓ. పి. నయ్యర్ వారిలాగా ఆకర్షింపబడలేదని నా ఉద్దేశ్యం. మరి వారి వైపరీత్యం ఎందులో ఉందో చెప్పండి. దయయుంచి చెప్పగలరని ఆశించుచున్నాము.

మన తెలుగు రంగంలో అటువంటి మేధాసంపన్నులని ఎవరిని చెప్పుకోవచ్చు (వారికున్న మేధా సంపత్తిలోనే) ? దయయుంచి నా సందేహాలు తీర్చ ప్రార్థన.

అర్జునశ్రీ (తెనాలి)

* * *

'బావా మరదళ్లు' లో నీలి మేఘాలలో గాలి కెరటాలలో అనే పాట కృష్ణకుమారి పాడుతుంది. అసలు ఆ పాట పాడినది సుశీల, లేక జానకినా. ఈ యిద్దరిలో ఆ పాట ఎవరు పాడినారో తెలిపెదరని ఆశిస్తున్నాను. నాకు యీ సందేహము ఎందుకు కలిగినదంటే రేడియోలో నేని పాట విన్నప్పుడు ఒక్కోసారి సుశీల అని, మరోసారి జానకి అని



అన్నపూర్ణ వారి చిత్రంలో కృష్ణకుమారి, నాగేశ్వరరావు.



"పెంపుడు కూతురు" లో దేవిక

చెప్పుచున్నారు. అసలు ఆ పాట పాడినది ఎవరో తెలిపెదరని ఆశిస్తున్నాను.

తల్లంలక్ష్మి తులసి (గుంటూరు)

*   *

"అభిమానం" సినిమాలో "ఎలవుతేనె బాట తొలి వయసు పూలతోట" అనే పాటను — తెర వెనుక ఎవరు పాడినారు? తెరపీద ఎవరు పాడి

# సరాగమాల

వారు? దయచేసి వెంటనే తెలుపండి. మేము— మా ఫ్రెండ్సూ పందెము వేసుకున్నాము కనుక వెంటనే తెలియపర్చవలెను.

లక్ష్మి (మెల్లంపాడు)

*



అన్నపూర్ణా వారు యింకా పేరు పెట్టని చిత్రంలో ఇ. వి. సరోజ.

28—12—62 తేదీ వారపత్రికలో రంగారావుగారు సంగీత దర్శకులు రాజన్, నాగేంద్రల గురించి విమర్శించిన తీరు ఏమీ బాగులేదు వారు అందరివలె అనుకరణ సంగీతము వినిపించినంత మాత్రాన పెద్ద సంగీత దర్శకులతో పోల్చి ప్రతిని మాచి నక్క వాతపెట్టుకుందని వ్రాశారు. అంటే పెద్దవాళ్లను పక్కికి పక్కి అనుకరిస్తే తప్పు లేదు. వీరు అనుకరిస్తే తప్పా. అదిగాక వీరు సంగీతం యిచ్చిన చిత్రము ఏదీ విజయముకాలేదు, అందువలన ప్రజలకు మంచి అభిప్రాయము లేదని వ్రాశారు. ఇది మరీ హాస్యాస్పదముగా ఉంది. చిత్రం విజయవంతం కాకపోతే అందులోని సంగీతము బాగుండ కూడదని ఎక్కడుంది. విజయవంతమైన చిత్రాలలో చెత్త సంగీతము, కాపీ సంగీతమూ లేదా!

రాజన్, నాగేంద్రలు సంగీత దర్శకత్వం వహించిన పాటలలో, ఏపాట విన్నా ఏ నోట కన్నా (వద్దంటే పెళ్లిలో), అందీ అందనినాడు, పదవమ్మా ముందుకు (పెళ్లిమీద పెళ్లి). మాటాడవేమిరా (అన్నా చెల్లెలు) ఇక "కనదుర్గ పూజామహిమలో" హాయిగా నేటిరేయి, "ఏమో కనకదుర్గ", "జయం మనదే". "వరలక్ష్మి వ్రతం"లో జయజగదీశా గౌరీశా, "వరలక్ష్మి కరుణింపవమ్మా" మొదలగు పాటలు విన్న ఏ శ్రోతవారిని అభిమానించకపోడు, బహుశ రంగారావుగారు యివి వినలేదేమో. "పెళ్లిమీద పెళ్లిలో" అనుకరించిన "ఓ మన సొకుముల వలదే" అనుపాట ఏమీ బాగులేదు వికారమైన మాటలు వున్నవని వ్రాశారు. ఆ పాట సుశీల కమ్మని కంఠంతో హాయిగావుంది. ఏమిటోవారికి అందులో నచ్చనిది.

వీరు యిచ్చే సమాధానములలో కొన్ని తప్పులు కూడా దొర్లుతున్నాయి. ఉదాహరణకి ఒహోహో వా పెళ్లంట (మాయాబజారులో) ఆఖరున సత్యం పాడారు అని వ్రాశారు. కాని ఆఖరులో పాడింది ఆ చిత్రానికి సంగీత దర్శకులయిన ఘంటసాలవారు. ఆదే అనుమానము కలిగి మొన్ననే మాధవపెద్ది సత్యం గారినికూడా అడిగాను. జగదీశ్వరా (సువర్ణ సుందరి) పాట చిత్రములో సుశీల పాడింది— బయట రికార్డు జిక్కిది. రంగారావుగారు యిది కూడా తప్పు అని వ్రాశారు. రంగారావుగారు ఈ పొరపాటును గమనిస్తారని ఆశిస్తాను.

పి. శరత్‌కుమార్ (కొత్తగూడెం)

•   *   •

మేము ఆకుల నర్సింహారావుగారు అర్థాంగిలో పాడిన పాట "రాధను రమ్మన్నాడు" అనే పాట చాలాకాలం క్రిందట విన్నాము. తరువాత వారి కంఠస్వరము ఇంతవరకు వినలేదు. వారు ఈ ఒక్క పాటేనా సినిమాలో పాడినది. వారు చాలా పాటలు పాడినారని విన్నాము. కాని మాకు అవి ఎక్కడా దొరకలేదు. మీరు వారు పాడిన పాటలమీద ఇంత వరకు సమీక్ష చేయలేకపోయాము. అందుచేత వారు ఏ ఏ సినిమాలలో పాడినారు, వారు పాడిన పాటలమీద మీ అభిప్రాయము మున్నగు సందేహము తీరుస్తారని ఆశిస్తున్నాం.

(శ్రీమతి మెంటె రంగారావు (భీమవరం)

★





## చౌ చౌ

(పురాణపఠనం మాదిరి:—)

జంబూ ద్వీపంబున భరత ఖండమున ఆంధ్ర దేశమున అనకాపల్లి యను నొక పురంబు సకలైశ్వర్యములతో విరాజిల్లుచుండె. ఆ పురంబున నాగయ్య నివసించుచుండె. అతని మాత రోగవాత బడి—కతిపయ దినంబులకు గతించె. శ్రాద్ధ కర్మాది కార్యములు, యధావిధి జరుగుచుండ నొకనాడు పేరిశాస్త్రి నాగయ్యను ప్రక్కకు పిలిచి......

(పౌరాణిక నాటక ఫక్కీ:—)

పేరిశాస్త్రి: మీ మాత ఎంత సాధుశీలయ్యైనను మానవమాత్రురాలు గాన ఈ లోకమున కొన్ని పాపములు చేసియుండనోపు.

నాగయ్య : అందులకు సందేహమేల. నిక్కముగా చేసియుండనోపు.

పే : చేసిన పాపములు మాసిన గాని వైతరణి దాటుట అసాధ్యము. మీమాత పాపములు బాపి ఆమెను వైతరణి దాటించి, స్వర్గము చేర్చవలెనన్న ఒక్కటే మార్గము గోచరించుచున్నయది.

నా : ఏమది !.... సందేహించెదరేల ?.... శెల వొసంగుడు.

పే : నీవు గోదానము చేయవలె.... నీ మాత వైతరణి దాటవలె.

నా : అటులనా.... యోచింతునుగాక (తెర)

(బుఱ్ఱకథ వరుస:—)

ఆంధ్రపత్రిక— అభిమానులారా
హమేషా— తమాషా పాఠకులారా
చౌచౌ కథను— చదువుగ రండీ ॥భ॥

దానము చేయగ గోవు తెచ్చెను— సై
దానిని చూసి శాస్త్రి మెచ్చెను— సై
ఆవును దానము చేశాడు—
అపుడే శాస్త్రిని అడిగాడు ॥భ॥

"శాస్త్రిగారూ ! మా జనని— సై
దాటెను కదూ ? వైతరణి"— సై
"స్వర్గము జేర్చెను ఆమెను గోవు—
ఋణము తీర్చావు తల్లికి నీవు" ॥భ॥

పాలేరు వెంకయ్యని— సై
పిలిచెను వేగమె నాగయ్య— సై
"గట్టిగ గోవును, మన గొడ్లపాకలో—
కట్టివేయరా...... వెంకయ్యా" ॥ఆం॥

(వ్యాఖ్యానంవలె:—)

ఏరు దాటాక తెప్ప తగలేసే రకం మనుష్యులు ఉంటారంటే ఆశ్చర్యం ఏముంది ? నాగయ్యలాటి మనుష్యులకు— నీతి, న్యాయాలకు సంబంధం ఎక్కడుంటుంది ? దానము చేసిన గోవుని తిరిగి దొడ్డికి తోలించుకు పోతుంటే పేరిశాస్త్రి నోరు

విప్పి ఆశ్చర్యంగా చూడటం మినహా మరేం చేయగలడు ?

వి. రామకృష్ణంరాజు (పాందువ్వ)

* * *

గోపాలరావుగారు ఇంటికి వచ్చేసరికి ఆయన సతీమణి ఇంటి కప్పు మీద తలకిందులుగా నడుస్తోంది.

"ఏమిటి చేస్తున్నావ్ ?" అని గద్దించారు.

"ఏముందా, చూరుమీాగ తల కిందులుగా నడుస్తున్నా!" అంది ఆవిడ.

"నువు చేసేపని భౌతిక శాస్త్ర సూత్రాలకు విరుద్ధం తెలుసా?" అని కేకేశారు గో. రా. గారు.

పాపం ఆవిడ అమాంతం కిందపడి పోయింది. కొన్ని క్షణాల తర్వాత లేచి నుంచుని, "భౌతిక శాస్త్ర సూత్రాలు తెలిసినంతమాత్రాన బయట చెప్తారేమిటి?" అని కళ్ల నీరు పెట్టుకుంది.

మణి (మద్రాస్)

## ఆత్మ కథ

నేను అయ్యానిప్పుడొక్క అడ్వకేటు
ఉంటుంది నా వంటిమీద నల్లకోటు
ఇంటర్‌లో నా గ్రూప్ లాజిక్కు
నన్ను తప్పించి అది చేసింది మాజిక్కు
రెండు వర్షాలలో పూర్తి చేశాను ఇంటర్
చాలా పునాది గలవాణ్ణని అందరూ అంటా
తరువాత నేను చేరింది బి. కాం
తిరిగి తప్పడమే అయింది నా కామ్
నాలుగుసంవత్సరాల్లో పరాగ్గా (పరాకు + ?
బోర్డరు మార్కులతో నెట్టాను అలాగ్గా
'అబ్బాయి ఏం చేస్తావురా ఇక' అడిగారు నా
'చదువుతానండి బి. ల్' అన్నాను నేను
మూడేళ్లకే నెట్టేశాను
నాలుగో ఏటే పక్కన డిగ్రీపెట్టా
బి. కాం. బి. ఎ
అయ్యా, అయ్యాను నే నిప్పుడొక లాయ
ఇక పెట్టాలి న్యాయానికి తయ్యార్
తయార్‌కు మొదలుగా కట్టాను బోర్డు
రంగం బి. కాం. బి. ఎల్, లాండులార్డు
ఇప్పుడందరూ అంటారు నన్ను ప్లీడరూ
సంఘంలో నన్ను చూస్తారు యాజ్ ఎలీడరు

(షరా:—ఇప్పుడు చాలా తక్కువ కేసులు వస్తున్నాం నాకు. దయచేసి యిది చదివినవారు ఖూనీల దొంగతనాలూ పెంచి సహాయముచెయ్యండి నాకు.

సత్యగోపాల్, (గుంటూరు.)






సూరిశాస్త్రి ఒక్కడూ చీకట్లో కూర్చున్నాడు. రోజంతా ఏడ్చిన కళ్ళు ఎరుపెక్కిపొంగేయి. చెంపలమీద కన్నీళ్ళ చారలు కట్టేయి. మరి ఏడవ డానికి వోపికలేదు. తండ్రి ఏనాడో పోయేడు. ఆరోజే తల్లి కూడా చచ్చిపోయింది.

ఊళ్ళో కొందరు "అయ్యోపాపం!" అన్నారు.

మరికొందరు "శనిగొట్టు వెధవ! అమ్మనీ, నాన్ననీ కూడా పొట్ట పెట్టుకున్నాడు" అన్నారు.

మేనమామ బహిరంగంగా ఏమీ అనలేదు. బాగా చీకటి పడ్డాక వంటింట్లో భార్య దగ్గర కూర్చొని, "ఏమే. మరి వీడి సంగతేలా?" అన్నాడు.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. ఇహ ఆ జన్మాంతం వీడు మనకి గుదిబండలా వేలాడుతూ ఉంటాడు" అంది.

"పోనీ ఇకమీదట వాడిదారి వాణ్ణి చూసుకో మంటే?"

"ఎలా అంటాం? వాడి అమ్మ తాలూకు పొలం ఉందిగా?"

"కుర్ర వెధవ. వాడికీ సంగతి ఎలా తెలుస్తుంది"

"వాడికి తెలియకపోతేనేం? ఊరివాళ్ళకి తెలుసుగా? వీడు తిన్నగా పినతండ్రి దగ్గర చేరేడంటే ఆయన వీణ్ణి మెల్లిగా దువ్వి ఆ పొలం కాస్తా తన పేర రాయించేసుకుంటాడు."

"పోనీ మన దగ్గరే పడిఉండనీ. మరో అయి

లారు సంవత్సరాలపోతే మన సితనిచ్చి పెళ్ళి చేసేస్తాను. కట్నం కానుకలబాధ తప్పుతుంది.''

''బాగు బాగు. ఇదా మీరు ఆఖరికి తేల్చింది? మెల్లకన్నూ, కోతిమొహమూ. ఈ దిక్కుమాలిన వాడికి బంగారంలాంటి నా కూతుర్ని ఇస్తావా? వాడ్ని ఎలాగైనా పట్నం తరిమేసి వూళ్ళో అందరితో పారిపోయేడని చెప్పండి.''

''మెల్లిగా మాట్లాడూ! గోడలకి చెవులుంటాయి'' అన్నాడు మేనమామ.

గోడలకి చెవులేకాదు. కన్నాలుకూడా ఉన్నాయి. ఆ ఇంటి గోడలన్నీ మట్టి గోడలు. అతనికి బోలెడు ఆస్తి ఉన్నా, పై పూరివాళ్ళకి బీదవాడుగా కనిపిస్తాడు.

''చాలా నిరాడంబరమైన మనిషి'' అంటారు అతని అంతరంగికులు.

''పరమలోభి'' అంటారు వూళ్ళో వాళ్ళు.

ఆ మంటిగోడకి చేరబడి పెరట్లో కూర్చున్న సూరిశాస్త్రికి వాళ్ళిద్దరూ అనుకున్న మాటలన్నీ వినిపించేయి. అర్ధరాత్రిదాకా ఆలోచించి, ఆలోచించి చివరికి ఒక నిర్ధారణకి వచ్చాడు. అక్కడి నుంచి కదిలాడు. తెల్లవారేసరికి దగ్గరలో ఉన్న పట్నం చేరుకున్నాడు.

రైల్వే ప్లాటుఫారంమీద ఒక బండీఉంటే అది ఎక్కాడు. ఆ బండీ పోయి, పోయి కలకత్తాలో ఆగింది. అక్కడదిగిపోయాడు సూర్యం. పుట్టినప్పటినుంచి పల్లెటూరు వాతావరణంలో పెరిగిన సూర్యానికి హౌరా ప్లాటుఫారంచూస్తే భయం వేసింది.

ప్లాటుఫారం బయటకొచ్చిచూస్తే సుదూరంలో ఒక పెద్ద వంతెన కనిపించింది. జనమంతా ఆ వంతెనవైపు నడుస్తుంటే అటువైపు నడిచాడు. వంతెన దాటిన తర్వాత ఎటుపోవాలో తెలియలేదు. ఎదురుగా ఒక దుకాణంఉంది. అందులో ఒకడు పూరీలు చేస్తున్నాడు. రోడ్డుమీద ఒక బల్లమీద అయిదారుగురు కూర్చొని ఆకుల్లో వాటిని వేయించుకొని తింటున్నారు. పక్కనే ఒక పెద్ద కుంపటిమీద మరొకడు టీ తయారు చేసి, మట్టి పాత్రలలో టీ పోసి అమ్ముతున్నాడు.

పూరీలవాసన తగలగానే సూర్యానికి ఆకలి వేసింది. సాయంత్రందాకా అలానే నిల్చున్నాడు. చీకటి పడుతుంటే ఎవడో సూర్యం తలమీద ఒక హోల్డాలూ, చేతిలో సూటుకేసూ పెట్టి హౌరా స్టేషన్‌దాకా నడిపించి, అర్ధరూపాయి చేతిలో పెట్టి పోయేడు. అటువంటి బేరమే మరొకటి తగిలి మరో అర్ధరూపాయితో తిరిగి పూరీల దుకాణం దగ్గర చేరాడు. పూరీలూ, కూరా తిని, మిగతా డబ్బు దుకాణంవాడి చేతులో పెట్టి ఆ రాత్రికి అరుగుమీద పడుకోడానికి అనుమతి సంపాదించాడు సంజ్ఞల ద్వారా.

దుకాణంవాడు సూర్యాన్ని ఏవేవో అడిగాడు. భాష రాదని సూర్యం చేతులతో చెప్పేడు.

''మద్రాసీ?'' అన్నాడు దుకాణంవాడు.

తల అడ్డంగా ఆడించాడు సూర్యం.

''తెలంగీ?'' అన్నాడు.

అవునని తల ఆడించాడు సూర్యం. మరో అరగంటకి ముసలివాడొకడు నూనె సీసా ఒకటి పట్టుకొని దుకాణం దగ్గర కొచ్చాడు. దుకాణంవాడు వాడికేదో బంగాళీలో చెప్పాడు. ముసలాడు నవ్వాడు. సూర్యంవైపు తిరిగి తెలుగులో,

''నువ్వు మా దేశం వోడివా కుర్రోడా?'' అన్నాడు.

సూర్యానికి ప్రాణం లేచివచ్చింది. అవునన్నాడు.

''ఇక్కడేం సేత్తన్నావ్?'' అన్నాడు.

సూర్యం జవాబు చెప్పలేదు.

''ఇంటికాడినించి పారిపోయొచ్చేవా?'' అన్నాడు.

ఊ కొట్టేడు సూర్యం. దుకాణంవా డిచ్చిన టీ తాగుతూ సూర్యానికో పిడత టీ ఇప్పించేడు ముసలాడు. ఇద్దరూ టీ తాగాక ''మా ఇంటికి పద'' అన్నాడు.

''ఎందుకూ?''

ఎందుకూ ఏటి ఎ (రి మొ గ వా? ఇక్కడేటి సేత్తావు. ఇది కలకత్తా పట్నం! తెలుసా! మన తెలుగూరు అనుకుంటున్నావ్ గావాల్ని. పదపద. ఆలిస్యం అయితే ఆకరిబస్సు వెళ్ళిపోద్ది'' అని సూర్యాన్ని తీసుకొని బస్సుస్టాండు దగ్గరకి వెళ్ళాడు. బస్సెక్కి ఇద్దరూ కిద్దర్‌పూర్‌లో దిగారు.

''ఇంతలేసి పడవలన్నీ ఊల్లోకి ఎలా వచ్చేయి?'' అన్నాడు. సూర్యం, కిదర్‌పూర్‌లోని వంతెన దాటుతూ. ముసలాడు నవ్వాడు.

''ఈ కలకత్తా సంగతి నీ కప్పుడే తెలిసిపోతదా? కొన్నాళ్ళుపోతే నీకే అంతా బోధ అవుది'' అన్నాడు.

గోనె సంచులు తయారుచేసే కంపెనీ జాగాలోకి, వచ్చేరు

''ఈ మిల్లులోనే నా అల్లుడు సర్దార్‌గా పని చేత్తన్నాడు. వారానికి ముప్పైరూపాయ లెత్తుకుంటాడు'' అనా డు గర్వంగా ముసలాడు ''ఆ డింటోనే నేనూ, నా భార్యా ఉంటున్నాం.''

లాబర్ కాలనీలో గస్తీ తిరుగుతున్న గూర్ఖావాడితో ''సలాంభయ్యా!'' అన్నాడు ముసలాడు.

''ఏ కోన్‌హై?'' అన్నాడు గూర్ఖావాడు

''హమారా బేటాకా భాయ్‌హై'' అనా డ. ముసలాడు.

''ఆడికి నువ్వు నా తమ్ముడి కొడుకువని చెప్పేను. ఎడాలో వోరడిగినా అలాగే సెప్పు. పైవోళ్ళు ఈ వడాలోకి రావడానికిల్లేదు'' అన్నాడు సూర్యంతో.

ఒక ఇంటిదగ్గరవెళ్ళి తలుపు తట్టేడు. భార్య తలుపు తీసింది. అల్లుడూ, కూతురూ కూడా మేలుకునే ఉన్నారు.

''ఈ కుర్రోడెవడు మావా?'' అనా డు అల్లుడు.

''ఎవడో నాకేటి తెల్సు? హరిసన్ రోడ్డులో కుండూ దుకాణంకాడ తచ్చాడుతుంటే లాక్కొచ్చాను''

''కూడు తిన్నావా?'' అన్నాడు అల్లుడు. జవాబు చెప్పబోతూంటే పెద్ద ఆవలింత వచ్చింది సూర్యానికి. ఆవలింత పూర్తిచేసి ''తిన్నాను'' అన్నాడు.

''నిద్దరొస్తోందిగావాల్ని. తొంగో. ముచ్చట్లు రేపు సెప్పుగుందాంలే'' అన్నాడు అల్లుడు. ఆ చిన్న గదిలో ఒకమూల బొంత ఒకటివేసేశారు. సూరిశాస్త్రికి పడుకోగానే నిద్ర పట్టేసింది.

తెల్లవారుజామున మిల్లు సైరను కూత కూసింది. అందరితోబాటు సూర్యానికీ తెలివచ్చేసింది. ముసలాడికూతురు అందరికీ టీ కాచి ఇచ్చింది. టీ తాగి అల్లుడు మిల్లుకి వెళ్ళిపోయాడు.

''ఒక్కడివి ఇక్కడేటి సేత్తావ్? నాతో రా. వూరు చూద్దుగాని'' అన్నాడు ముసలాడు ఒక కర్రపెట్టె చంకలో పెట్టుకుని. ముసలాడితో బయలుదేరేడు సూర్యం.

ముసలాడు క్రితంరాత్రి టీ తాగిన కుండూ

## పాలవెన్నెల

అలపర్తి వెంకటసుబ్బారావు

పాల వెన్నెల...మురి
పాల వెన్నెల!
చిట్టిపాప పెదవిపైన
చిందు వెన్నెల...కను
విందు వెన్నెల!!

పాల వెన్నెల...సరి
పాల వెన్నెల!
కలువ కన్నె బుగ్గపైన
కదలు వెన్నెల...మది
మెదలు వెన్నెల!!

పాల వెన్నెల.. తలి
పూల వెన్నెల!
పారిజాత విరులపైన
పఱచు వెన్నెల...మై
మఱచు వెన్నెల!!

పాల వెన్నెల...ము
త్యాల వెన్నెల
చకోరాంకురాలకు భువికి
బాగు వెన్నెల...వొం
గారు వెన్నెల!!

పాల వెన్నెల...అం
దాల వెన్నెల!
పాప లాటలాడ సాయ
పడెడి వెన్నెల...ముద
మిడెడి వెన్నెల!!

## గూటిలో చిలక

దుకాణంటగ్గర బస్సులోంచి దిగేరు. ఇద్దరూ దుకాణంలో పూరీలు తిన్నారు. అక్కడినుంచి హారిసన్‌రోడ్డులోఉన్న ఒక మార్వాడీ కొట్టులోకి వెళ్ళాడు ముసలాడు. క్షౌరపెట్టె విప్పేడు. అందులో మంగలి సామానంతా ఉంది. మార్వాడీకి గడ్డం గీశాడు. ఆవిధంగానే చాలాకొట్లకివెళ్ళి వాళ్ళందరికీ గడ్డాలు గీశాడు. కొందరికి క్షౌరం చేశాడు. పన్నెండు గంటలకి ఇద్దరూ ఇంటికి పోయారు. భోజనంచేసి పడుకున్నారు. అల్లుడు భోజనం చేసి మళ్ళీ మిల్లుకి వెళ్ళిపోయాడు. సాయంత్రం అల్లుడు ఇంటికి వచ్చాడు. అందరికీ మళ్ళీ టీ చేసి పెట్టింది కూతురు.

టీ తాగుతూ, "కుర్రోడా, నీ పేరేటి?" అన్నాడు అల్లుడు.

"సూరిశాస్త్రి"

"సూరిశాస్త్రి బాగోలేదు. సూరిబాబు అని పెట్టుకో"

"పేరు సరేగాని సూరిబాబుకి ఏదైనా ఉద్యోగం సూడు మరి" అన్నాడు ముసలాడు.

"అబ్బే! నాబంనేదు! బర్తీలకి టైము కాదిది. మా మిల్లులో మొన్ననే ఏభైమందిని పనిలోంచి తీసేసినారు. నువ్వే ఎక్కడైనా సూడు" అన్నాడు అల్లుడు.

చీకటి పడ్డాక అల్లుడు చీట్లపేక ఆడ్డానికి దగ్గర్లోఉన స్నేహితుడింటికి పోయేడు. ముసలాడు సూర్యాన్ని వంతెన దగ్గరకి తీసుక వెళ్ళాడు. బాగా చీకటిపడ్డదాకా ఇదరూ వచ్చే స్టీమర్లనీ, పోయే స్టీమర్లనీ చూస్తూ నిల్చున్నారు. రాత్రి భోజనంచేసి ముసలాడు మళ్ళీ బయలుదేరేడు ఊమారు నూనెసీసా చేతిలో పుచ్చుకొని.

"ఎక్కడికి" అనాడు సూర్యం.

"పొద్దున ఎళ్ళిన బాబులికి కాళ్ళు పడతాను, అర్ధరేత్రికుండూ దుకాణంకాడ చాతాగి మళ్ళీ ఒచ్చేత్తాను. నువ్వు తొంగో" అని వెళ్ళిపోయేడు.

మామా అల్లుళ్ళు ఇద్దరూ చాలా ప్రయత్నాలు చేశారుకాని, సూర్యానికి పని దొరకలేదు. ఇంత లేత వయస్సులోని ఎండు కుర్రాడికి పని ఎవరిస్తారు? వాళ్ళింట్లో తిని కూర్చోవడం సూర్యానికి చాలా కష్టంగాఉంది. ముసలాడు వెళ్ళాం మెడలోని నగ అమ్మి లంచంపెట్టి ఉద్యోగం వేయిద్దామని చూసేడు. తీరా ఉద్యోగం అయేవేళకి వయస్సు చాలదు పొమ్మన్నారు.

ఒకరోజు సూర్యం ఒక నిశ్చయానికి వచ్చాడు.

"బాబాయ్. నీ పని నాకు నేర్పు" అన్నాడు.

"నువ్వు సెయ్‌నేవు సూరిబాబూ" అనాడు ముసలాడు.

"అయితే నేను ఇంట్లోంచి వెళ్ళిపోతాను"

ముసలాడు చివరికి ఒప్పుకున్నాడు. కొన్ని రోజుల తర్వాత సూర్యం కూడా ఒక క్షౌర పెట్టె పుచ్చుకొని బయలుదేరాడు.

రోజులు నెలలుగా మారేయి.

"బాబాయ్! ఒక మంచి సెలూను బేరానికొచ్చింది. తీసుకుందాం" అన్నాడు సూర్యం ఒక రోజు.

"మనకెందుకుసూరిబాబూ ఈ బెడద?" అన్నాడు ముసలాడు. ఇద్దరూ అల్లుణ్ణి సలహా అడిగేరు.

"ఎలాగైనా పంతులు పంతులే! గొర్రెతోక

విన్నాళ్ళైనా కొత్తేదే అన్నట్టు ఎన్నిరోజులిలా ఎక్కే గుమ్మం, దిగే గుమ్మం. సేతాౢఉంటావ్? సూరిబాబు సానా తెలివైనవోడు. ఈ రోజుల్లో బిజినెసుతోనే డబ్బుంది మావాఁ! దిగిసూడు. పైన ఆ భగమంతుడు మనని కాయడా?" అన్నాడు అల్లుడు.

ఇంట్లో ఉన్న బంగారం అంతా అమ్మి పెలూను కొన్నాడు. "సూరిబాబు క్షౌరశాల" అని పెద అక్షరాలతోనూ, "ఇక్కడ అందముగా క్రాపులు కత్తిరించబడును" అని చిన్న అక్షరాలతోనూ ఇంగ్లీషులో, హిందీలో బంగాళీలోనూ రాయించి బోర్డు పెట్టేడు సూర్యం.

నెలలు సంవత్సరాలుగా మారేయి.

*   *   *

సూర్యాని కిప్పుడు ముప్పై సంవత్సరాలు. అతని కింద ఒక అర డజను క్షౌరశాల లున్నాయి. బాబాయి చచ్చిపోయేడు. అతని భార్య కూడా పోయింది. అల్లుడూ, సూర్యం ఒక పెద్ద బంగళాలో ఉంటున్నారు.

ఒకనాడు అల్లుడన్నాడు: "సూరిబాబూ! నీకు వయసొచ్చింది. పెళ్లి చేసుకోకూడదూ?" అని.

సూరిబాబు ఆలోచనలో పడ్డాడు. తన పల్లెటూరు, మేనమామ, బంధువులూ, చిన్ననాటి స్నేహితులూ అంతా ఒక్కసారి జ్ఞాపకం వచ్చేరు.

"సరే అయితే! నేను దేశంవెళ్ళి వస్తాను" అన్నాడు సూర్యం.

అదే పల్లెటూరు అదే వాతావరణం. ఇన్ని సంవత్సరాలలోనూ ఆ వూరు అస్సే మారలేదు. ఎలక్ట్రిక్ లైట్లు వచ్చాయి. పట్నంమంచి తన పల్లెకి బండిబాటపోయి కంకరరోడ్డు వచ్చింది.

మేనమామ తల బాగా నెరిసింది. మొఖం ముడతలు పడింది. అరుగుమీద చుట్ట కాలుస్తూ కూర్చున్నాడు. సూటూ, బూటూ వేసిన ఈ పల్లె దొరని ఆయన పోల్చలేదు.

చప్పున చుట్ట పారేసి, లేచి నిల్చుని "ఎవరు బాబూ తమరు?" అన్నాడు చేతులు కట్టుకొని వినయంగా.

"నేను మావా! సూరిశాస్త్రిని" అన్నాడు సూర్యం.

ఆ మెల్లకన్ను పోల్చేడు మావ.

"ఔరా సూరిగా! నువ్వట్రా ఇన్ని సంవత్సరాలు ఎక్కడికి పోయేవ్? ఏం చేస్తున్నావ్? నీ కోసం వెతికి వెతికి కాళ్లరిగిపోయేయిరా బాబూ! నువ్వెళ్లిన దగ్గర్నుంచి నీ అత్త వారంరోజులు వచి. మంచినీళ్లు కూడా తాగలేదు. ఇంటెల్లిపాదీ నీకోసం బెంగపెట్టుకు చచ్చాం. ఎన్నాళ్ల కెన్నాళ్లకు? లోపలికి రా. ఒసేవ్! మన సూరిశాస్త్రి వచ్చేడే....

ఆ రాత్రే భార్యా భర్త లిద్దరూ వంటింట్లో సమావేశమయేరు.

"ఏడి అసాధ్యం కూలా! కలకత్తాలో మంగలి దుకాణాలు పెట్టాట్ట! ఇంకా నయం. ఊళ్ళో ఈ విషయం ఎవరికీ తెలియదు. ఇప్పుడేం చెయ్యడం?" అన్నాడు మావ.

"వయస్సు నెళ్లుతున్నకొద్దీ మీకు బుద్ధిమాంద్యం కూడా వస్తోంది. వాడక్కడ ఏ దుకాణాలుపెడితే మనకేమండీ? అక్కడిదంతా అమ్మించేయండి. శ్రీకాకుళంలో ఒక మంచి ఇల్లు కొరమాడి అక్కడి కంతా పోదాం. ఇహ ఈ వూళ్ళో మనకేముంది? మళ్ళ ఆ అప్పులవాళ్ళు ఉన్నది కాస్త పీక్కుపోకముందే ఇక్కడినుంచి కదులుదాం" అంది ఆయన భార్య.

"వాడు మన మాట వింటాడని నమ్మకమేమిటి?"

"అయ్యోరాత! మీ కన్నీ విడమర్చి చెబుతేనే గాని బోధపడదు. మన సావిత్రినిచ్చి పెళ్లి చేసేద్దాం."

"ఔనేవ్. అది బాగానే ఉందికాని, దానికి నిండా పదిహేనేళ్ళైనాలేవు. పైగా వీడి నలుపూ, మెల్ల కన్నూచూసి అది ఒప్పుకుంటుంది?"

"ఒప్పుకోకపోతే పాలుగు మొట్టికాయలుపెట్టి, మెడ వంచి పుస్తె కట్టిస్తాను. అయినా దాని సలహా అడిగి చేస్తామటండీ పెళ్లి? దాన్ని ఒప్పించే పూచి నాది. మీరుమాత్రం వీణ్ణి మెల్లిగా లొంగదీసి, ఊళ్లో ఎవరికీ ఇలా మంగలి దుకాణాలు పెట్టావని చెప్పవద్దనండి. ఏదో వ్యాపారం చేస్తున్నాననమనండి."

"సరే అయితే" అన్నాడు మేనమామ.

అత్తగారు వంటింట్లోంచి చావడిలోకివచ్చి,

---

ఓ న్యాయవాది, సాక్షుల మధ్య ఇలా సంభాషణ జరిగింది.

"మీ కిటికీ పగిలగొట్టిన రాయి నా రెండు పిడికిళ్ళంత ఉంటుందా?"

"ఇంకా పెద్దదండీ!"

"నా తలకాయంత ఉంటుందా?"

"సైజు అంతే కాని అంత మందం కాదండీ!" సాక్షి ఆలోచించి సమాధానం చెప్పాడు.

రాఘవరావు (బందరు)

---

"ఏమే సావిత్రీ! అలా మొద్దులాగ కుర్చోపోతే బావకి ఏం కావాలో ఏమిటో అడగరాదూ? ఇదుగో! ఈ తాంబూలం తీసుకెళ్ళి బావకి ఇచ్చిరా" అంది ఎంతో గోముగా.

సూరిశాస్త్రి కలకత్తాలోని తన షాపుని రెండు లక్షల రూపాయలకి అల్లుడికి అమ్మేశాడు. భార్య, తనూ, అత్తగారూ, మామగారూ శ్రీకాకుళంలో స్థిరపడ్డారు.

రెండు మూడు కంపెనీల ఏజన్సీలు తీసుకున్నాడు. రెండు లారీలు కొన్నాడు. ఇంటిముందు: "ఆర్. సూరిశాస్త్రి, ప్రొప్రైటర్ సూరిశాస్త్రి ఏజన్సీ అండ్ సూరిశాస్త్రి ట్రాన్స్‌పోర్ట్" అని బోర్డు పెట్టాడు.

*   *   *

సూరిశాస్త్రికి కూతురు పుట్టింది. పెద్దదయింది. విశాఖపట్నంలో బి. ఏ. చదువుతోంది. వేసంగి శెలవులకు ఇంటికి వచ్చింది.

ఒకనాడు సూర్యం భార్యతో "సావిత్రీ! దీనికి పెళ్లి యీడు వచ్చింది. బి. ఏ. పూర్తి చేసింది కదా? ఇహ దీని కేదైనా మంచి సంబంధం చూడాలి" అన్నాడు.

"అదే మీతో చెబుదా మనుకుంటున్నాను. ఈకాలం పిల్లల సంగతి మీకు తెలుసుగా? దానితో నిన్ననే ఈ ప్రస్తావన ఎత్తేను. అది ఎవరో కుర్రవాణ్ణి కాలేజీలో ప్రేమించిందట. వాణ్ణి తప్ప మరో కణ్ణి చేసుకోదట." అందామె.

సూరిశాస్త్రికి కొంచెం కోపం వచ్చింది.

"ఊఁ. వ్యవహారం ఇంతవరకూ వచ్చిందన్నమాట. ఏదీ? అమ్మాయిని పిలు" అన్నాడు.

అమ్మాయి వచ్చింది.

"ఏవమ్మా సరూ! మీ అమ్మతో ఇప్పుడే నీ పెళ్లి ప్రస్తావన తెచ్చాను. నువ్వెవర్నో ప్రేమించావని చెప్పేవట. ఆ కుర్రవాడి వివరాలు నాకు కొంచెం చెబుతావా?"

కుమార్తె చెక్కిళ్ళు కొంచెం ఎరుపెక్కేయి.

"సుకుమార్! విశాఖపట్నంలోనే ఉంటున్నాడు డాడీ! మెడిసిన్ చదువుతున్నాడు. అతని ఎడ్రస్ నీకు రాసి యిస్తాను." అని మళ్లీ సిగ్గొచ్చి అక్కడి నించి వెళ్లిపోయింది.

కుమార్తె చిరునామా రాసి యిచ్చింది. సూరిశాస్త్రి విశాఖపట్నం ప్రయాణమయ్యాడు. రెండు రోజులు గడిచేయి. తల్లీ, కూతురూ డ్రాయింగ్ రూములో కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇంట్లోకి రావడమే విసురుగా వచ్చేడు సూరిశాస్త్రి. మొఖం ధుమధుమలాడుతూ ఉంది.

"ఏమయిందండీ?" అంది భార్య.

"నా పిండాకూడు అయింది" అన్నాడు.

"ఏం డాడీ? సుకుమార్ ఒప్పుకోలేదా?" అంది కూతురు కన్నీళ్లతో.

"నోర్మూయ్. ఈ అనర్థం అంతా నీనించే వచ్చింది. ఏ అడ్డగాడిద దొరికితే వాణ్ణి ప్రేమించేయడమే? కాస్త మంచి, చెడ్డా చూసుకోవద్దూ?"

"ఏం? ఆ అబ్బాయి చేసుకోనన్నాడా?"

"ఎందుకంటాడూ?"

"అబ్బాయి మీకు నచ్చలేదా?"

"అబ్బాయికేం? నిక్షేపంలా గున్నాడు" అన్నాడు సూరిశాస్త్రి నిట్టూరుస్తూ ఒక సోఫాలో కూలబడి.

"మరి? వాళ్లకి ఆస్తిపాస్తులు లేవా?"

"ఆస్తిపాస్తుల కేం లోటు? వాళ్ల నాన్న జడ్జీ పని చేసి రిటైరు అయ్యాడు. స్వంత బంగళా ఉంది. ఇంటినిండా నౌకర్లూ, చాకర్లూ ...."

"హాహా! అయితే కట్నం దగ్గర పేచీ వచ్చి ఉంటుంది. చూడండీ. మనకి ఒక్కగా నొక్క కూతురు. కాస్త కట్నం ఎక్కువ యిచ్చినా అన్ని విధాలా బాగున్న ఇలాంటి సంబంధం ......"

"అబ్బా! అదికాదే. ఆ అబ్బాయి దమ్మిడీ కట్నం లేకుండా చేసుకుంటానన్నాడు."

"అయితే మరేమిటి అడ్డు?"

"అడ్డా, అడ్డున్నరా? వాళ్ల పూర్వీకులు మంగలి పని చేశారుటే! ఖర్మ!" అని సూరిశాస్త్రి దిగాలుగా సోఫాలో కూలబడిపోయేడు.



## శ్రీదేవి

19-పేజీ తరువాయి

న్నులో తీవ్రకోపం రగులుకోసాగింది. వెలిగే నా పీల్లెనంలు త్వరలో వేణును కలియాలి.

"ఒసే! రామీ! ఈసారైనా నువ్వు, జాగ్రత్తగా నే చెప్పినట్లు చెయ్యి. ఈ విషయం ఎవరికీ చెప్పకు. ఇదిగో ఈ డబ్బు తీసుకో. నేను ఉత్తరం రాసి స్తాను అది నిన్న నువ్వు చూసిన బాబుకియ్యి. ఆ బాబు ఎక్కడుంటారో చెప్తాను" అని రామి చేతులో పది రూపాయలు పెట్టింది. రామికి, అప్పటి కిది యువతీ యువకులమధ్య నడిచే రహస్య వ్యాపార మనీ, తను తెలివిగా ప్రవర్తిస్తే చాలా లాభం పొంద వచ్చునని అర్థమైంది.

"అవన్నా! ఆ బాబుగారు ...... మన సందు మొదట్లో ఉన్న కిళ్ళీకొట్టు దగ్గరే ఉన్నా రమ్మా" అంది రామి.

"ఏమిటీ, ఏదీ. ఎవరి ......" అని సంతోషాశ్చర్యాలతో అడిగింది శ్రీదేవి. రామి తను క్రితంరోజు చూసిన బాబేనంది. శ్రీదేవి కిటికీ లోంచి ఒకసారి చూడమంది శ్రీదేవి చూసింది. దూరంగా కిళ్ళీకొట్టు దగ్గర తమ మేడ కిటికీవైపే చూస్తున్న వేణు కన్పించాడు. శ్రీదేవిని చూసి, ఒకసారి చెయ్యి వూపాడు. వెంటనే శ్రీదేవి రామిని అతని దగ్గరకు వెళ్ళి ఎద్దైనా ఉత్తరం ఇస్తాడేమో అనుకోమంది.

రామి మళ్ళీగా మేడదిగి వీధిలోకి వెళ్ళింది. వేణువైపు చూస్తూ శ్రీదేవి కిటికీ దగ్గరే నిల్చుంది. ఆమెకు కాలం, దూరం, అధిగమించే శక్తి ఉంటే వేణువద్దకు వెళ్ళి, అతని చేతుల్లో వాలిపోయేది. ఆమెకు ఆ సమయంలో ప్రపంచంలో తనకు అన్నిటికన్నా కావలసింది వేణు! అతన్ని కలిసి మాట్లా డాలని మనస్సు తహతహలాడిపోతోంది. ఆమెకు గుర్తు వస్తోంది. వేణూ, తనూ కలిసి ఎక్కడికో పోవాలి! తనకు దూరంగా కన్పిస్తున్న వేణును ఎంత చూసినా ఆమెకు తనివి తీరడంలేదు. రామి వేణువద్దకు వెళ్ళడం, అది తనవైపు చూపించి ఏదో చెప్పడం, వేణు ఫాంటు జేబులోంచి ఒక కవరు తీసి రామి కివ్వడం చూసింది. అప్పటినుంచి రామి ఎంత తొందరగా వచ్చేస్తుందా అని ఆమెకు ఆత్రుత ఎక్కువైంది. తనే మేడదిగి వెళ్దామనుకొంది. కాని, క్రింద అందరూ ఉంటారు. అందుకని తను తన గదిలోనే కాలుకాలిన పిల్లిలా తిరగ సాగింది. రామి రాగానే, దానిచేతిలోంచి ఆ కవరు లాక్కుంది. వెంటనే చదవసాగింది.

అందులో వేణు మధ్యాహ్నమంతా తనకోసం ఎదురు చూశాడనీ, బహుశా ఏదో కారణంవల్ల తను రాలేకపోయి ఉండవచ్చుననీ, అందువల్ల ఆమెను కలియడానికి తనే వచ్చాననీ, ఒకవేళ కలియ డానికి వీలుంటుందో, ఉండదోనని ఉత్తరంలోనే అన్ని విషయాలూ రాసి పంపుతున్నానని ఉంది. పూర్వం ఏదో వివాహం చేసుకోవడానికి అన్ని ఏర్పాట్లూ చేస్తున్నాననీ, ఆరోజు రాత్రి పన్నెండు గంటలకు తను పెరటివైపు ఆమెకోసం సిద్ధంగా ఉంటా ననీ, ఆమె రాగలదో, లేదో వెంటనే తెలియబర్చుమని ఉంది. శ్రీదేవి ఆలోచించింది. ఈ రాత్రే! అబ్బ! తనకు విముక్తి లభిస్తుంది! వేణు ఇంత తొందరగా ఏర్పాటు చేస్తున్నందుకు ఆమె చాలా సంతోషిం

చింది. వెంటనే తను ఒక కాగితంమీద తను తప్పకుండా వస్తున్నానని రాసింది. రామి ఆ కాగితం తీసుకువెళ్లి ఇవ్వగానే, వేణు చిరునవ్వు నవ్వి, వెళ్లిపోయాడు. అప్పటినుంచి శ్రీదేవికి ఒకటే ఆతృత!

రాత్రి ఏడుగంటలనుండి పన్నెండు గంటల వరకూ అందరి లెక్కల ప్రకారం అయిదు గంటలు. కాని కొందరికి అది అయిదు నిముషాలుగా తోచవచ్చు. మరికొందరికి అయిదు యుగాలు లాగ కూడా ఉంటుంది. ప్రపంచంలో మనకు కనిపించేదీ, వినిపించేదీ, తోచేదీ, చాలావరకూ బాహ్యపరిస్థితులమీదా, మన మనోస్థితిమీదా ఆధారపడి ఒక్కొక్కరిలో ఒక్కొక్క రకమైన అనుభూతి కల్గిస్తుంది. అంతవరకు తనకు ప్రియతమములైన ఇల్లూ, తనగదీ, శ్రీదేవికి జైలులా కన్పించడం, తన తలితండ్రులు తన శత్రువులులా కన్పించడం, తను కొద్దికాలంనుండే ఎరిగున్న వేణు, తనకు అత్యంత ఆప్తుడిగా తోచడం, ఇదంతా యవ్వనం ఆమె మనస్థితినిబట్టి కల్గిస్తున్న అనుభూతి కాక మరేముంది. స్త్రీ పురుషులమధ్య ఇంత ప్రబలమైన ఆకర్షణ కల్పించిన సృష్టికర్త, స్త్రీలను శారీరకంగా, అబలలగా సృష్టించినా, వారికిచ్చిన మనోబలం విషయంలో మట్టుకు పొరపాటు చెయ్యలేదు. వయసు వచ్చేసరికి వారు తమ పాత పరిసరాల్ని సులభంగా మర్చిపోయి, నూతన వ్యక్తితో జీవితం గడపడానికి సిద్ధమవడమే అందుకు నిదర్శనం. శ్రీదేవికి భవిష్యత్తు గురించి బెంగలేదు. అది అమాయకత అని అనడానికి వీల్లేదు. ఆమెకు ప్రపంచజ్ఞానం లేకపోలేదు. తనవారికి తను చెయ్యబోయే పనివల్ల ఎంత కష్టం, ఎంతకోపం వస్తాయో తెలుసు. కాని, ఆమె వారిని వదులుకోదల్చింది. తనకు కావలిసిందల్లా వేణు!

అతని గురించి ఆలోచిస్తూనే ఆమె ఆ గంటలన్నీ గడిపింది.

పన్నెండవగానే, చేతిలో చిన్న సంచితో ఆమె తల్లిగదిలోకి ఒకసారి వెళ్లింది. అనసూయమ్మ నిద్రపోతోంది. శ్రీదేవి ఆమె తలవద్దనున్న తాళం చెవులుతీసి, ఆమె పెట్టితీసి, అందులోఉన్న కొన్ని నోట్లకట్టలుతీసి సంచిలో పెట్టుకుంది. మళ్లీ పెట్టెకి తాళంవేసి, తాళం చేతులు యథాప్రకారంగా తల్లి తలవద్ద పెట్టింది అనసూయమ్మ గాఢ నిద్రలోవుంది.

విశ్వేశ్వరరావుగారి ఇంటికి విశాలమైన పెరడు ఉంది. ఆ పెరటికి ఒక తలుపు కూడా వుంది. అది రోజూ రాత్రిపూట లోపల కూడా తాళంవేసేసి, జయమ్మ ఆ తాళం చెవులు తనవద్ద ఉంచుకుంటుంది. శ్రీదేవికి పెరటితలుపు తాళం చూసే వరకూ ఆ విషయం జ్ఞాపకం రాలేదు. చుట్టూ చీకటి, నిశ్శబ్దం! ఆ తాళం తియ్యడం సాధ్యం కాదు. ఎందుకంటే, జయమ్మకు చీమ చిటుక్కుమంటే మెలకువ వస్తుంది. అందువల్ల లాభం లేదు. ఏం చెయ్యడమా? అని ఆ చీకట్లో, పెరట్లో నిల్చొని శ్రీదేవి ఆలోచించింది. ఆ నిశ్శబ్దంలోంచి సన్నటి ఈల ఆమెకు వినిపించింది. బహుశా వేణు అటువైపు వచ్చిఉంటాడు. ఇక ఆమె జాప్యం చెయ్యదల్చుకోలేదు. పెరట్లో ఒక మూలఉన్న నిచ్చెన తెచ్చి గోడకు వేసింది. అది సుమారు పది అడుగుల ఎత్తు గోడ! నిచ్చెనమీద ఎక్కింది! గోడమీద కెక్కగానే అవతలవైపు వేణు కన్పించాడు. గోడమీదనుంచి తన్నిస్తున్న శ్రీదేవిని చూస్తే అతను గోడవద్దకు వచ్చాడు. ముందు చేతిలోనున్న సంచి అతనిపైకి విసిరేసింది. తరువాత గోడమీదనుంచి ఒక్క దూకు దూకింది. వెంటనే వేణు ఆమెను పట్టుకున్నాడు. ఆమె కాలికి చిన్న రాతిదెబ్బ తగిలింది. కాని వేణును కలుసుకొన్న ఆనందంలో ఆమె ఆ దెబ్బను లెక్కచెయ్యలేదు. ఇద్దరూ తొందరగా రోడ్డువైపు నడవనారంభించారు. ప్రక్కరోడ్డువద్ద ఒక జట్కా సిద్ధంగావుంది. వేణూ, శ్రీదేవీ అందులో ఎక్కారు. జట్కా కదిలిపోయింది, ఆ చీకట్లో వాళ్ళు ఎక్కగానే.

శ్రీదేవికి ఏం జరుగుతోందో కూడా తెలియనంత అల్లకల్లోలంగావుంది మనస్సు ఇంటికి దూరమైనకొద్దీ, ఆమె మనస్సులో చిన్న ఆందోళన ప్రారంభమైంది. వేణు తన పక్కనే ఉన్నాడు. ఇద్దరూ మౌనంగా ఉన్నారు. వేణు దృష్టి ఎక్కడో వుంది. తాము ఏం చెయ్యబోతున్నామా? అన్న ఆలోచన మొట్టమొదటిసారిగా శ్రీదేవికి కలిగింది. జట్కా, చీకటిలో వేగంగా వెళ్ళిపోతోంది. తను వేణుమీదకు ఆనుకొని కూచుంది. ఆమె మనసు తన యింటిమీద విహరిస్తోంది. తను ఆ ఇల్లు సులభంగానే వదిలివచ్చింది. కాని, వాళ్ళు వగులుతారా? తాతయ్యా, అమ్మమ్మా, అమ్మా అందరూ

ప్రియుడు: నేను ఒక పౌడరు కంపెనీ పెడదామనుకుంటున్నా. మీ నాన్న ఏమైనా డబ్బు సహాయం చేస్తాడేమో!

ప్రేయసి: అదెందుకో...

ప్రియుడు: లేకపోతే నా జీవితమంతా, నీ పౌడరు డబ్బాలకే సరిపోయేట్టుంది.

కె. రంగారావు (కాకరపర్రు)

తన గురించి ఎలా ఖంగారు పడతారో ఊహించుకోసాగింది. తండ్రికి కూడా తెలుస్తుంది. అతనేమనుకుంటాడో! ఇహ వాళ్ళ గురించి ఆలోచించి లాభం లేదు. తను వారివందరినీ వదిలి వచ్చింది! వేణు తనకు లభిస్తే అంతే చాలనుకొంది వేణుకు ఆమె మరికొంత దగ్గరగా జరిగింది.

రెండుగంటల తరువాత జట్కా ఆగింది. వేణు దిగమన్నాడు. దిగింది. అదొక చిన్న గుడిలా, ఎదురుగా కన్పించింది. అక్కడ నలుగు రైదుగురు వేణుకు పరిచయమైన వ్యక్తులున్నారు. ఒక బ్రాహ్మడు కూడా ఉన్నాడు. అక్కడ లోపల రెండు పీటలూ, బియ్యం, పళ్ళూ, మామిడాకులూ వగైరా సామాను సిద్ధంగావుంది. ఒక చిన్న మండపం తోరణాలతో అలంకరించివుంది. నాలుగైదు పూలమాలలున్నాయి. ఒక స్త్రీవచ్చి శ్రీదేవిని స్నానానికి రమ్మంది. అప్పుడు వేణు ఆమెతో త్వరగా పెళ్ళి తంతు ముగించుకొని మళ్లీ తాము జట్కాలో వెళ్ళిపోవాలని చెప్పాడు. ఆ ఏర్పాట్లన్నీ తానంతకుముందేచేసి ఉంచానన్నాడు. నలుగురు మిత్రులు చూస్తూండగా, భగవంతుడి సమక్షంలో వేణు శ్రీదేవి మెడలో, బ్రాహ్మణుడు మంత్రాలు చదువుతూంటే మంగళసూత్రం, మూడు ముళ్లూ వేశాడు. అక్కడున్నవారంతా ఆ వధూవరులపై అక్షింతలు చల్లారు. ఒకరి మెడలో ఒకరు పూల హారా లేసుకుని, భగవంతుడికీ, పెద్దలకూ వా రిద్దరూ నమస్కరించారు. ఈ తంతు అయ్యేసరికింకా తెల్లవారలేదు.

ఆ గుడినుంచి పసుపు బట్టలతో, మెళ్ళో కర్పూరపు దండలతోనే శ్రీదేవీ, వేణు లిద్దరూ మళ్లీ జట్కా ఎక్కారు. శ్రీదేవి, తన భర్తనుచూసి, మొట్టమొదటిసారిగా, పెళ్లికూతురిలా సిగ్గుపడింది.

కొంతదూరం వెళ్ళేక జట్కా ఆగింది. ఎదురుగా వస్తున్న ఒక బస్సు నాపించి వేణు శ్రీదేవితోసహా ఎక్కాడందులో. రెండుగంటల తరువాత ఒక పల్లెటూరువద్ద బస్సు నాపించి ఇద్దరూ దిగారు.

ఆ పల్లెటూరులో ఇద్దరూ కలిసి ఒక పెద్ద భవంతివద్దకు వెళ్లారు. అది వేణుయొక్క స్నేహితుడి ఇల్లు. అందులో రెండు గదులు వేణూ, శ్రీదేవులకు ఏర్పాటు చెయ్యబడ్డాయి. ఆ స్నేహితుడు వేణునీ, శ్రీదేవినీ ప్రేమ వివాహం చేసుకున్నందుకు చాలా అభినందించాడు. వారిగది చాలా శోభాయమానంగా అలంకరింపబడిఉంది.

వేణు స్నేహితునిపేరు రామారావు. అతను చాలా ధనవంతుడు. ఆ పల్లెటూరులో అతనికి పెద్ద భవనం, చాలా పొలాలూ ఉన్నాయి. అతనికి టెన్నిస్ ఆటంటే చాలా ఇష్టం. కాలేజీలో బి. ఏ. చదువుతున్నాడు. వేణు తనొక యువతిని ప్రేమించినట్లూ, ఆ యువతి తలి తండ్రులకు తెలియకుండా తనను వివాహమాడదల్చినట్లూ తన ముఖ్య స్నేహితులతో చెప్పాడు. వారందరూ వెంటనే ఈ ప్రేమ వివాహానికి తగిన ఏర్పాట్లన్నీ చేశారు.

విశ్వేశ్వరరావుగారు పోలీసు రిపోర్టిచ్చి తమకోసం వెతికించవచ్చుననీ, అందువలన కొద్దిరోజులు తామిద్దరూ రహస్యంగా సంచరించడం అవసరమని వేణు నిర్ణయించాడు. అందుకే ఈ పల్లెటూరులో రామారావుఇంట్లో తమకు రెండు గదులేర్పాటు చేయించాడు. తాము ఈవిధంగా ఇక్కడికి వచ్చిన సంగతి ఎవరికీ తెల్పకుండా తగినన్ని జాగ్రత్తలు తీసుకొన్నారు వేణూ, అతని స్నేహితులూ.

తాము ఆ ఇంట్లోకి దిగిన కొద్దిసేపటిలోనే వేణు స్నేహితులు నలుగురువచ్చి వేణునీ, శ్రీదేవినీ అభినందించారు. శ్రీదేవికి మగవారితో అంత చనువుగా మాట్లాడడం అలవాటులేదు. అయినా వారంతా ఏదో నెపం పెట్టుకొని శ్రీదేవిని పలకరిస్తూనే ఉన్నారు తను వారితో స్వేచ్ఛగా మాట్లాడడం వేణు కిష్టమని గ్రహించి, వారికి సమాధానాలు చెప్పింది. ఆరోజంతా వేణు స్నేహితులతో సరదాగా గడిచింది. రామారావు, నూతన వధూవరులకూ, స్నేహితులకూ విందేర్పాటు చేశాడు. స్నేహితులంతా వేణుకు కానుకలు చదివించారు.

వేణు, స్నేహితులందరినీ వదిలించుకొని భార్యవద్దకు వచ్చేసరికి చాలా రాత్రయింది. వారిద్దరికీ ఆ రాత్రి ఒక మధురస్వప్నంలా గడిచింది. వేణు ఆమె అందాన్ని, ఇన్నాళ్లకు స్పృశింపగలిగానని తృప్తి చెందాడు. శ్రీదేవికీ సౌఖ్యం, యదార్థంగాకాక, ఒక కలలావుంది. ఆకల కరుగుటానికి మూడేళ్లు పట్టింది.

ఈ మూడేళ్లలోనూ శ్రీదేవి చాలా మారిపోయింది ఆమెకు, ప్రపంచం గురించి చాలా విషయాలు తెలిసాయి. ఇప్పుడు శ్రీదేవికి పద్దెనిమిది సంవత్సరాలు. ప్రస్తుతం ఆరు నెలలబట్టి ఆమె సుభద్రమ్మ

# శ్రీదేవి

ఇంట్లో ఉంటోంది. అయినా సుభద్రమ్మకూ, ఆమెకూ మాటలులేవు. ఎందుకంటే వేణూ, సుభద్రమ్మా దెబ్బలాడుకొని, ఆస్తి వాటాలు వేసేసుకున్నారు. వేణు తనవాటా మీద అప్పు కూడా చేశాడు. అందువల్ల తమ వాటాలో వేరుకాపురం చేస్తూ శ్రీదేవీ వేణూ గడపసాగారు.

శ్రీదేవి చాలా నీరసించిపోయింది. ఆమె ప్రస్తుతం కడుపుతోటి ఉంది. ఆరోనెల. ఆమె ఒక్కర్తీ దిగులుగా తన గదిలో ఆలోచిస్తూ కూచుంటుంది. లీలా, సురేష్ కూడా ఆమెను పలకరించరు. వేణు ఎప్పుడో తనకు తోచినప్పుడు ఇంటికి వస్తాడు. రాత్రి పదీ, పదకొండూ, పన్నెండూ కూడా అవుతుంది. అంతటివరకూ అతనికోసం వంటచేసి, భోంచెయ్యకుండా ఎదురు చూచేది. ఆ సమయంలో వచ్చినా వేణు శ్రీదేవి మీద ప్రతి విషయానికీ చిరాకుపడతాడు. ఆమెను ప్రేమగా పలకరించడు సరికదా, ఆమె పలకరించినా సరిగా మాట్లాడడు. అతను కోపంతో, చిరాకుతో, ఎలాగో భోజనం చేసిన తరువాత శ్రీదేవి తను రెండు మెతుకులు తినివెళ్ళి, క్రింద చాపవేసుకొని పడుకుంటుంది. అది సవ్యంగా గడిచేరోజు. అలాటి రోజులు ప్రస్తుతం అరుదు.

ఎందుకంటే ఇప్పుడు వేణు కూడా మునుపటి వేణుకాదు. త్రాగుడు బాగా అబ్బింది. ఎంత డబ్బూ, అతని విలాసానికి చాలదు. శ్రీదేవిమీద మునుపున్న ప్రేమా, గౌరవం పోయింది. తాగివచ్చినప్పుడు శ్రీదేవిని కొట్టాడు కూడా. తను ఏం చేసేదీ, ఎక్కడికి వెళ్ళేదీ శ్రీదేవికి చెప్పడు. ఆమెను భార్యగా చూడడం మానేసి, ఒక ఇంటి నౌకరుగా చూస్తున్నాడు. ఆమె చిరిగిన చీరలు కట్టుకుంటున్నా, పస్తులు పడుకున్నా అతని కక్కరలేదు.

వేణుకు శ్రీదేవిమీద పెళ్ళయిన మొదటి ఆరు నెలలోనే మోజు తీరిపోయింది. అప్పటినుంచి క్రమంగా ఆమెను అలక్ష్యం చెయ్యనారంభించాడు. అతను తన యెడల, మొదట్లో చూపించిన ప్రేమా, గౌరవాలు చూపించడంలేదని శ్రీదేవి తెలుసుకోవడానికి ఒక సంవత్సరకాలం పట్టింది. తమ కాపురం ప్రారంభించిన కొన్ని నెలలవరకూ వేణు తన దగ్గర ఇరవై నాలుగు గంటలూ కూర్చొని కబుర్లు చెప్తూ, కాలం గడిపాడు. మొదటి ఆరు నెలలదాకా, వేణు స్నేహితుడు రామారావు ఇంట్లో గడిపారు. అవి చాలా ఆనందంగా గడిచిన రోజులు. ఆ రోజులు తొందరగా గడిచిపోయాయి. ఆ పల్లెటూరులో తనకేమీ తోచటంలేదనీ, రాజమండ్రి వెళ్దామనీ వేణు ఆమెతో అన్నాడు. రాజమండ్రి వచ్చారు.

## 8

వారికిప్పుడు భయంలేదు. మొదట్లో రాజమండ్రి రావటానికి భయపడ్డారు; తాము చేసిన పనికి విశ్వేశ్వరరావుగారూ, తదితరులూ ఏమంటారోనని. కాని, అప్పటికి ఆ బెంగ తీరింది. ఎందువల్లనంటే అప్పటికి విశ్వేశ్వరరావుగారింట్లో రేగిన తుఫాను సర్దుకొంది. శ్రీదేవి, ఆ ఇల్లు వదిలిపెట్టిన మర్నాడు విశ్వేశ్వరరావుగారు ఆమె గురించి ఆ ఊరూ పై ఊళ్ళూ కూడా వెదికించారు. శ్రీదేవి తన గదిలో ఒక ఉత్తరం రాసి ఉంచింది. అందులో తాను ఇచ్ఛాపూర్వకంగానే వేణుతో కలసి ఎక్కడికో పోతున్నాననీ, తన గురించి ఎవరూ పట్టించుకోవద్దనీ, వేణుని వివాహం చేసుకోవడానికి నిశ్చయించానని రాసింది. అది చూసి విశ్వేశ్వరరావుగారు వారిద్దరినీ ఎలాగైనా పట్టుకొని వివాహం జరగకుండా చూడాలని వారి గురించి ప్రయత్నించారు. వేణూ, శ్రీదేవుల ఉనికి రెండవ రోజుకల్లా ఆయనకు తెలిసింది. కాని, వారి వివాహం కూడా జరిగిపోయిందని తెలిసింది. ఆ ఇంట్లో అందరూ చాలా విచారించారు. విశ్వేశ్వరరావుగారు, గుమాస్తాగారిని పంపి, శ్రీదేవిని ఇంటికి పిలుచుకురమ్మన్నారు. గుమాస్తా శివరావుగారు వెళ్ళి శ్రీదేవిని ఇంటికి తిరిగి వచ్చెయ్యమని అనేక విధాల బోధించారు. ఆమె రానంది. ఆయన, తల్లి తండ్రుల పరువు, ప్రతిష్ఠ పోగొట్టవద్దనీ, వాళ్ళమీద మమకారం కొద్దీయైనా తిరిగిరమ్మని ప్రార్థించారు. శ్రీదేవి తను తలిదండ్రులను పూర్తిగా విడిచి వచ్చాననీ, వేణే తనకు సర్వస్వమనీ, తను ఆ ఇంటికి తిరిగి రాదల్చుకోలేదనీ చెప్పింది. శివరావుగారు ఆమెతో, ఆమె వెళ్ళిన దగ్గర్నుంచీ, అనసూయమ్మా, జయమ్మా ఎంతో దుఃఖిస్తున్నారనీ, వారికి నిద్రాహారాలు లేవనీ, ఆమె తిరిగి తన ఇంటికి వచ్చి, వారికి కన్పిస్తేనే గాని, వారి విచారం పోదనీ చెప్పాడు. ఆ మాటలకు శ్రీదేవి, ఆడపిల్ల ఏనాటికైనా పుట్టిల్లు విడిచి వెళ్ళవలసినదేననీ, అత్తిల్లే ఆమె ఇల్లనీ, అందువల్ల పుట్టింటివా రామె గురించి విచారించనవసరం లేదనీ చెప్పింది. పదిహేనేళ్ళైనా నిండని శ్రీదేవి, తన మాటలకిచ్చే జవాబులు చూస్తూంటే శివరావుగారికి ఆశ్చర్యం వేసింది. అతి అమాయకంగా కన్పించే ఆమె, అన్ని మాటలెలా నేర్చిందో ఆయన కర్థం కాలేదు. ఆమె వివాహం, భర్త అనే విషయాల గురించి ఇంత వివరంగా మాట్లాడుతుందనీ ఆయన ఊహించలేదు. చివరకు, విశ్వేశ్వరరావుగారు తల్చుకుంటే వేణుని అరెస్టు చేయించగలడని కూడా శివరావు ఆమెతో చెప్పిచూశాడు. అందుకామె, తనను కూడా భర్తతో జైలుకు పంపమని, అందుకు తను సిద్ధంగానే ఉంటాననీ జవాబిచ్చింది. ఎన్ని విధాల చెప్పినా ఆమె వినటంలేదని గ్రహించి, ఇక చేసేదేమీలేక, శివరావుగారు తిరిగి వెళ్ళి విశ్వేశ్వరరావుగారితో జరిగినదంతా చెప్పారు. ఏంచెయ్యాలా? అని నాలుగురోజు లాలోచించి, విశ్వేశ్వరరావుగారూ, దుర్గాప్రసాద్, తామిక శ్రీదేవి విషయం ఏమీ కలుగజేసుకోలేమనే నిర్ణయానికి వచ్చారు. వివాహం జరగకుండావుంటే, ఆమెను బలవంతంగానైనా ఇంటికి తీసుకువచ్చేవారు. కాని, వివాహం జరిగిపోయింది. ఇక వారిద్దరినీ ఏం చేసినా, ఊరిలో తమకు మరింత అల్లరి తప్ప లాభించేదేమీ లేదనుకున్నారు. శ్రీదేవిమీద వారందరికీ కోపం వచ్చింది. 'అది చేసిన పాడుపనికి ఫలితం దాన్నే అనుభవించనీ!' అన్నారు విశ్వేశ్వరరావుగారు. కొద్ది నెలలదాకా, వారంతా ఈ విషయం గురించి బాధపడ్డా, తరువాత, ఆ విషయా న్నెక్కువగా మనసుకు పట్టించుకోవడం మానేశారు. అనసూయమ్మ మట్టుకు కూతురు గురించి విచారించడం మానలేదు. ఆమె పనిమనిషిద్వారా శ్రీదేవి క్షేమ సమాచారాలు కనుక్కోనారంభించింది.

ఈ విషయాలు వేణుకి సుభద్రమ్మద్వారా కొంతవరకూ తెలిశాయి. పైకి, వేణు చేసిన పనికి అందరిముందూ కోపం ప్రకటించినా, సుభద్రమ్మకు లోలోపల యిష్టమే. ఎందుకంటే శ్రీదేవికి విశ్వేశ్వరరావుగారి ఆస్తిలో వాటా వస్తుంది. అదికాక, అవ

మాయమ్మై అస్తి కూడా కమ్స్తోంది. వీలా లేదన్నా ముప్ఫైవేలకిపైగా శ్రీదేవికి రావడానికి అవకాశం ఉంది. అందువల్ల వేణు చాలా అదృష్టవంతుడని ఆమె అభిప్రాయం. వేణుకు కూడా అదే ఉద్దేశం. అతనికి డబ్బు చాలా అవసరం. విలాసాలకీ, తాగుడికీ డబ్బు కావాలి. కాస్మొపొలిటన్ క్లబ్బులో అతను పెద్ద పెద్ద వాళ్లందరితోనూ, సమాన హోదాలో తిరుగుతాడు. కాలేజీ కుర్రాళ్ల దృష్టిలో అత నొక ఆదర్శ యువకుడు. ఎప్పుడూ ఖరీదైన బట్టలు వేసుకొని, టెన్నిస్—ఆటగాడనే ప్రత్యేకతతో, నలుగురిలో దర్జాగా తిరుగుతాడు.

అతని దృష్టిలో స్త్రీలు కూడా విలాస వస్తువులే. ఒక స్త్రీతో శాశ్వత సంబంధం పెట్టుకోడం అతనికి గిట్టదు. కొత్త కొత్త స్త్రీలను పరిచయం చేసుకుంటూ, సంఘంలో విలాసంగా తిరగడమే అతని ఆశయం. శ్రీదేవిని చూచి, అతను కొంతవరకూ మోహితుడైనాడు. కాని, శ్రీదేవిలో ఉన్న ఆకర్షణ కూడా అతని నెక్కువకాలం బంధించలేకపోయింది. అవివాహితలైన స్త్రీలు, ఉద్యోగాలు చేస్తూ, సంఘంలో హెచ్చు హోదాలో మెలగుతూవుంటే అటువంటి స్త్రీలతో త్వరితంగా పరిచయం చేసుకొని, ప్రణయరంగంలోకి దింపగలడు. కామినీ కాంచనాలమీద అతని దృష్టి ఎల్లప్పుడూ కేంద్రీకృతమై యుంటుంది.

తనమీద వేణుకు శ్రద్ధ తగ్గుతోందని తెలిసి శ్రీదేవి చాలా బాధపడింది. మొదట్లో శ్రీదేవి ఇంటిపెద్దనుంచి తెచ్చిన డబ్బుతో ఆరునెలలవరకూ కాలక్షేపం చేశారు. నిజానికి జాగ్రత్తగా వాడుకుంటే, అది చాలా కాలమే వచ్చును. కాని, వేణు బట్టలకీ, విలాసాలకీ అది తొందరగా ఖర్చయిపోయింది. పైగా ఇకముందు ఎలా గడుస్తుందా? అనే ఆలోచన శ్రీదేవిని బాధించినంతగా వేణును బాధించలేదు. ఆఖరి రూపాయి కూడా ఖర్చయిన తరువాత శ్రీదేవి వేణును, తరువాత ఎలా గడుస్తుందని అడిగితే వేణు మాట్లాడలేదు. అప్పటికి కొద్దిరోజులముందునుంచీ, తిన్నగా ఇంటికి రావడం మానేశాడు. వచ్చినా, నోరు గుప్పుమని బ్రాందీ వాసన వేస్తూండేది. శ్రీదేవి అతనిని వారించాలని చూసింది. తత్ఫలితంగా ఇద్దరిమధ్యా దెబ్బలాటలు ఆరంభమయ్యాయి. తను భర్తగా ఏంచేసినా పడుండవలసిందేనని అన్నాడామెను. ఆమెకు కోపంవచ్చి, తను అలా ఒప్పుకోనంది. వేణుకు కోపంవచ్చి ఆమె నొక లెంపకాయ కొట్టాడు. ఆ రాత్రల్లా శ్రీదేవి ఏడుస్తూ పడుకొంది.

మర్నాడు ఇద్దరూ మామూలుగా తిరిగారుగాని, శ్రీదేవి మనసు వెనుకటిస్థితిలోకి రాలేదు. రాజమండ్రీలో కాపురంపెట్టిన చాలాకాలంవరకూ, వేణు నెన్నో విధాల దురలవాట్లు మానమనీ, డబ్బు ఖర్చు తగ్గించమనీ ప్రార్థించింది. అతను వినలేదు. శ్రీదేవిమీద అప్పుడప్పుడు చెయ్యి చేసుకోడమేకాక, ఆమెను తన పుట్టింటికిపొమ్మని కసిరేస్తూండేవాడు. అతని ఉద్దేశంలో ఆమె పుట్టింటినుంచి డబ్బు తెచ్చి సంసారం గడపాలిగాని, తనను డబ్బడుగ కూడదు. తనకూ ఆమె డబ్బియ్యాలి.

గతాన్ని తల్చుకున్నప్పుడల్లా శ్రీదేవి హృదయం భగభగమండిపోయేది. తను ఎన్నో ఆశయాలు పెట్టుకుని, తనవాళ్లనందరినీ వదులుకొని, వేణుని నమ్మి, అతనితో కలిసి వచ్చేసింది. ఏ జీవితం తాను అసహ్యించుకునేదో, ఆ జీవితమే తనదైంది. భార్యాభర్తల మధ్య తగువులూ, అనురాగంలేకపోవడం, ఒకరి నొకరు ద్వేషించుకొంటూ, విధి కల్పించిన బంధానికి దాసులై, తమ ఇష్టాలకు వ్యతిరేకంగా సంఘంకోసం కాపురం చెయ్యడం ఆమె చూచి, అటువంటి జీవితం తనకు వద్దనీ, ఆ జీవితం నుండి తప్పించుకోవడానికి తన శాయశక్తులా ప్రయత్నించింది. ప్రేమ వివాహంలో భార్యాభర్తలు ఎంతో సుఖంగా, అనురాగ జీవితాన్ని గడుపుతారనుకొంది. వేణు తనని ప్రేమించాడు. తను వేణుని ప్రేమించింది. అతనికోసం తనవారందరినీ, డబ్బునీ, హోదానీ, మంచి సంబంధాన్నీ వదులుకుంది. అతను చిరునవ్వుతో ఆహ్వానిస్తే, అతని చేతుల్లో వాలిపోయి, పూరి గుడిసెలోనైనా సరే, గంజినీళ్లు త్రాగుతూ, నిండుగా, గర్వంగా, తృప్తిగా అతనితో కలిసి జీవితం గడపగలననుకొంది. తనకింకేమీ అక్కరలేదు. అతని లాలనలో అన్ని కష్టాలూ మర్చిపోతుంది. అతని మాటలు వింటూ ప్రపంచాన్నే మర్చిపోతుంది. అతని ఒడిలో తనను తానే మర్చిపోతుంది. ఈవిధంగా ఆమె సృష్టించుకొన్న ప్రపంచమంతా తలక్రిందైపోయింది. ఏ ప్రేమను నమ్ముకొని, మాతా పితరుల ప్రేమను త్యజించిందో, ఆ భర్తృప్రేమే తనకు కరవైంది. వేణు

పెద్దవాడు – తమ్ముడూ, పరవాన్నంలో పంచదార తక్కువైనట్టుంది కాదూరా!

రెండోవాడు – నాకు పరవాన్నమే తక్కువయిందిరా!

కె. రంగారావు (కాకరపర్రు)

ఆమెతో చాలాసార్లు ఆమెమీద తన మనస్సు విరిగిపోయిందని చెప్పాడు. దానికి కారణం, ఆమె అతనికి ఆమె పుట్టింటినుంచి డబ్బుతెచ్చి ఇవ్వకపోవటమే!

వేణు, తను శ్రీదేవిని, ఆమె ధనాన్నిచూసే వివాహమాడిన సంగతి, ఆమెవద్ద ఆట్టేకాలం దాచలేదు. శ్రీదేవికి పౌరుషం హెచ్చు. కన్నవారిని కాదని, మనసు కలిసినవానితో ఇల్లువిడిచి వచ్చింది. వారివద్దకు సాయంకోరి వెళ్ళడానికి ఆమె మనసంగీకరించలేదు. వేణుని కష్టపడి ఉద్యోగం చెయ్యమంది. అత నొక గౌరవనీయమైన ఉద్యోగం చేసినవాడు, తమ తాతయ్య ఎదుట ధైర్యంగా నిలబడగలడు. తనకు రావలిన డబ్బు అడిగి పుచ్చుకుంటుంది. కాని......వేణుకు ఉద్యోగం అక్కరలేదు. అతనికి కావలిసింది బ్రాందీ, డబ్బు, స్త్రీలు.

తను పూర్తిగా మోసపోయింది. వేణు విషయంలో తను ఊహించుకొన్నదానికీ, యదార్థానికీ చాలా తేడా ఉంది. ఎడారిలో, దూరంగా నీటి చెలమ ఉన్నట్టు కన్పిస్తుంది. వేణు తనకలా కన్పించాడు. దగ్గరికి వెళ్తే అక్కడ నీరుండదు. ఆ నీరున్నదనే భ్రాంతి. మన కది దొరకకపోగానే, మరింత నిరాశ కలిగిస్తుంది. లోకంలో మగవాళ్లంతా ఇంతేనేమో ననిపిస్తుంది ఒక్కొక్కప్పుడు. కాని, అది నిజం కాదు. ఈ మూడేళ్ళలోనూ ఎందరో అన్యోన్యంగా ప్రేమించుకొని, సుఖంగా తిరిగే దంపతుల్ని చూచింది. తన జీవితమే ఇలా గయింది.

పగలల్లా వంటా పనీ చేసుకుంటూ గడిపేది. రాత్రైతే ఈ ఆలోచనలన్నీ ఆమె నావరించేవి. వేణు రాత్రి చాలా పొద్దుపోయాకగాని ఇంటికి రాడు. ఆలోచిస్తూ, ఆలోచిస్తూ అలా నిద్రపోయేది. వీరిద్దరూ కాపురం పెట్టిన మొదటి రోజుల్లో ఇద్దరు నౌకర్లను పెట్టుకున్నారు. ఒకణ్ణి వంటకు; మరొక్కణ్ణి తక్కిన పనులకూ. కాని, రాను రాను డబ్బు తరిగిపోవడంవల్ల, ముందర వంటవాణ్ణి, తరువాత రెండవవాణ్ణి మానిపించి శ్రీదేవి తనే వంటా, పై పనులూ కూడా చెయ్య నారంభించింది. వేణుకు మొదటినుంచీ మార్కెట్టుకు వెళ్లే అలవాటులేదు. అందువల్ల శ్రీదేవి క్రమంగా బజారుకి వెళ్లడం అలవాటు చేసుకుంది.

ఒకనాడు ఆర్యాపురంలో తమ ఇంటికి దగ్గరగా ఉన్న కోమటి కొట్టుకు వెళ్ళి, ఏవో సామాన్లు కొంటోంది. ఆ సమయంలో దూరంగా ఒక రిక్షామీద ఒక స్త్రీ రావడం శ్రీదేవి చూచింది. ఆ రిక్షా దగ్గరవుతున్నకొద్దీ, ఆ స్త్రీ మొహం తనకు పరిచయమైనదిగా కన్పించసాగింది. శ్రీదేవికి ఆమె ఎవరో గుర్తుకు రాలేదు. ముఖంమీద స్ఫోటకం మచ్చలూ, నల్లగా, పొడుగ్గా ఉన్న ఆ స్త్రీ.........ఆ చూపూ.... ఎవరో తనకు తెలిసిన మనిషే!....... అంతవరకూ అటువైపు చూడని ఆ స్త్రీ కూడా అప్పుడే శ్రీదేవి వైపు మొహం తిప్పింది. ఆమెకు కూడా శ్రీదేవి నెక్కడో చూసినట్లుంది. మరికొద్ది సెకన్లలో ఆమెకు, తను ఈ కోమటికొట్టుమీద చూస్తున్న వ్యక్తి ఎవరో జ్ఞాపకం రాకపోతే వాళ్లిద్దరూ ఎప్పటికీ కలుసుకొని ఉండేవారుకాదు. రిక్షా వేగంగా వెళ్లిపోయిఉండేది. ఆమె, "ఏయ్! రిక్షా! ఆపు" అంది. రిక్షా ఆగింది. ఆ స్త్రీ రిక్షాదిగి శ్రీదేవి వద్దకు వెళ్లింది. "నమస్తే! నే నెవరో గుర్తున్నానా?" అని శ్రీదేవి నడిగింది. ఆమె మాట విని, అంతవరకూ తెల్లబోతున్న శ్రీదేవికి ఆమె ఎవరో అకస్మాత్తుగా గుర్తుకొచ్చింది.

"ఓ!.......సావిత్రీ.......నువ్వా? బలేదానివే! ఇంకా ఎవరో అనుకున్నాను" అంది శ్రీదేవి సావిత్రి భుజంమీద చెయ్యివేసి, నవ్వుతూ.

"అమ్మయ్యా! రూపం మారినా మనిషివి మారలేదు. నయం. నన్నసలు గుర్తుపట్టలేవేమో ననుకున్నాను", అంది సావిత్రి, తమాషాగా మొహం దించేసి. ఆమె అలా అనడం చూసి శ్రీదేవికి బలే నవ్వొచింది. సావిత్రి చాలా చమత్కారి. ఆమె కళ్లు తిప్పటం, మూతి విరవడం వగైరా చేష్టలు ఎలాటివారికైనా నవ్వు తెప్పిస్తాయి. పైగా ఆమెలో దాపరికంలేదు.

"నా రూపం మారినా నన్ను నువ్వు గుర్తుపట్టావుగా?"

"లేకపోతే, నన్ను దూరంనుంచి చూసి, 'ఈ శని మళ్లీ వస్తోంది. దీన్ని పలకరించామంటే మరి వదలదు' అనుకుంటావా?" అని, సాగదీసి—నీ నవి అలా ఉందా?—అన్నట్లడిగింది సావిత్రి.

"ఛ!ఛ! నేనలా అనుకోలేదు. అలా ఎందుకనుకుంటావూ?"

"అయితే నువ్వే నన్నెందుకు పలకరించలేదు?"

"అబ్బే! నువ్వవునా, కాదా అని సందేహిస్తూ..."

"ఏమిటీ? నేను—నేను అవునో కాదో అని సందేహమా?"

"అదే, నువ్వే అయిఉంటావనుకొన్నా"

"నువ్వనుకున్నా, అనుకోకపోయినా, నేను నేనే!

మువ్వు నాకీ విషయం ముందు చెప్పు. మువ్వు మువ్వేనా"
శ్రీదేవి తెల్లబోతూ, "ఏం? నేను—నేనే! ఎందుకలా అడుగుతున్నావు? నేను అంత మారి పోయానా?"

పావిత్రి చిరునవ్వుతో, "మువ్వు మునుపటంత అందంగా లేనిమాట వాస్తవమే! కాని, మువ్వు—మువ్వే అయితే మరి వచ్చిందుకు మీ ఇంటికి తీసి కెళ్లకుండా ఇక్కడ నిల్చోబెట్టి మాట్లాడుతున్నావ్" అంది. అప్పటికి శ్రీదేవి కామె భావం అర్థమైంది.

## శ్రీదేవి

"ఓ! అదా? అయితే పద మా ఇంటికి" అంది శ్రీదేవి. ఇద్దరూ రిక్షాలో కూచొని శ్రీదేవి ఇంటికి వెళ్లారు. సావిత్రి, శ్రీదేవిని చూచినప్పుడే కొంత ఆశ్చర్యపోయింది. వెనుక తను చూచిన శ్రీదేవి విద్యుద్దీపంలా మెరిసిపోతూ ఉండేది. ఇప్పు డామె మసిపట్టిన గుడ్డిదీపంలా ఉంది. అయినా, ఆమె మొఖంలోని అందమూ, చిరునవ్వులోని ఆక ర్షణా పోలేదు. మనిషి చిక్కి, నల్లబడింది గర్భిణీ లక్షణాలు కూడా పైకి కన్పిస్తున్నాయి. శ్రీదేవి ఇంటిని చూసి మరింత ఆశ్చర్యపోయింది సావిత్రి. ఇల్లంటే రెండు గదులే! ఒకటి కొద్దిగా శుభ్రంగా ఉంది. అందులో రెండు కుర్చీలూ, మంచం, ఒక బీరువా ఉన్నాయి. గోడని వేణువి రెండు ఫోటోలూ శ్రీదేవి, వేణూ కలిసి తీయించుకున్న ఫోటో ఒకటి ఉంది. రెండు కాలెండర్లున్నాయి. మంచంపీద పరుపూ, దుప్పటీ, చాలా మాసిఉన్నాయి. రెండో

గది వంటగదిలా ఉంది. గోడలు పొగచూరి ఉన్నాయి. అది చూచేసరికి సావిత్రికి వికారం వేసింది. కాని, తరువాత శ్రీదేవిమీద జాలివేసింది. ఆమె శ్రీదేవి ప్రేమ వివాహం గురించి వింది. కాని, దాని పర్యవసానం ఇటువంటి జీవితం అని ఊహించుకోలేక పోయింది. బహుశా శ్రీదేవి భర్త చాలా బీదవాడేమో! డబ్బు కిబ్బంది పడుతున్నట్లు శ్రీదేవి మొహం, ఇల్లూ, బట్టలూ అన్నీ చెప్తున్నాయి. ప్రపంచంలో, దేన్నైనా దాచవచ్చునుకాని, దరిద్రాన్ని దాచలేము. అదిపైవారికి స్పష్టంగా కన్పిస్తుంది. ఎందుకంటే అది ఒక విధంగాకాక, అనేక విధాలుగా మనిషిని బాధిస్తుంది. పైగా, దాన్ని మనం ఎంత దాచాలనుకుంటే, అంత స్పష్టంగా పైకి కన్పిస్తుంది. అసలు మనిషిని క్రుంగదీసి, అతని రూపే మార్చేస్తుంది. మనిషికి ఆత్మబలం, ఆత్మవిశ్వాసం తగ్గుతుంది. చొరవ తగ్గి, దైన్యం ఏర్పడుతుంది. సావిత్రికి శ్రీదేవిలో ఈ లక్షణాలన్నీ కన్పించాయి. ఆమె శ్రీదేవికన్నా వయసులోనూ, అనుభవంలోనూ పెద్దది. అందువల్ల శ్రీదేవి స్థితికి ఆమెకు జాలి కలిగింది. అయినా శ్రీదేవి ప్రేమకోసం అన్నీ త్యాగం చేసింది కాబట్టి ఈ జీవితాన్ని స్వర్గంగా తలపింపజేసే ప్రేమ శ్రీదేవి భర్తవద్ద పొందుతూ ఉండిఉంటుందని, సావిత్రి ఊహించుకొంది.

"ఎన్నేళ్ళయిందో నిన్ను చూసి!" అంది శ్రీదేవి కుర్చీలో కూచొని, ఎదురుగా మంచంమీద కూర్చున్న సావిత్రిని చూస్తూ.

"మూడేళ్ళపైన అయింది. నేను ఇంకా మీ ఇంటికివెళ్ళి నీ గురించి కనుక్కుందామనుకుంటున్నాను. నే నీ ఊరొచ్చి వారం రోజులే అయింది. ఈ మూడేళ్ళూ ఈ ఊళ్ళోనే లేను"

"ఏ ఊరెళ్ళావు? ఏంచేశావు? చెప్పు వివరంగా!"

"విశాఖపట్నంలో బి. యస్‌సి. ఆనర్సు చదివాను. ఈ మధ్యకాలంలో కూడా ఈ ఊళ్ళో ఎక్కువ కాలం ఉండలేదు. నాన్నగారు వ్యాపారరీత్యా, ఢిల్లీ, బొంబాయి, కలకత్తా మొదలైన పట్టణాలు తిరుగుతూఉంటే ఆయనతో నేనూ తిరిగాను. మొన్ననే పరీక్ష పాసయినట్లు తెలిశాక, ఖాళీగా కూర్చోడం ఇష్టంలేక, ప్రస్తుతం ఈ ఊరి కాలేజీలో డిమాన్‌స్ట్రేటరుగా చేరాను. అదీ నా సంగతి. ఇక నీ సంగతి చెప్పు?"

"ఏం చెప్పమంటావ్? నీలాగా పెద్ద చదువు చదువుకోలేదు; పెద్ద ఊళ్ళు తిరగలేదు. ఉద్యోగం చెయ్యటంలేదు."

"అవునుపాపం! ఏదో గుట్టుగా సంసారంచేస్తూ, జీవితం గడుపుతున్నావ్. చాల్లే! నీ వివాహం సంగతి నేనూ విన్నాను. జీవితంలో అన్నిటికన్నా ముఖ్యమైనదాన్ని చిక్కించుకొని, మమ్మల్ని వేళాకోళం చేస్తున్నావుకదూ?"

"అబ్బే! నే నలా అనటంలేదు. ఇందులో పెద్ద విశేష మేముంది. ఎవరికైనా పెళ్ళి అవుతుంది కదా! కాని అందరికీ చదువుకొని ఉద్యోగంచేసే అవకాశం ఉండదుకదా అని అలా అన్నాను" అంది శ్రీదేవి, సావిత్రి తనను తప్పర్థం చేసుకుందని సూచిస్తూ. శ్రీదేవిది అమాయక స్వభావం. మాటలో సరళతా, నమ్రతా, గంభీరత్వం ఉంటాయి కాని, వ్యంగ్యం, దురుసుతనం వేళాకోళం ఉండవు. ఎదుటివారు ఛలోక్తి విసిరినా, వారి మనస్సు నొప్పుతుందేమోనని, తను జాగ్రత్తగా మాట్లాడుతుంది. సావిత్రి మనసు బహు మెత్తనైనా, మాటలు చురుకు.

"కావాలంటే ఆ అవకాశం ఎవరికైనా వస్తుంది. కాని, ప్రేమించి వివాహమాడడమే అపురూపం. మీ ఆయన గురించి అన్నీ వివరాలూ చెప్పు. ఆయన ఏం చేస్తున్నారు? ఎలా ఉంటారు? నిన్నేమని పిలుస్తారు?" అన్నీ వరుసగా చెప్పు"

"అదుగో ఆయన ఫోటో చూడు. నీకే తెలుస్తుంది."

"ఎక్కడో చూసినట్లుందినుమా! మనిషి అందమైనవారే"

"కాలేజీలో చూసిఉంటావ్. రోజూ విడిగా టెన్నిస్ ఆడతారు. టెన్నిస్‌ఉంటే ఆయన కింకేమీ అక్కర్లేదు."

"అవునవును. జ్ఞాపకమొచ్చింది. మిస్టర్ వేణు కదూ."

"అవును. ఆయనను కాలేజీలో అందరూ ఎరుగుదురు"

"నాటకాలలో కూడా వేస్తారు. ఆయన గురించి విన్నాను. అయితే ఆయనను నువ్వెలా ఎరుగుదువ్? అసలు జరిగినదంతా నాకు చెప్పాలి. నా సంగతి నీకు తెలుసుగా. ఒక్క విషయం దాచటానికి వీల్లేదు. అన్నీ చెప్పాలి. మీ రిద్దరు పెళ్లికి ముందు, ఎలా, ఎప్పుడు మొట్టమొదట కలుసుకున్నారో, ఎన్ని ప్రేమలేఖలు రాసుకున్నారో, ఎప్పుడు వివాహం చేసుకున్నారో అన్నీ చెప్పాలి. ఆ విషయాలన్నీ నువ్వు చెప్పేదాకా నేను కదలను."

శ్రీదేవి నవ్వింది. "అలాంటివి, పైవాళ్లతో ఎవరైనా చెప్తారా?"

"పైవాళ్లతో చెప్పకూడదుగాని, నాతో చెప్పచ్చు. నేను పరాయిదాన్నికాదుగా! అసలు మీరు ప్రథమ వీక్షణంలో ప్రేమించుకొన్నారా? ద్వితీయ వీక్షణమా? అతను నీ కంటికి ఎలా కన్పించాడూ? అతన్ని ఎలా ప్రేమించావూ? అతనికోసం ఎలా బాధపడ్డావూ? ఊ. వరసగా అన్నీ చెప్పేయ్" అంది సావిత్రి సీరియస్‌గా.

సావిత్రిని చూసిన దగ్గరనుంచీ శ్రీదేవికి ప్రాణం లేచి వచ్చింది. ఆమె చాలా కాలంగా ఆప్తులెవరితోనూ, తన కష్టసుఖాలు చెప్పుకోలేదు. ఆమె, వేణుతోతప్ప మరెవరితోనూ మాట్లాడే అవకాశం కూడా లేదు. ఆమెది ఎంత గంభీర స్వభావమైనా, వయసు తక్కువవడంచేత, తనకు ఈ మూడేళ్ళలోనూ సంప్రాప్తమైన కష్టాలకు తట్టుకోలేకపోతోంది. వేణు ప్రవర్తన ఆమెకు మరీ దుస్సహంగా పరిణమించింది. అంతేకాక, తన విషయం తెలిసిన వారెవరైనా, తనేదో పెద్ద తప్పు చేసినట్లు చూస్తున్నారే గాని, తనకు సానుభూతి చూపించటంలేదు. మరొక విషయం ఆమెకు చాలా కష్టం కలిగించిన దేమంటే, వేణు నెవరూ ఏమీ అనకపోగా, అత నొక ఘనకార్యం సాధించినవాడిలా చూస్తున్నారు. వేణుకు అనేకమంది స్నేహితులున్నారు. వారంతా ఇది వేణుయొక్క ప్రణయవిజయంలా భావిస్తున్నారు. కాని, శ్రీదేవి తన వాళ్ళందరినీ అతనికోసం వదులుకోవడంలో ఎంత త్యాగం చేసిందో అర్థం చేసుకోడానికి ప్రయత్నించలేదు. తోటి స్త్రీ ఒకతే తన యందు శ్రద్ధా, సానుభూతీ చూపించటంతో శ్రీదేవి హృదయంలోని అగ్నిపర్వతం బ్రద్దలైంది. సావిత్రి అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఆమె తలదించుకొని రెండు కన్నీటిబొట్లు రాల్చింది. అది చూచి సావిత్రి నివ్వెరపోయింది. ఆమె లేచివెళ్ళి, శ్రీదేవి ప్రక్కన నిల్చొని, శ్రీదేవి తలను రెండు చేతులతో ఎత్తి, "ఛ! ఏడుస్తున్నావా? నిన్ను నొప్పించానని నాకు తెలియదు. నన్ను క్షమించు" అంది. శ్రీదేవి ఇక ఆపుకోలేక, ఆమె చేతుల్లో మొహం పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. సావిత్రి ఆమె ప్రక్కనే వేరొక కుర్చీలో కూచొని, ఆమె తలను తన హృదయంమీద అదుముకొని, తలను నిమురుతూ, "నీ మనస్సులో ఇంత బాధ పడుతున్నా



## శ్రీదేవి

వని నాకు తెలియక ఆ విషయం కదిపాను. అయినా, నాకు నువ్వంటే ఎంత ఇష్టమో నీకు తెలియదు. నీ కష్టం, నా కష్టం ఒకటేనని భావించుకో. ఏడవకు" అంది.

సావిత్రియొక్క వెచ్చని రొమ్ముల్లో తలదాచు కొన్న శ్రీదేవికి సావిత్ర తననంత ప్రేమతో చూడడం ఆమె తనకు ముఖ్యమైన ఆత్మీయురాలిలాగా స్ఫురించింది. గద్గద స్వరంతో, "అదికాదక్కా.........నేనేం తప్పుచేశానో.........చెప్పు ! ఆయనకు.......... నామీద.......అంత కోపం ఎందుకు?" అని వచ్చి వెక్కి వెక్కి ఏడుస్తూ, "నేను ఆయనకోసం అందర్నీ వదిలి.........పెట్టానని కూడా......ఆయనకు నామీద దయలేదు. ఆయనే నా దైవం అనుకొని ఆరాధించాను......నన్ను ఇంత హీనంగా చూస్తారని అనుకోలేదు" అంది వస్తున్న ఏడ్పు ఆపుకోవాలని ప్రయత్నిస్తూంటే, మరింత ఉద్వేగంగా రావడంతో మాట్లాడలేక.

తను ఊహించని సత్యం సావిత్రికి, మనోనేత్రాన్ని తెరిపించి గోచరించింది. వీరిది పవిత్ర ప్రేమ అనుకొందిగాని, శ్రీదేవిని వేణు ఇంత బాధ పెడుతున్నాడని ఆమె అనుకోలేదు. సహజగాంభీర్య స్వభావం గల శ్రీదేవి, ఎంతో అణుచుకోలేని బాధ ఉంటేనే గాని, ఇలా బయట పడదని సావిత్రికి తెలుసు. శ్రీదేవి స్థితిని తల్చుకుంటూంటే, ఆమె నెలా ఓదార్చాలో కూడా సావిత్రికి బోధపడలేదు. కాని, తను ఏదో మాట్లాడాలి. శ్రీదేవికి ధైర్యం చెప్పాలి. పరిస్థితేమిటో పూర్తిగా తెలుసుకోవాలి! సావిత్రి, "చూడు చెల్లీ, జీవితంలో అన్నీ మనం అనుకున్నట్లే జరగవు. కాని, మనం ధైర్యం వహించి కష్టాల్ని ఎదుర్కోవాలి. స్త్రీకీ, పురుషుడికీ ఎంతో తేడా వుంది. ఈ ప్రపంచంలో స్త్రీ ఏం చేసినా తప్పే! పురుషుడేం చేసినా ఒప్పే! అందువల్ల మనం నిరుత్సాహపడి లాభంలేదు. నువ్వు జరిగిన విషయమంతా నాకు పూర్తిగా చెప్పు. నీ బాధలో నన్ను కూడా పాలుపంచుకోనీ! నీ బాధ పోగొట్టడానికి నే చెయ్యగలిగిందంతా చేస్తాను. ముందు, ఈ మూడేళ్లలోనూ జరిగిన విషయాలు చెప్పు. ఈలోపల నేను నీకు కొంచెం కాఫీ చేసిస్తాను. పాలూ, కాఫీ పొడి ఎక్కడున్నాయో చెప్పు!" అంది.

సావిత్రి కాఫీ విషయం ఎత్తడం, శ్రీదేవిని యదార్థ ప్రపంచంలోకి తీసుకురావాలనే. శ్రీదేవి "అయ్యో! నేనే చేస్తాను ఉండు" అని వంటింట్లోకి వెళ్లి స్టౌ వెలిగించి నీళ్ళు పెట్టింది. సావిత్రి కూడా వంటింట్లోకి వెళ్లి, పీట వేసుకొని శ్రీదేవి ప్రక్కన కూచుంది. శ్రీదేవి తను మొట్టమొదట వేణును కలుసుకొన్న దగ్గర్నుంచీ జరిగిన విషయాలన్నీ చెప్పనారంభించింది. ఆమె ఏదైనా మర్చిపోయినా, సావిత్రి ప్రశ్నలువేసి ఆమెచేత వివరాలు చెప్పించింది. కాఫీ తయారు చేసుకొని ఇద్దరూ త్రాగుతూ, స్వంత అక్క చెల్లెళ్లలా మాట్లాడుకున్నారు. సావిత్రి తన యింటికి బయల్దేరేసరికి రాత్రి ఏడుగంటలైంది. ఆమె వెళ్ళిపోయాక, శ్రీదేవికి బాగా ఆకలేసి, వండుకొని భోజనం చేసింది. శ్రీదేవి హృదయం చాలావరకూ తేలికైంది.

(సశేషం)

# కాకాలూ కీయము

13వ పేజీ తరువాయి

అంతే. ఎన్ని రోజులైనా సరే, "ఆఫీసుకు రాలేదేమోయ్ కాకామూర్తి ?" అని మిమ్మల్ని అడిగే నాథుడుండడు !

(5) మీ 'భార్యామణి' చీర కొనిపెట్టమందా ? మీ దగ్గిర 'ఆ' డబ్బు వెసులుబాటు లేదుకదూ ? .... వెంటనే, "ఆ పోనిద్దూ, ఆ చీర అందంలేని వాళ్లకి (ద్వందార్థం!) గానీ, నీకుటోయ్ ?—అయినా, ఆ పేరంటావ్ గానీ, నీవు మొన్న శుక్రవారం సాయంత్రం కట్టుకున్నావ్ చూడు, (మీకే తెలియదు ఏ చీరో?!) ఆ చీర బార్డరు చివరికి ఆఖటావ్ భార్యకి కూడా లేదు .... నిజం .... మా ఆఫీసరు తోడు" అనండి. అంతే. ఆమె చీర సంగతి మళ్లీ ఎత్తితే ఒట్టు.... యదార్థం చెప్పినా నమ్మరా నన్ను ? పోనిండి !

(6) మీరు స్టెనోనా ? మీ బాస్ ఎల్లప్పుడూ మీరు తప్పులు చేస్తుంటారని ఖస్—బుస్ (—ఎస్) మంటాడు కదూ ? (అదొక అంటువ్యాధిలేండి!) వీంలేదు. ఆయనకు సుస్పష్టంగా వినపడేలా, మీ దగ్గిరగా ఎవరూ లేకున్నా సరే—"అబ్బ, నా బాస్ డిక్టేషన్ స్పీడ్ పంజాబ్ మెయిలు స్పీడుని తలదన్నిందనుకో ! ఎంత భాష వచ్చు నాయనకి ? (మీ ఇద్దరికీ తెలుసు,—ఆయనకి ఆయనపేరు స్పెల్లింగే రాదని !!) మొదలెడ్తే, మొత్తం ఖతం(?) అయితేనే ఆగడం" అనండి .... మీ కాన్ఫిడెన్షియల్ రిపోర్టు—వీరచక్ర బహూకృతి తప్పక పొందుతుంది.

(7) మీరు స్కూల్లో చదువుతున్నారా ? లెక్కల్లో మార్కులు బాగా రావడంలేదుకదూ ? (ఎక్కడో టైమేది ? వారకి 7 రోజులూ—8 సినిమాలూ విడుదలా నయ్యె !!) మీ పంతులుగారు ఉదయంవేళ బజారునుంచి కూరలు, మానె, గ్రటా పట్టుకొచ్చేటప్పటికి,—వాయుపుత్రుడిలా ఎదురుగా నిలబడి నమస్కరించండి, అవుసరమయితే, (కూరలు మారురూపు దాల్చకుండానూ—మానెతో అవి సఖ్యం నెరపకుండానూ) వాటిని మోస్తూ సహాయం చెయ్యండి. "దండంసార్" అనండి తిరిగొచ్చేటప్పుడు. (దణ్ణం పెట్టడం—కాకా శరీర వ్యాయామశాస్త్రంలో ప్రథమ పాఠం !) నమ్మకంగా, ప్రైతడవ పరీక్షలో మీదే ఫస్టు మార్కు.

(8) మీ అమ్మాయికి పెళ్లి కావాలి కదూ ? మీకు 'కట్నం' యిచ్చుకోగల ఆర్థికస్థోమతు లేదు—అవునా ? నిరుత్సాహ పడకండి. మీ అమ్మాయిని ఆ అబ్బాయి "తల్లి" కి "కాకాధూపం" గుళ్లోనూ, బయటా ప్రతినిత్యం వరుసగా రెండు నెలలు వేయమనండి. మీరేమో అతని "తండ్రి" తో "రాజ (కా) కీయ చర్చ" పై జెప్పినంత కాలం సాయంత్రపువేళ జరపండి. ఫలితం? దక్కచ్చు !

(9) మీ కథలు అచ్చుపడక, మీకేం తోచటంలేదు కదూ ? (నాకు లాగానే !) మీరు కథలు పడాలనుకున్న పత్రికకి, "సంపాదకునికి లేఖలు" కాలంకి (వారం విడవక) ఏక బిగిన 3 నెలలు జాబులు వ్రాయండి, "భలానా కథ చాలా బాగుంది, అలాటి కథ నందించిన మీకూ, మీ పత్రికకూ, మీ పత్రిక ఆఫీసులోని కాగితాలు వొకచోటనించి వేరొకచోటికి కదలడానికి ఆస్కారభూతు(!)డయిన మీ ఫ్యాన్‌కీ సదా కృతజ్ఞుణ్ణి" అంటూ .... (రచయితని గూర్చి ఎప్పుడూ వ్రాయకండి, ఆ రచయిత యింకా నాలుగు కాలాలపాటు అలానే రచనలు చెయ్యాలనే మంచిబుద్ధి మీకు ఉంటే !!) మంచి తిథి చూచి, ఒక కథ సరైన ముహూర్తాన పోస్టులో వేయండి ! అంతే—మీరు—అదే మీ పేరు, ప్రింటులో ఉంటుంది !!

(10) మీరు మీ రచయిత మిత్రుడి దగ్గరకి అప్పడగటానికి వెళ్లారు కదూ ? అతను మీ రిది వరలో యివ్వాల్సినదే ఇవ్వలేదనే (గత జన్మ) జ్ఞాపకం కలవాడు—అవునా ? రచయితలంత అమాయకులూ, వాళ్లంత 'కాకా ప్రూఫ్' కానివాళ్ళూ మానవజాతిలో మరొకరు లేరు ....(వాళ్ల భార్యలముందు తప్పించి మిగతా చోట్లంతా చిన్న పిల్లలలాంటివాళ్ళే !) అప్పు అడగటానికి ముందు, (మీరు చదివినా చదవకున్నా !) "అబ్బ. ఈమధ్య నీ రచన కొత్త పుంతలు తొక్కుతోందోయ్! ? మరీ సంభాషణలు ఆ బంగారయ్య చేసే కాఫీలా ఎన్నిసార్లు చదివినా, తృప్తి తీరటంలేదనుకో .... ఆహా ! ప్రకృతి వర్ణన, రవివర్మ చిత్రాలలా కళ్లకు కొట్టొచ్చి(!) నట్లుగా ఎంత బావుంటుం దనుకున్నావ్....అరే—ఆ స్వభావ వివరణ .... " సాగించండి మీ మాలిశ్ పది నిముషాలు అలా ! అంతే ! మీరు అడిగినంత, అతను ఇవ్వగలిగినంత—అప్పు చేసైనా సరే, తెచ్చిస్తాడు .... ఒకమారు ప్రయత్నించండి. యదార్థం మీకే అవగత మవుతుంది.

కాకా గాధాలహరి :—

భీమాకాకా :—

భీమా ఏజంట్లు చాలావరకు "కాకా భీములే"! అసలు కాకా పట్టడం ఎలాగనే విషయాన్ని గూర్చి వాళ్లకి ప్రత్యేకంగా శిక్షణ యిస్తారట !! కాకుంటే, —లక్షణంగా బతుకుతున్న మనిషిని, "నీవు మరణిస్తే నీ భార్యా బిడ్డలు ఏమవుతారో ఎప్పుడన్నా ఆలోచించావా ?" అనే మాటి ప్రశ్నని తమాషీగా గుర్తుచేసి, భీమా పట్టా తీసుకునే "స్థితి"కి ఎలా తీసుకు వెళ్తున్నారు ? ప్రతి భీమా ఏజంటూ ఒక ప్రొఫెసర్ ఆఫ్ కాకా ! కాకుంటే,—మాస్టర్ !! స్క్రూ దారంకన్నా గట్టిది భీమా ఏజంట్ల (కాకా) పట్టు ! ఉదాహరణకి ఒక చిన్న గాథ చిత్తగించండి !

కాకినాడలో "పంతయ్య" గారని ఒక ఏజంటు ఉండేవారట. అవి రెండో ప్రపంచ సంగ్రామపు దుర్దినాలు. ప్రతి వాడికీ ప్రాణభయం జాస్తిగా ఉన్న చెడ్డ రోజులు .... ఆయన ఆ వూరికి కొత్తగా ట్రాన్స్‌ఫరయి వచ్చిన ప్రతి పెద్ద ఆఫీసరుని తప్పక తనంతట తాను వెళ్లి—సామాన్య మానవుడిగా—పరిచయం చేసికునేవాడట. ఆ కొత్తగా వొచ్చినాయనకి ఉండటానికి ఇల్లు, దగ్గిర వంచి—పని మనిషి దాకా తానే స్వయంగా వెతికిపెట్టి, కుదిర్చేవాడట. కూరల మార్కెట్ చూపించడం లగాయతు, నెలాఖరయినా డబ్బడగని పెరుగుపోసే (మంచి!) వాడిదాకా కష్టపడి ఏర్పాటు చేసేవాడట... కొద్దిగా ఆ కొత్తాయన వూళ్ళో సెటిల్ అయిన తరువాత, మెల్లిగా తానొక భీమా కంపెనీ ఏజంటని, పెద్ద కుటుంబీకుడననీ, (సమయానుకూలంగా ఆడపిల్లల వయస్సూ సంఖ్యా పెంచేవాడట!) కనుక దయచేసి తనకీ, తన బీద కుటుంబానికీ సహాయం చేయదలుచుకుంటే, ఆ ఆఫీసరుగారు కనీసం పదివేల రూపాయలకైనా ఒక పాలసీ తీసికోవాలనీ దీనంగా ప్రార్థించేవాడట .... పంతయ్యగారు సార్థక నామధేయుడు! పట్టిన పట్టు—పని పూర్తయితే గానీ—విడువనివాడు ! ఇష్టం లేకున్నా, మొహమాటానికైనా జాలి తలచి, ఆ ఆఫీసరుగారు కనీసం ఏడువేల రూపాయలకైనా ఒక పాలసీ తీసుకునేవాడట ! ఆ ప్రకారంగా, పంతయ్యగారు పది లక్షల దాకా ఆ రోజుల్లో 'బిజినెస్' చేసి, ఇనస్పెక్టరయ్యాడట !!

ఆయన, మరొకాయన ఒకసారి వో పెద్ద ఆఫీసరు



## పదంతులను వినకండి
## పదంతులను ప్రచారం చేయకండి

గారింటికి యీ భీమా పనిమీద వెళ్లారట. పరిచయా లయిన తరువాత, "ఏం పనిమీద వొచ్చారు ?" అన్నారట ఆ ఆఫీసరుగారు విసుగు ధ్వనించే గొంతుతో.

పంతయ్యగారు అంత తేలిగ్గా లొంగే రకం కాదు.

"ఆ .... ఏంలేదు, మీ దర్శనం చేసుకుని పోదామని వచ్చాను" అన్నాడట చిరునవ్వు ఒకటి విసురుతూ.

"ఆ దర్శించుకున్నారుగా, యిక వెళ్లండి" అని ఆ ఆఫీసరుగారు అందామని అనుకుంటున్న సమయానే, ఆయనగారి ఒక్కగా నొక్క వంశోద్ధారకుడు వచ్చాడట ఆ గదిలోకి. పంతయ్యగారి మేధస్సు 'పాదరశం' అవకాశాన్ని వుపయోగించుకోటంలో. "ఇటురా నాయనా" అంటూ ఆ ఏడు సంవత్సరాల కుర్రాడిని దగ్గరికి తీసుకున్నారట పంతయ్యగారు వాడు నిక్కరుమీద—అప్పుడే దొడ్లోంచి అడుకొంటూ వచ్చాడేమో— ఒళ్ళంతా దుమ్ము కొట్టుకుని, చెమట (ముక్కునించి చీమిడికూడానేమో ? !) కారుతూ, చాలా అసహ్యంగా వున్నాడట. ఆ కుర్రాడిచెయ్యి తీసుకుని, కొద్దిగా పరిశీలించినట్లు నటించి,—

"అహో : ఏందశ అంజీ యీ కుర్రాడిది...... ఇంద్రుడుచంద్రుడు"అంటూసాగించారుటఆకుర్రాడి భవిష్యత్తుగూర్చి పంతయ్యగారు.... అంతే ! ఆ ఆఫీసరుగారు పదిహేనువేల రూపాయల 'ప్రపోజల్' మీద సంతకంపెట్టేసదాకా, పంతయ్యగారూ వాళ్ళు వెళ్ళిపోయిన పదినిముషాలదాకా, ఆయనకి ఆయన ఒంటిమీద స్పర్శజ్ఞానము లేదట !

ఇలావుంటయ్ భీమాకంపెనీ ఏజంట్ల కాకా పట్లు :

"కాకాయిష్టు మాహాత్మ్యము":—

ఒకాయనకి (తెనాలిలో జరిగిందట యీ గాథ!) ఎన్నాళ్ళయినా వుద్యోగం దొరకని కొడుకున్నాడట. కుర్రాడు మెట్రిక్ ప్యాసయ్యాడట. ఆ వూళ్ళోనే ఒక ఆఫీసులో ఒకఖాళీ వచ్చిందని ఆ కుర్రాడి తండ్రికి 'గాలికబు'రొకటి అందింది. ఆయన 'తనకాలంలో' గొప్ప "కాకాయిష్టు" ! ఆ ఖాళీ భర్తీచేస్తే పోస్టు, అధికారంగల ఆఫీసరు ఎవరో కనుక్కున్నాడు మళ్ళీ తెల్లారేప్పటికి.... తెలిసో తెలియకో, పాపం, ఆయన యీాయన ఇంటిదగ్గరలోనే వుంటున్నాడు. ఆ ఆఫీసరుగారు, ఆయన భార్యా నిత్యం సాయంత్రంవేళ దేవాలయానికి వెళ్తారట..

మన ఉద్యోగం దొరకని కుర్రవాడూ, అతని తండ్రీ ఆరోజునుంచి అదే దేవాళయానికి ప్రతిరోజూ హాజరు, చేతిలో కొబ్బరికాయ, పూలతో : .... రెండుమూడు రోజుల్లో వారికీ వీరికీ పరిచయాలయినయ్. అంతే ! మనకుర్రాడు రోజూ తీర్థప్రసాదాలు ఆఫీసరుగారు ఇంటికి— వాళ్ళు ఎంతొద్దన్నా వినకుండా — చేరేసేవాడట, పైగా స్వయంగా వాళ్ళ చేత ఆరగింపచేసేవాడట ! ఆ ఆఫీసరు దంపతులు యీ "కలియుగ కర్ణుడు" చేసే అతివినయ సేవలకి జాలిపడి, ఒక సుభఘడియ్లో అతని తండ్రిని అడిగారట !

"మీ కుర్రాడికి ఏదైనా ఉద్యోగం చూడక పోయినారా, వూరికే వుంచారు దేనికీ ?" అని, రానున్న 'ఆపత్తు' గ్రహించకుండా ! ఆ తండ్రి ఒక వేడి నిట్టూర్పు అఖిల భారతావనికి అర్పిస్తూ,

"ఆ పరాత్పరుడి కృపయింకా కలగలేదువాడికి మీద.... మీలాటి అమృత హృదయుల చలువ వాడిమీద వుంటే, నేను ఆ రాముసిలో శివమయే లోపల, ఏదో ఒక ఉద్యోగం రాకపోతుందంటారా ?" అన్నాడుట జాలిగా....

అంతే వారంరోజులు గడిచేప్పటికి, ఆ ఆఫీసరు గారి ఆఫీసులోనే మనకుర్రాడు "ప్రభుత్వోద్యోగులకు సంవత్సరానికి అసాధారణ సెలవలు తక్కువ" అనే ఘోర విషయాన్నిగూర్చి తోటి ఉద్యోగులతో చర్చిస్తున్నాడు తీరిగ్గా !! అన్నట్లు, అతని తండ్రి తరువాత 15 సంవత్సరాలకి రాముసిలో శివ" మయ్యాడు ! !

ఇలా వుంటాయ్ "కాకేంద్రుల" గాథలు : ఎందరో మహానుభావులు....

ముగింపుకు ముందుమాట :—

"కాకపట్టడం" అనేది గొప్పశాస్త్రం ! ఇందులో 'తక్కువ' విషయం ఏంలేదు.... ఆదికాలం నుంచీ నేటిరోజువరకూ, మానవుడు యీ శాస్త్ర సహాయ సహకారాలవల్లనే, పైకి— పై పైకి వచ్చాడు.... కాకా మానవుడిని పురోభివృద్ధి మార్గాన పయనింప చేసింది, విడిపోయిన కుటుంబాలని తిరిగి ఒకటి చేసింది, యుద్ధాలని నివారించింది, ఎన్నో మానసిక రుగ్మతలని సరిచేసింది.... "కాకాశాస్త్రం" — — "పాకశాస్త్రం"లా పట్టేవాడికి, పట్టించుకునే వాడికీ చాలారుచిగా, హాయిగా, హుషారుగా వుంటుంది .... అనుభవించిన కొద్దీ అమరరుచులనిచ్చే, అత్యద్భుత వంటకం ! ఇది ఒక శాంతి అస్త్రం' మీరు బాగుపడాలంటే ! ! 'కాకా పట్టగలగడం' ఒక కళ 65వ కళ అని "కాకేశ్వరానంద స్వాముల" వారు యీ మధ్యనే కోజీకోడ్‌లోని "కాకామఠం" నించి సెలవిచ్చారు.... 'కాకాపట్టడం' చేతకాకుంటే ఆడవాళ్ళైనరూ మిమ్మల్ని పెళ్ళాడరు, ఒకవేళ యిదివరలోనే(పొరపాటున)పెళ్ళాడినా, మీ ముఖాన్నే "ఈ మాత్రం చాతకాదటండీ, అంతలాసినాసర్ మీసం, క్రాప్టుగడ్డం మీరూనూ ? !" అని ఆశ్చర్య పోతారు. పైగా, కాకాశాస్త్రాభ్యసనానికి, దేశ, కాల, వయో, లింగ, కుల, వర్ణ, జాతి, భాషా భేధాలులేవు. స్త్రీ పురుషులు సర్వులూ, సర్వకాల సర్వావస్థలలోనూ "కాకాజపం" జరుపవచ్చును, ఇష్టకామ్యాభి ఫలసిద్ధివంతులు కావచ్చును !

'కాకాపట్టు'కు మొసలి అయిననూ లొంగును, హిమనగ మయిననూ క్రుంగును, సముద్రమైన యింకును పరాత్పరుడైననూ మీ ముందు ప్రత్యక్షమగును ! !

చివరిమాట :—

నెపోలియన్‌కేకాదు, "కాకామంతు'ని పదకోశంలోకూడా "అసాధ్యం" అనే పదంలేదు !

కాకీయుల కులం దినదినానికీ వర్థిల్లుగాక !

'కాకా'కి శుభమస్తు ! !

అనవరతం 'కాకిష్టు'లకి విజయోస్తు ! ! !

అంకితం : అఖిల ప్రపంచ కాకాజాతి ట్రేడ్ యూనియన్‌కి....

★



ఎల్లప్పుడూ టినోపాల్
ఉపయోగించి
దుప్పట్లను
తలగడా గలేబులను
టేబుల్ గుడ్డలను
కళ్లు మిరుమిట్లు
గొలిపేలా తెల్లగా మరింత
తెల్లగా ఉంచుకోండి




క్రమం తప్పకుండా టినోపాల్ ఉపయోగించి మీ దుప్పట్లను, తలగడా గలేబులను, టేబుల్ గుడ్డలను, తువ్వాళ్లను మెరిసేలా తెల్లగా ఉంచుకోండి — ఎల్లప్పుడూ! మీరు టినోపాల్ వాడుతే మీ యింట్లో వాడుకునే దుప్పట్లు మొదలైనవి, వెలిసిపోయి మాసిపోయినట్లు ఉండవు. టినోపాల్ ను క్రమంగా వాడితే మాత్రమే మీ తెల్లని బట్టలు నిజంగా తెల్లగా ఉంటాయి. కనుక మీరు తెల్లని బట్టలను ఉతికిన తరువాత వాటిని టినోపాల్ కలిపిన నీళ్లలో ఝాడించండి—ఎల్లప్పుడూ!




టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఎ. బాసిల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కు.

ఉత్పత్తిదారులు:
సుహృద్ గైగి లిమిటెడ్ వడి వాడి, బరోడా

veigy

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పోస్టు బాక్సు 965, బొంబాయి-1 బి.ఆర్.

TEL SISTA'S SG 174A

# వాన వెలిసిన రాత్రి

10—పేజీ తరువాయి

తీవ్రంగా ఉంది. అన్నం తిని భగవద్గీత ముందేసుకుని చదువుకుంటున్నాడు. పొద్దెంతపోయిందో తెలియదు. అస్పష్టంగా తలుపు కొట్టిన శబ్దమైతే, గాలివల్లనేమో అని మొదట అనుకున్నాడు! కానీ కాదని తెలిశాక, లేచి వెళ్ళి తలుపు తీశాడు.

ముద్దగా తడిసిన ఓ స్త్రీ, చిన్న పాపను భుజాన వేసుకుని, వణుకుతూ లోపలికొచ్చింది. తలుపు గడియపెట్టిన దుర్గయ్యగారు ఆమెను చూసి క్షణం ఆశ్చర్యపోయినారు.

ఆమే అంతే! చంకలోని పిల్ల మాత్రం ఏడుస్తున్నది చలికి గాబోలు!

"నువ్వా ?! ......" అని మాత్రం అన్నాయి దుర్గయ్యగారి పెదవులు!

"మీరింకా యిక్కడే ఉన్నారని తెలిసి రాలేదు. వానా, గాలీ; పిల్ల ఏడుస్తూంటే ఈరాత్రికి తల దాచుకుందామని వచ్చా! అంతే!"

దుర్గయ్యగారు మరేం మాట్లాడలా! పొడిగుడ్డ లిచ్చి, పొయ్యి రాజేసి, పాలు కాచి యిచ్చాడు! ఆ పాలు పిల్లకు పట్టింది.

"మరి నువ్వో ?" దుర్గయ్యగారి ప్రశ్నకు ఆమె అలవోకగా నవ్వి, "ఏమీ అక్కర్లేదు! ఈ రాత్రికి తలదాచుకోనిచ్చారు; అంతేచాలు. మిమ్మల్ని బాధ పెట్టటం యిష్టంలేదు." అంది.

దుర్గయ్యగారి గొంతులో మాటలు గడ్డ కట్టుకుపోయినయ్! మరి మాట్లాడక, పుస్తకం లోకి చూస్తూ కూర్చుండిపోయారు. ఆమె మాత్రం కొంగు పరుచుకుని, పిల్ల ప్రక్కను పడుకుంది.

ఆమె మాత్రం మర్నాడు కనుచీకట్లోనే వెళ్ళిపోయింది! దుర్గయ్యగారే పోనియ్యలేదు.

దుర్గయ్యగారు ఆ రాత్రి నిద్రకు దూరంగానే ఉన్నారని ఆమె గ్రహించగలిగింది. "నా గురించే ఆలోచించారా! తెల్లవార్లూ ?" అని అడిగింది.

"అవును!"

తెల్లారేసరికి వాన తగ్గింది కానీ, దాని బీభత్సమంతా చూసి పోనియ్యలేదు దుర్గయ్యగారు ఆమెను. వాగులూ, వంతలూ, పొలాలూ అన్నీ నీటిలో దాక్కుండిపోయినాయి. కనుచూపుమేరలో అంతా నీటిమయం. అందుకనే పోనియ్యలేదు.

"ఎప్పటికైనా పోవాల్సిందాన్నేగా! వెళ్ళనివ్వండి!"

"నా ముందర, నా యింట్లో కొద్దికాలం ఉండటం కూడా బాధగా ఉందా నీకు ?" అని ప్రశ్నించారు దుర్గయ్యగారు. "పైగా రాత్రికూడా ఏమీ తినలేదన్న సంగతి మర్చిపోకు. ఇలా నిన్ను పోనివ్వటం నాకు మనస్కరించదని నీకు తెలిసి కూడ పోతానంటే నే చెప్పేదేమీ లేదు!" అని కూడ అన్నారు.

ఆమె ఆలోచనలతో సతమతమయింది కాసేపు. ఇంతలో పాపకూడ నిద్రలేచింది. మారు మాటాడక ఆమె అలాగే ఉండిపోయింది.

దుర్గయ్యగారు త్వరగా స్నానం, సంధ్య ముగించి, "నే బజారు వెళ్ళి, తినటాని కేమన్నా తెస్తాను." అని వెళ్ళిపొయ్యారు వీధిలోకి సరాసరి. ఊళ్లో హోటలుకెళ్ళి, ఇడ్లీలు కట్టించుకుని, కాఫీ చెంబులో పోయించుకుని వచ్చారు.

"మిమ్మల్ని శ్రమ పెట్టటం జరుగుతున్నది." అన్న దామె, అవన్నీ చూసి.

దుర్గయ్యగారి కళ్లల్లో నీళ్ళు తిరిగినయ్. ఆమె మాటలకు తమాయించుకున్నారు. "అన్నీ తెలిసి కూడ నా మనసును కష్టపెట్టకు. నా కీ జీవితాన ఇంతే వ్రాసిపెట్టి ఉంది. అందుకు నాకు చింత లేదు!" అని అన్నారు.

ఆయన యిచ్చిన పొట్లాలు అందుకుని, పిల్లకు తినిపించి ఆమె ఊరుకున్నది.

"మరి నువ్వు ......"

"శనివారం, ఏమీ తినను."

"ఇంకా, ఆ నియమం వదల్లేదా ?"

"వదల్లేనేమో! మిమ్మల్ని వదలగలిగాను కానీ, మీ సాహచర్యంలోని అలవాట్లు వదల్లేకపోతున్నా!"

"అందుకు ఇప్పుడు బాధపడుతున్నావా ?" ఆయన ప్రశ్న ఆమెను తికమక పరచింది.

"ఏనాడైతే మిమ్మల్ని విడిపొయ్యానో ఆనాడే బాధలకు నా మనసు నిలయమైంది. వాటికి అంతు లేదు. నన్నిలా కలకాలం బాధపడమనే, మీ రానాడు

---

రోజల్లా వాదిస్తున్న న్యాయవాదిని చూచి అన్నాడు న్యాయమూర్తి:

"మీ వాదం త్వరగా ముగించండి! చూచుకోవలసిన కేసులు చాలా ఉన్నాయి."

"చిత్తం! చిత్తం! కాని మా పార్టీకి పని ఉన్నది ఈ ఒక్క కేసులోనే సార్!"

శ్రీనివాసరావు (భట్టిప్రోలు)

---

నన్ను వెలిగ్గా పంపగలిగారు! నాకు తెలుసు! మీది రాతి హృదయం. పైదంతా నటన." ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"పార్వతీ! .... నన్ను ఎవ్వరూ అర్థంచేసుకోలే దింతవరకూ! ప్రతిసారి నేనే, పార్వతీ, ఓడిపోతున్నది జీవితంలోని ప్రతి ఘట్టంలోనూ—చదువులో, వివాహంలో, ఆఖరికి ఈ వయస్సులో కూడ. నాకు మిగిలిందేమిటి ? బాధ! మానని గాయం! అంతే!" ఆయన గొంతు పూడుకు పోయింది.

సాయంత్రానికి పాపకి జ్వరమొచ్చింది. అందు వల్ల ప్రయాణం సాగలేదు పార్వతి పోతానని బయలుదేరింది; జ్వరంతో ఉన్న పిల్లతో! కానీ దుర్గయ్యగారు ఒప్పుకోలేదు!

"మీ దయకు అంతులేదా ? మీ దయ అపారమై, నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. ఎప్పుడో గిలగిలలాడి ప్రాణవాయువులు గాలిలో కలిసి పోతాయి. అప్పుడే మీకూ, నాకూ, అందరికీ శాంతి."

దుర్గయ్యగారికి ఈ పరిస్థితి చూసి జాలి వేసింది. ఉన్న కాసేపూ సూటీ పోటీ మాటలతో ఒకర్నొకరు బాధించుకోవటమేనా ? అందుకే ఆయన వాదన పెంచటం ఇష్టంలేక, సాధ్యమైనంత వరకూ యిల్లు వదిలి తిరిగారు.

బజార్లో కూడ పార్వతి గురించే ప్రశ్నలు ఎదుర్కోవాల్సి వస్తుందని ఊహించివుంటే, అసలు వీధిలో కొచ్చేవాడే కాదేమో! అందరికీ, తన ఇంట్లో గల స్త్రీ గురించి, తమ యిద్దరికీ గల అనుబంధాన్ని గురించీ ఆలోచనే రావటం ఆయనకు ఆశ్చర్య మేసింది.

స్వతహాగా ఆయనది శాంత స్వభావం! అందుకని అందరిముందు తప్పుచేసినట్లు తల వొంచుకోక, ఉన్న విషయం చెప్పివేశాడు.

ప్రొద్దు గ్రుంకే వేళ, మిత్రుడు రామ్మూర్తితో కలసి కాలవకట్ట కెళ్ళినప్పుడు తనే స్వయంగా చెప్పాడు "పార్వతి వచ్చిం"దని!

"నిజమా! .... విన్నాను, మీ యింటి కెవరో స్త్రీ వచ్చిందని!" కాస్సేపాగి, "ఏమంటున్నది ?" అని ప్రశ్నించాడు డాక్టరు రామ్మూర్తి!

"ఏ విషయాన్ని గురించి నీ వడుగుతున్నది!" దుర్గయ్యగారి ప్రశ్నకు, రామ్మూర్తిగారు సమాధానం చెప్పలా! విషయం మారుస్తూ "ఎలా ఉంది ? పూర్వంలానే ఉందా ? ఆమెలో మార్పు వచ్చిందా ?" అని అడిగారు.

దుర్గయ్యగారు, బట్టతల రాసుకుని, "రామ్మూర్తీ! "వనితా విత్తం పరహస్తం గతం గతం!" అని నీకు తెలియందికాదు. పార్వతి అంతే! పైగా వేరొకని కీ ఆడపిల్ల! ఆమెలో మార్పెంటానా ? వెలిసిపోయి చిరిగిన పట్టువస్త్రంలా ఉంది ఆమె. అంతే!"

రామ్మూర్తిగారు దుర్గయ్యగారి వేపు పరీక్షగా చూశారు. యిద్దరికీ చిరకాల స్నేహం! దుర్గయ్యగారు, వార్ధక్యమూ, బాధలూ, వాటితో మనస్థైర్యము లేకపోవటంవల్ల, మనిషి చాలావరకు క్రుంగిపొయ్యారు. కళ్ళు, మొహము ఉబ్బినాయి! జుత్తు పండిపోయి రాలిపోయింది. జవసత్వాలు కరిగి పోయినాయి ఆయనలో. పైగా, విద్యుదాఘాతం వలె పార్వతి విడిపోవటం! అన్నీ ఆయన్ను కలచి వేసి, కృశింపచేసినయ్!

"రామ్మూర్తీ! ఒక్క విషయం ఆలోచించి సలహా ఇవ్వు! నా కష్టసుఖాలు తెలిసినవాడివి! ఈ సమయంలో నువ్వే నాకు అండ; చెప్పగలవా?" దుర్గయ్యగారి మొహంలో, మాటలో ధ్వనించిన జాలి, ప్రార్థన విని రామ్మూర్తిగారు కరిగి పొయ్యారు.

"తప్పకుండా దుర్గా! చెప్పు."

"పార్వతి ఎంత చెడ్డా, నా భార్య! తెలిసో తెలియకో తప్పు చేసింది. యింత కాలానికి ఎలాగో '[illegible]' గా నా యింటికి వచ్చింది. ఆమెను [illegible] ఉందని అనిపిస్తున్నది. నాకా [illegible] ఆమె నిక్కడే నా కళ ఎదురుగా ఉంటుంది అందామని ఉంది. అవమాత్రం దయ[illegible] ఆమె [illegible] కాదా! చెప్పు రామ్మూర్తీ!". దుర్గయ్యగారు [illegible]

# వాన వెలిసిన రాత్రి

శంతో మాట్లాడారు. మధ్యలో ఆయన ...శం గాద్గదికమైంది.

రామ్మూర్తికి తెలుసు; పార్వతి దుర్గయ్యగారికి ఆరో ప్రాణమని! అలా ప్రేమించారు; ప్రేమ పంచి యిచ్చారు ఆమెకు! కాని ఓ వానరాత్రి ఆయన్ను, ఆయన సాహచర్యాన్ని, నమ్మకాన్ని త్రోసిపుచ్చి వెళ్ళిపోయింది దుర్గయ్యగారి బహిః ప్రాణం! తిరిగి, యిన్ని సంవత్సరాలకు అయాచితంగా వచ్చింది. ఆమె పోయినా, ఆమెమీద ప్రేమ, మమకారం ఆయన్ను వదల్లేదు. నరనరాన ఆయన్ని పట్టుకు వేధించుతున్నది.

రామ్మూర్తి తన అభిప్రాయాన్ని వెంటనే చెప్పలేక పోయినాడు. "చూడు దుర్గం! తెలిగ్గా ఓ నిర్ణయానికి నే రాలేకపోతున్నా! రోజులు గడవనీ! ఆలోచించి చెప్తాను. పద; పార్వతిని చూద్దాం!" అన్నారు.

ఇద్దరూ వెళ్ళేసరికి పార్వతి, మేరీని నిద్రపుచ్చుతోంది. రామ్మూర్తిని చూసి క్షణం నిష్చేష్టపోయింది. ఏదో లజ్జ ఆమెను ఆవహించింది. కొంగు నెత్తిమీదకు కప్పుకుని, వొరిగి ముఖాలకు ఒదిగి నిలబడి...

"బాగున్నావా ...?" ప్రశ్నించారు రామ్మూర్తిగారు. అయినా ఆమె సమాధాన మివ్వలేదు. మౌనం వారిమధ్య చోటు చేసుకుంది. దుర్గయ్య ఆ నిశ్శబ్దతను భరించలేక "అమ్మాయికి జ్వర మొచ్చింది. చూసి మందు యివ్వండి" అన్నారు.

రామ్మూర్తిగారు, మేరీని పరీక్ష చేసేప్పుడు ఆయన్ను గమనిస్తూనే ఉంది పార్వతి సిగ్గుతో, లజ్జతో, వాలిన కళ్ళతో!

"జ్వరాన్ని గూర్చి భయపడాల్సిందేమీ లేదు. మందిస్తాను. తగ్గుతుంది. అయినా యిప్పుడే అమ్మాయిని కదలించటం మంచిదిగాదు దుర్గయ్యగారూ!" అన్నారు.

"ఎన్నాళ్ళుండాలంటారు?"

"జ్వరం నిమ్మళించేదాకా!" అని రామ్మూర్తిగారు వెళ్ళారు. బరువుగా, దీర్ఘంగా నిట్టూర్చి పార్వతి "ఆయన్నిలా అర్ధాంతరంగా ఎందుకు తీసుకొచ్చారు? నా తల అవమానంతో ఎందుకు పగిలిపోదో అనిపించింది. ఏమైనా మీకు ప్రపంచంలో బ్రతకటానికి కావాల్సిన జ్ఞానం యింకా లభ్యపడలా! లేకపోతే, ఆయన ముందిలా అవమానపరిచేవారా నన్ను! చెప్పండి" ఆమె రోషంగా చూసింది.

దుర్గయ్యగారు చలించలా! "అలాంటి భావమేం లేదు నాకు. పసిపిల్ల జ్వరంతో మూసిన కన్నెరక్కుండా ఉంది. మందిప్పించి, పిల్లకు స్వస్థత చేకూరాల్సిన బాధ్యత నాకుంది, నువ్వెంత కాదన్నా!" అని సమాధాన మిచ్చారు.

"బాధ్యతా? మీకా? చాలా ఆశ్చర్యంగా ఉందే! ఏ సంబంధమూ లేని ఓ అనాధబాలికమీద మీకెందుకు జాలి ఉండాలి?" ఆమె రెట్టించింది.

"ఏం ఉండకూడదా? పైగా ఆ బాలిక నా ఒకనాటి భార్యవల్ల ఈ లోకంలో అడుగుపెట్టింది. ఆ అనుబంధం చాలదా? అయినా నా కివ్వేమీ తెలియవు. ఆ పిల్లకు మందిప్పించాలనీ, అది నా తక్షణ

కర్తవ్యమని నా అంతరాత్మ ఘోషించింది. దాన్ని శిరసావహించాను. అంతే!"

'మీ అంతరాత్మ చాలా విచిత్రమైంది లాగున్నదే ? అయితే ఆ అంతరాత్మ ఆ బాలికతల్లిని కూడ ప్రేమించమని చెప్తున్నదా ? పిచ్చిమీకు వదల్లేదు ! అంతరాత్మలేదు; ఏమీలేదు ! మొదట్నుంచీ అదే మిమ్మల్ని అడ్డదారుల్ని లాక్కొనివెళ్లి' ఇబ్బంది పెడుతోంది. ఇప్పటికైనా దాన్నుంచి, తప్పుకు రండి !"

మరి ఆయన నోరు తెరవలేదు !

ఆ రాత్రి ఆయనకు, పార్వతి ఏడుస్తుండగా మెళకువ వచ్చింది! అంత రాత్రి ఆమె ఏడుపు విచిత్రంగా కనబడింది ఆయనకు! దీపం పెద్దది చేసి, "పార్వతీ ! ఎందుకేడుస్తున్నావో నే తెలుసుకోవచ్చా !" అని అడిగారు !

"తెలుసుకుని, వెళ్లగొడతారా ?"

"ఎంతమాట.... అంతటి దుష్టుడిగా భావిస్తున్నావా నన్ను ! కానీ ఒక్కసంగతి మర్చిపోకు ! నీకింకా అప్పుడు, నీ శ్రేయోభిలాషి, బతికే వున్నానని గుర్తుంచుకో !"

దుర్గయ్యగారెళ్లి, మంచంమీద కూర్చున్నారు. కానీ ఆమె వెక్కివెక్కి ఏడుస్తూనేవుంది ! అదే ఆయనకు బాధగావుంది ! చాలాసేపు నిద్రను దగ్గరికి రానీయకుండా, ఆమెను చూస్తూ కూర్చునే వున్నాడు.

ఆయనకు, ఆమెతో గడిపిన రోజులు స్మృతిపథంలోంచి యింకా మాసిపోలేదు. వారాలు చేసుకు చదువుకుని, పదిమంది దయా దాక్షిణ్యాలమీద బాల్యం గడిపిన ఆయనకు, వివాహమైన క్రొత్త రోజుల్లో పార్వతిని చూసి, తనకూ ఓ సహచరిణి దొరికిందని, తన కష్టసుఖాలు పంచుకుంటుందనే ఆశించారు !

కానీ పార్వతి ఆయన ఆశల్ని ఎక్కువరోజులు ప్రాణంతో ఉండనివ్వలేదు. బతికి,చెడ్డ కుటుంబంలోని ఆమెకు భర్తతో కాపురం, గార్హస్థ్య జీవితం ఖైదుగా తోచింది. ఆ భావాన్ని చేతల్లో, మాటల్లో అన్నిటా వ్యక్తీకరించటానికి శాయశక్తులా ప్రయత్నించింది !

క్రమంగా, ఓ అగాధాన్ని ఏర్పరచుకుని ఆమె తనకూ భర్తకూ, తను దారితప్పిన యక్షకన్య అని, ఆతడు తన పాలిట కింకరుడనీ తలపోసింది. అదే భావం ఆమెలో వ్రేళ్లుపాతుకుని, మ్రానయి, శాఖోప శాఖలుగా విస్తరించినది. ఏ సమయంలోనూ అతడెంత ప్రయత్నించినా, ఆమె అతనికి సన్నిహితురాలు కాలేకపోయింది. అసంతృప్తి ఆమెను వ్యాపింది.

ఈ అర్ధరాత్రి తన తప్పిదాలను తల్చుకుని పరిహారం కొరకు విలపిస్తున్నదా ఆమె! అనే భావం కూడ ఆయనకు కలిగింది.

"జరిగినదానికి బాధపడి ప్రయోజనం లేదుగా పార్వతీ !" అన్నారు ఆమె, శోక సముద్రం నుంచి ఒడ్డుకు వచ్చిన తర్వాత !

"జరిగిందానికి బాధ ఎప్పుడూ లేదు ! భవిష్యత్తును చూస్తుంటే నా భయం పెనుభూతమై కన్పడుతున్నది. ఎలా బతకాలి ! త్రాడు తెగిన గాలిపటం గమ్యం ఏమిటి ? ఈ ముక్కుపచ్చలారని పిల్లకు ఆధార మెవ్వరు ? అదే సమస్య. ఈ సమస్య తీరే మార్గం కనుచూపుమేరలో లేదు !"

దుర్గయ్యగారు ఏం సమాధానం చెప్పాలో తెలీక చూస్తూనే ఉన్నారు. తొందరపడి చేసే నిర్ణయం వల్ల కలిగే ఫలితాలను తాను ఎదుర్కోగలడా ? అనే సందేహం ఆయన్ను వేధిస్తున్నది.

"అయినా ఇందులో నాదిమాత్రం ఏం తప్పుంది? నన్నా వాడు అలా ప్రవర్తింపజేసిన కోరికల దా తప్పు! జాలి, సహృదయత పేరుతో నా మానాన వదలి, చేతులు ముడ్చుకూర్చున్న మీదీ తప్పు ! అంతే నిశ్చయంగా !"

ఆమె చేసిన నేరారోపణకు ఆయన ఉలిక్కిపడి "నాదా తప్పు ?" అని ప్రశ్నించారు.

"ఆహా ! మీదే ! పిల్లలకు చెడునడవడి కలిగితే, ఆ తప్పు తల్లితండ్రులదేగా ! అలాగే భార్యనూ ! కొట్టో, నానాహింస పెట్టో, నన్ను ఆ చెడుమార్గంలోకి పోకుండా ఆపితే, ఈనాడు అనాథనై, భ్రష్టనై మీముందు, మీమీద నేరారోపణ చెయ్యాల్సిన అగత్య మేముంటుంది ? మాట్లాడరేం ? ఒక్క ఆడదానికి సమాధానం చెప్పలేని మీరు ఎంత సజ్జనులు, ధర్మపరులైతే ఏం లాభం ?" పార్వతి మొహం లాంతరు వెలుతుర్లో వేటలోంచి తప్పించుకున్న బెబ్బులిలా కనిపించింది దుర్గయ్యగారికి ! ఈసడింపు, అసూయ, సుస్పష్టంగాని బాధ, ఆమె పాలిపోయిన ముఖంలో వింతకాంతిని ప్రస్ఫుటం చెయ్యసాగాయి.

"అయితే నీ బాధ్యత, నీ కుమార్తె బాధ్యత, ఈ వృద్ధాప్యంలో వహించక తప్పదనేగా నీఆంతర్యం." నిశ్చయంగా అడిగారు ఆయన.

"అలా అని నే నేం ప్రాధేయపడను. ఎంతగా పతనం చెందినా, దైహిక, మానసిక, ఆర్థికంగా; మాయమాటలతో, బరువు బాధ్యత మీమీద పెట్టి చూస్తూ కూర్చోలేను."

మరయితే ఈ ములుకుల్లాంటి భాషతో పొడిచి బాధ పెట్టటం .... కేవలం సరదా కాదుగా ? ఆయనకు అర్థంకాలేదు.

అప్పుడే పార్వతి దుర్గయ్యగారింట్లోకి వచ్చి పదిహేనురోజులైంది. గ్రామంలో వృద్ధుడైన దుర్గయ్యగారి రసికత్వాన్ని గురించి గుసగుసలు ప్రారంభమై, పార్వతి చెవిన సోకినయ్ ! ఆమె ఆ నీచపుమాటలు విని సహించలేకపోయింది.

"ఒక్క క్షణం ఈ యింట్లో ఉండను ! నావల్ల మీరు లోకుల దృష్టిలో దోషిగా నిలబడటం చూసి నేను సహించలేను. మీరు నన్ను ఆపటం మీ శక్యంగాదు ఈసారి !" కళ్లల్లో నీళ్లు గిరికీలు కొట్టినయ్ ఆమెలో.

దుర్గయ్యగా రందుకేమీ మాట్లాడలా ! మేరీని ఒడిలో కూర్చోపెట్టుకు ఆడిస్తూ ఆమె చిన్ని నోరునూ, మిలమిలా మెరిసే నేత్రాలనీ చూస్తూ కూర్చున్నాడు. మేరీ తన్ను వదలదనీ, అందువల్ల పార్వతి కాళ్లకూ సంకెళ్లు పడతాయనీ ఆయన గ్రహించగలిగారు.

"రా ! వెడదాం !" అని ఆయన నుండి మేరీని బలవంతంగా లాక్కోబోయింది. మేరీ, దుర్గయ్యగారిని కౌగలించుకుని రాకపోవటం చూసి, కోపంతో రోషంతో బలవంతాన లాగి నాలుగు కొట్టింది. "పాడుదానా ! నా ప్రాణానికి తగులాటకమైనావు. నాకు చావూ రాదు; నీకు మిత్తి అంటనూ అంటదూ ! ఇద్దరమూ కలిసి ఏ బావిలోనో దూకితే సరిపోతుంది." ఆమె శోకాన్వితమైన గొంతుతో బావురుమనది. మేరీతోపాటు.

# వాన వెలిసిన రాత్రి

దుర్గయ్యగారి మనస్సు చివుక్కుమన్నది. తన నుంచీ, ఆమె ఎందుకు తిరిగి దూరమవ్వాలని, సదా ఘూర్ణిస్తున్నదో ఆయనకు అంతుచిక్కటంలా! తల్లీ కూతుళ్లు తమ శోకాలనుంచి బయటి కొచ్చింతర్వాత, దుర్గయ్యగారు తన నిశ్చయాన్ని వెళ్లబుచ్చారు.

"చూడు పార్వతీ! నీకు కష్టం కలిగిస్తే క్షమించు. వాళ్ళపై కోపాన్ని అభమూ, శుభమూ తెలియని పసిపిల్ల మేరీమీద చూపితే నే సహించలేను. కానీ ఒక్కటి గుర్తుంచుకో! నేను బ్రతికున్నంతవరకూ నీకూ, నీ మేరీకి ఏ లోటు రానివ్వను. ఆ తర్వాత సంగతి చెప్పలేను. రహమాన్ కూడా నా మాట జవదాటడని నా నమ్మకం. నామంచి ఏవిధమైన సహాయమూ నీవు పుచ్చుకోవటానికి నీకు యిష్టము లేకపోతే నే చెప్పేదేమీ లేదు. నీకోసం ఈ యింటి తలుపు ఎప్పుడూ తెరిచే ఉంటాయి." అని చెప్పారు; ఆయన దూరంగా కనుపించే తోట తోపునీ, దాని కవతలనున్న కాలువను చూస్తూ.

పార్వతి ఏం మాట్లాడలేదు ఆ తర్వాత. ఏదో చెప్పలేని కాంక్ష, మాటలు, ఆమె కళ్లల్లో తొంగి చూచేవి కొన్నాళ్లవరకూ.

కానీ ఓ రాత్రి మేరీని వదిలి ఎటో వెళ్లింది పార్వతి. తిరిగి రాలేదు. వస్తుందని కూడ ఎదురు చూడలేదు ఆయన ఆమెకోసం. అందువల్ల ఫలితమూ లేదని ఆయనకు తెలుసు. ఎందుకలా ఆమె చేసిందో ఆయనకు పూర్తిగా తెలియదు.

ఆతర్వాత ఏదో స్త్రీ శవం మోటబావిలో కనుపించిందనీ, ఆ శవం పార్వతీదేవని రామ్మూర్తి గట్టిగా బలపరచగా వెళ్లి యిద్దరూ చూచారు. పూర్తిగా గుర్తుపట్టటం సాధ్యపడలేదు కాని ఆ శవం ఆమెదేనని రామ్మూర్తి ఎంత వాదించినా, ఆమె అంత పిరికిది కాదని దుర్గయ్యగారి ఆత్మవిశ్వాసం.

ఏదేమైనా ఆమె తిరిగి రాలేదు.

ఆరోజునుంచీ దుర్గయ్యగారికి క్రొత్త బాధ్యత పడింది. మేరీకి సంరక్షణ చేయటం ఆయన దినచర్యలో స్థానం ఆక్రమించుకుంది. అందుకు ఆయన ఏమీ బాధపడలేదు. తప్పుకోవాలని దాని నుంచి ప్రయత్నమూ చెయ్యలేదు.

వచ్చీరాని మాటలు వింటూ మేరీ నుండి ఆనందాన్ని లభ్యపరుచుకోవటానికి ఆయన కృషిచేస్తూ తల్లిలేని లోటును తీర్చటానికి ప్రయత్నం చెయ్యసాగారు. ఆయన కదేమీ క్రొత్త కాదు.

సరిగ్గా కొన్నేళ్ల క్రితం:

తల్లిలేని రహమాన్ యొక్క బాధ్యత స్వీకరించి యింతవరకూ దానిని నిర్వహించాడు. ఈరోజుకి రహమాన్ యుక్తవయస్కుడైనాడు. తన ఈ వృద్ధాప్యంలో అతడు చేదోడుగా ఉంటాడని ఆశించాడు. నిశ్చింతగా బ్రతుకవచ్చని భావించాడు.

కానీ మేరీని సాకి, ఈ లోకంలో గౌరవనీయ కుటుంబాలలో చేర్చవలసిన కర్తవ్యం తను నెరవేర్చగలననీ, మేరీ భవిష్యత్తు తన చేతుల్లో పవిత్రమంగా రూపుదిద్దుకోగలదనీ, పార్వతి తలంచటం వల్ల దుర్గయ్యగారు ఆ బాధ్యతనూ సంతోషంగా స్వీకరించాడు.

రామ్మూర్తి రోజూ వచ్చి పలకరించి పోతున్నాడు. రోజులు సాఫీగా సాగుతున్నయ్. మేరీ ఆరోగ్యంగా పెరగసాగింది. ఆమెను చూస్తూ జీవితంలో చివరి క్షణాలు గడుపసాగారు దుర్గయ్యగారు.

ఈరోజు!

రహమాన్ దగ్గర నుండి సుదీర్ఘమయిన లేఖ వచ్చింది దుర్గయ్యగారికి. ఆసాంతం చదివి ఆయన బాధపడ్డారు. సాయంత్రం ఆప్తమిత్రుడు రామ్మూర్తి రాగానే ఉత్తరం తీసి చేతికిచ్చి చదవమన్నారు."

రామ్మూర్తిగారు చదివారు. "ఇలా జరుగుతుందని తెలుసు. పరాయివాళ్లెప్పుడూ పరాయివాళ్లే! నీవాళ్లు కారు" అని అన్నారు.

"నిజమే అవొచ్చు. అంతమాత్రాన నువ కర్తవ్యాన్ని నిర్వర్తించటంలో తప్పు లేదుగా! ప్రతి

ఫలాపేక్ష లేకుండా చెయ్యటమే మనవంతు."

"చూడు దుర్గం! మనది అనుకుంటే అన్నీ మనవే! కాదనుకుంటే కావు. నీ కులం, మతంకావి, బంధువుకూడ కాని, రహమాన్ బాధ్యత వహించావు. జరిగిందేమిటి? నిష్కల్మషమైన నీ జీవితానికి కళంకం ఆరోపించాడు. ఇది చాలదూ! ఇంతకన్నా జరగాల్సిందేమిటి? ఆలోచించుకో. రేపు మేరీ అయినా అంతే! రెక్కలొచ్చేంతవరకే మనం. ఆతర్వాత మనతో వాళ్లకు అవసరమే లేదు. ఎవరి దారి వారిదే." దుర్గయ్యగారి భుజం తట్టి "నీ మనస్సు నేమీ బాధ పెట్టుకోకు. ఇప్పటికైనా నిజానిజాలు రహమాన్‌కు తెలియచెయ్యి. మంచు తెరలు తొలగించు. అదే అందరికీ క్షేమం." అని చెప్పారు.

ఆతర్వాత దుర్గయ్యగారు దీర్ఘంగా ఆలోచించుకున్నారు. కలం అందుకుని వ్రాయసాగారు.

"చిరంజీవి,

సరిగ్గా ఇరవయ్యేళ్ల క్రితం ఓ సాయంత్రం, కొన్ని రోజుల క్రితం ఆ ఊరి—పేరు తెలుసుకోవటంవల్ల ఉపయోగంలేదు—హైస్కూలుకు వేరొక ప్రదేశమునుండి బదిలీ అయి వచ్చా. స్కూలు వదిలింతరువాత ఇంటికెళ్లే ప్రయత్నంలో ఉన్నా. ఓ కుర్రవాడు స్టాఫ్‌రూం కొచ్చి నన్ను రజియాబేగం, తమ యింటికి అర్జంటుగా రమ్మని కబురు చెప్పి పంపింది. సహ—ఉపాధ్యాయుడు జేసురత్నం వెకిలిగా నవ్వి "వెళ్లండి! మీ పంట పండింది!" అని కన్నుగీటి వెళ్లాడు.

కానీ నేను అంతగా అతడి వ్యాఖ్యానాన్ని పట్టించుకోలా! ఆ కుర్రవాడెంబడి నడచి, ఊరికి దూరంగా ఉన్న మామిడితోటలో ఉన్న బంగళాకి వెళ్లాను. అదే ప్రథమం నా జీవితంలో అంత అందమైన బంగళాను చూడటం. సుందరమైన తైలవర్ణ చిత్రాలు, చిత్రకళా వైభవంతో విర్రవీగే రకరకాల పరికరాలు ఆశ్చర్యంతో చూస్తూ ఒంటరిగా సోఫాలో కూర్చుని త్వరగా ఇంటికి వెళ్లి పార్వతి సన్నిధానంలో కాలం గడపాలనీ, అందమైన సాయంత్రం త్వరగా పోతున్నదని విచారిస్తూ కాలం గడపసాగాను.

ద్వారానికి ఉన్న వల్చటి తెరను తొలగించుకుని ఖరీమ్మైన వస్త్రాదు వెనుక మేలి ముసుగు ధరించి రజియాబేగం వచ్చింది.

నేను రెండు మూడు సార్లు కంటె ఎక్కువ చూడలేదు ఆమెను. కొందరు మహమ్మదీయ స్త్రీలు పరాయి పురుషుని సమక్షంలోకి రాగని నాకు తెలుసు. కాని రజియాబేగం వచ్చింది. అప్పుడామె చాలా చిన్న వయస్సులోనే ఉంది. ఆమె ముఖములో విచారరేఖా ఉంది.

అసలు విషయం చెప్పలేదుకదూ! ఆమె కుమార్తె చాంద్‌బీకు తెలుగూ, లెక్కలూ చెప్పాలని ఆమె కోరింది. అదీ ఆ బంగళాకు రోజూ వచ్చి చెప్పాలని— ప్రతి సాయంత్రమూ!

నేను ఏ విషయమూ చెప్పలేదు. తక్షణం మర్రోజు నా నిర్ణయం చెబుతానని వచ్చేశాను. ఆ రాత్రి పార్వతితో ఆ విషయం కదిపాను. పార్వతంటే నా భార్య! ఆమె వెలిబుచ్చిన సందేహాలు—అంతమంది ఉపాధ్యాయులుండగా నన్నే ఎందుకు ఆ చాంద్‌బీకి ట్యూషను చెప్పటానికి పిలిపించాలి? ఇందులో ఏదో రహస్యముందని అభ్యంతర పరచింది.

ఆ రోజుల్లో పార్వతి మాట, గీసిన గీటు దాటే వాణ్ణి గాదు. మరో ఆలోచన లేకుండా ఆ ప్రసక్తి విరమించుకున్నా. జేసురత్నం రోజూ నన్ను వేధించుకు తినేవాడు: "వెళ్లు భాయి! లక్కీఛాన్స్! పోతే రాదు! మరీ ప్రవరాఖ్యుడవైతే ఎలా! వనిత వలచి తనంతట పిలిపించింది" అనేవాడు. నేనంతగా పట్టించుకోలా అతని మాటలు.

ఓరోజు హెడ్‌మాస్టరు పిలిచి "మువ్వు రజియాబేగం కుమార్తెకు ప్రైవేటు చెప్పాలి. నీ పేరు వాళ్లకు తెలియజేసింది నేనే! ఇతరులు చెప్పింది నమ్మకు. ఎదటివాళ్ల బాగు ఓర్వలేరు. ఈరోజేవెళ్లి ట్యూషన్ ప్రారంభించు." అనిచెప్పారు.

వెళ్లి ఆరోజే చాంద్‌బీకి ట్యూషన్ చెప్పటం ప్రారంభించా! మరో ఆలోచన మనసులోకి రానియ్యలేదు. మొదటిరోజు కొన్ని పళ్లు, 50 రు. డబ్బు కానుకగా యిచ్చారు. ఆ డబ్బు చూసి, పార్వతి మొహం పున్నమిచంద్రుడంత అయింది.

క్రమంగా వాళ్లను గురించి సమాచారం తెలుసుకోగలిగా. వాళ్ల యింట్లో ఉండే వస్తాదు నాకా సంగతులన్నీ చెప్పాడు. రజియాబేగం—తండ్రి చాలా భాగ్యవంతుడట. రజియా—భర్త హిందువు. ఇద్దరూ ప్రేమించుకుని పెండ్లి చేసుకున్నారు. అయితే ఎవరూ తమ ఆచారాలు, మతాలు మార్చుకోలేదు. అంత అవసరమూ రాలేదు. బలమైన వారి ప్రేమ, సామాన్య సంకుచిత అవధులు దాటి పవిత్రంగా నిలువగలిగింది.

నవకాళీ దురంతాలు ఎందుకు ఎలా జరిగాయో కనీసం విన్నైనా ఉంటావు. అదే సమయంలో రజియా—భర్త రాంసింగ్ దారుణంగా చిత్రవధ చేయబడ్డాడు. అల్లుడిని రక్షించుకోవాలని రజియా తండ్రి వృథా ప్రయత్నంచేసి, ప్రాణాలు పోగొట్టుకున్నాడు.

చాంద్‌బీతో, నమ్మకస్తుడైన వస్తాదుతో స్వదేశం వదలి ఈ దూర ప్రాంతాలకు ఆమె వచ్చేసింది; తెచ్చుకోగలిగినంత ధనము, సంపద తెచ్చుకుని. కొన్నాళ్లకు ఓ మగశిశువును కూడ కన్నది. అదీ రజియా పూర్వచరిత్ర.

చాంద్‌బీ చాలా తెలివిగలది! అందువల్ల నాకాట్టే శ్రమ ఉండేదికాదు. నామీద చెడు ప్రచారం గ్రామంలో జరుగుతోందని, దానికి జేసురత్నం నాయకుడనీ తెలిసింది. ఎన్నోసార్లు నా ప్రాణం తీశాడు జేసురత్నం ఆయింటి ఆనుపానులు చెప్పమని. ఆ పనే నే చెయ్యలేదు.

కానీ మొదలుపెట్టిన పనిని, మధ్యలో వదిలెయ్యటం నాకు చేతగాని పని!

క్రమంగా రోజులు గడుస్తున్నయ్. రెండు రోజులు గాలివాన, నే నెక్కడికీ వెళ్లలేదు. ఆరోజు కమచీకటివేళ రొజుకుంటూ వస్తాదు మా యింటికొచ్చాడు. కళ్లు జ్యోతుల్లా వెలుగుతున్నాయ్. నన్ను చూసి బావురుమన్నాడు. నా కర్థంకాలేదు. నేను అతడి వెంటనే ఆ చీకటిలో వానలో రజియా బంగళాకు వెళ్లాను.

తోటంతా గాలివానకు పాడుబడిన ఆలయంగా ఉంది. సరాసరి హాల్లోకి వెళ్లేసరికి, పోలీసు ఇన్‌స్పెక్టరు, ఊరి పెద్దమనుష్యులు, ఇంకా ఇతరులు ఉన్నారు.

రజియా తన ఆస్తియంతా తన ఏకైక శిశువుకు వ్రాసేసి కుమార్తెతో సహా ఆత్మహత్య చేసుకుంది. అంతకన్నా యింకేం చెప్పలేను. ఆ తరువాత కేసుల్నూ, పంచాయితీలు నడిచినయ్!

# వాన వెలిసిన రాత్రి

వస్తాదు ఆ ఊరు వదలి వెళ్ళిపోయాడు.

ఆ వాన రాత్రి ఈ శిశువును తెచ్చి పార్వతికి అప్పజెప్పా. కొన్ని దినాల పరిచయంతో ఆమె నాయందు నిల్పిన విశ్వాసాన్ని ఎంతవరకు పవిత్రంగా నిర్వర్తించానో తెలియదు!

రజియా ఆస్తికి నేను ట్రస్టీ అయ్యేసరికి ఊళ్లో నాకు పరపతి పెరిగింది. పార్వతికీ—నాకు అభిప్రాయభేదాలు కలిగాయి. ఆమె బ్రతికివెళ్ళ యింటి ఆడపడుచు. కోరికలు నాగుపాముల్లై ఆమెను కాటు వేసినయ్. రోజురోజుకూ మా మధ్య స్పర్థ పెరిగింది.

"చూడండి! వీడా పసి వెధవ! ఏ జబ్బో వచ్చి వీడు గుటుక్కుమంటే ఆ ఆస్తి మనదే! అయినా చూడండి. మనం ఎంతకాలం ఇలా తిండికీ, గుడ్డకీ మొహంవాచి బ్రతుకుదాం చెప్పండి. మంచీ, చెడు తర్వాత! ఆ ఆస్తిమీద ఆదాయం వాడుకుంటే ఇంతలో ఏంగాదు" ఇదీ ఆమె ధోరణి.

స్థిరసంకల్పుడనై, ఆ పవిత్రమైన కార్యాన్ని నిర్వహించాను. ఆ ధర్మదీక్షలో నా భార్య ఇలా తిరుగుతున్నా, నా గమ్యాన్ని మానుకోలేదు. నా భార్య పార్వతి తీరని కోరికలతో తన జీవితాన్ని వీధిలో పారేసుకుని తిరుగుతూ 'యాదృచ్ఛికంగా' నా యింటికి వచ్చి నాకు ఈ వయస్సులో మేరీని అప్పచెప్పి వెళ్లిపోయింది. ఇందులో దాపరికం ఏమీ లేదు. నీ ఆస్తిని అపహరించాలని తలంపే ఉంటే నిన్ను ఏనాడో ఈ లోకానికి దూరం చేసేవాడిని. నిన్ను చిన్నప్పట్నుంచీ బోర్డింగ్, లాడ్జింగ్ స్కూళ్లో ఉంచి, చదివించి, నీ ఆస్తిని ఇంత భద్రంగా కాపాడేవాడినే కాదేమో! కానీ నీ ఉత్తరంలో నీవు చేసింది అసత్యారోపణ అయినా నా మనసు బాధపడక తప్పలేదు.

పోతే, చాంద్‌బీ సంగతి వ్రాయటం మర్చిపోయాను. ఆరోజు రాత్రి రజియాబేగం, ఆత్మహత్య చేసుకున్న రాత్రి.... చాంద్‌బీ తల్లిని వెతుకుతూ దొడ్లో ఉన్న నూతిబావి దగ్గరకు వెళ్లింది. తల్లి శవం, నీటిలో తేలుతూ ఉంది. ఆ పదేండ్ల చాంద్‌బీ, కర్తవ్యతా విమూఢయై, పెద్దగా కేక వేసి, వెనుతిరగబోతూ కాలుజారి నీటిలో పడిపోయింది. వస్తాదు వచ్చి యిద్దరినీ వెలికి తీసేసరికే ఆ తల్లీ, పిల్ల ఈ లోకాన్ని విడిపోయారు. ఇవన్నీ నాకెలా తెలిసినయ్ అని నీవు అనుమానపడొచ్చు. వస్తాద్ చెప్పాడు. జేసురత్నాన్ని హత్య చెయ్యబోయి దొరికిపోయి జైల్లో పడ్డాడు. అప్పుడే చెప్పాడు ఈ సంగతి: రజియాబేగం చావుకు—జేసురత్నానికీ సంబంధం ఉందని.

ఇంతకన్నా నీకు చెప్పాల్సిందేమీ లేదు. ఇన్నాళ్ల నుంచీ భద్రపరచుకున్న ఈ రహస్యాన్ని, అవసరమొచ్చి నీకు తెలియచేస్తున్నా నీ తండ్రి దుర్గయ్య జీవితంలో కొన్ని ఘట్టాలె యివి ఏమైతేనేం నాకు.... మేరీ అంతే! ఈ ఉత్తరం చదివిన తరువాత, ఈ మాట కాదనలేవని నాకు తెలుసు.

ఎక్కడున్నా నీ మంచే కోరే
దుర్గయ్య."

ఉత్తరం ముగించేసరికి వాన వెలిసింది. దుర్గయ్యగారి మనస్సు తేలికపడ్డది. నిద్రపోయే మేరీని చూస్తూ, భవిష్యత్తు గూర్చి ఆలోచనలోపడిపోయారు దుర్గయ్యగారు ఆ వాన వెలిసినరాత్రి. ★

# రాజధాని కబుర్లు

7—వ పేజీతరువాయి

అయితే తెలుగువాడై పుట్టాడే ! ఇదొక పెద్ద చిక్కే ! మన దేశంలో ఎంత గొప్పవాడయి పుట్టినీ, ఆంధ్రరాష్ట్ర సరిహద్దులు దాటి కపక అయితే ఆయన బ్రతికి బైటపడ్డాడన్న మాటే ! ఈ సరిహద్దుల్లో కపక అయితే, పద్మ వ్యూహంలో చిక్కుకు పోయినట్టు చిక్కుకు పోవాల్సిందే ! మళ్లీ మోక్షం ఉండదు. ఎంత ప్రతిభగల వ్యక్తికయినా రాణింపూ ఉండదు; గణన అంతకంటే శూన్యం. అందరూ మనమీద శీతకన్ను వేసేవాళ్లే! ఇదేం చిత్రమో ! మళ్లీ 'తిండి' కావాలంటే, ఆంధ్రరాష్ట్రం ఎక్కడుందా అని వెతుక్కుంటూ బయిలుదేరాల్సిందే! ఇంట్లో తిని ఇంటి వాసాలు లెక్కపెట్టినట్టు ! పారిశ్రామికంగా ఎంతో వెనకబడి ఉన్నాం. పరిశ్రమలు అభివృద్ధి చెయ్యాలని ఎంతో తహతహ పడుతూ, ఎట్లాగయితేనేం పోట్లాడి భారీ విద్యుత్పరికరాల పరిశ్రమను నెలకొల్పేటట్లు చేస్తే, పాదుపు ఉద్యమంలో, ఈ పరిశ్రమే ప్రప్రథమంగా బలయి పోయిందట ! దేశంమీద ఎన్ని పరిశ్రమలు లేవు! వాటిని కదిలించే గుండెధైర్యం ఉందీ ఢిల్లీ ప్రభుత్వానికి ! నౌకలకు సంబంధించిన 'డీజిల్ ఇంజన్ల' ఫ్యాక్టరీ విశాఖపట్నంలోనే ఏర్పాటు చేస్తామని హామీలు యివ్వటమయింది, హామీల ఆసరాతో ఆశలు పెట్టుకోవటమూ జరిగింది యిప్పు డది కాస్తా 'మద్రాసు' కు వెళ్లిందిట ! విదేశ—మారక ద్రవ్యం, మా రాష్ట్రానికి విడుదల చెయ్యమని మనవాళ్లు గోల పెడుతూనే ఉన్నారు దాన్ని ఆలకించేవారే కనిపించటంలేదు దీంతో విద్యుచ్ఛక్తి సరఫరా సప్లయి తగ్గిపోవటం, మళ్లా మనం లాంతర్లు బుడ్లైట్లు సరిచేసుకునే అవసరం కలగటం అట్టే దూరం లేదు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు తీవ్ర అధిక్షేపణ పంపించారు ఇంకా తయారు చేస్తున్నారు ఈ ఫైళ్లతో సంతృప్తి పడాల్సిందే మనం ! మనమన్నా, మన రాష్ట్రమన్నా, ఇలాంటి ప్రతిపత్తి ఉన్నదన్నమాట ఢిల్లీలో ! ఇక మన రాష్ట్ర నాయకులు చూడపోతే, ఇక్కడ ఉద్దండులే, ఢిల్లీకి వెళితే చేతులు ముడుచుకుని, వినయ విధేయతలు, భక్తిశ్రద్ధలు ప్రదర్శించి తిరిగి రావాల్సిందే ! నెహ్రూగారి ఎదుట ఏమంటే ఏం కోపం వస్తుందో అని భయమో ! లేక అని కూడా ప్రయోజనం లేదని నిరుత్సాహమో! ఈ రెంటిలో ఏదైనా, 'మనవాళ్లు' ఈ పాత పద్ధతిని మార్చుకుని కొత్త మార్గాన్ని కనిపెట్టాల్సిన అవసరం ఎంతైనా ఉంది

ఏది ఏమైనప్పటికి, వీరేశలింగం పంతులుగారి "తపాలాబిళ్లలు" వెయ్యటానికి, వారి జీవితవిశేషాలను డాక్యుమెంటరీ చిత్రాన్ని తీయటానికి అంగీకరించినట్లు కేంద్రంవారు సమావేశకర్తకు వ్రాసిన లేఖలో తెలియపరిచారు అయితే ఈ హామీ కూడా పరిశ్రమల కిచ్చిన హామీ మోస్తరవుతుందో, కార్యరూపం దాలుస్తుందో వేచి చూడాల్సి ఉంటుంది

ఇక స్వామి వివేకానంద శత—జయంతి ఉత్స

# పన్నీరు - కన్నీరు

8 వ—పేజీ తరువాయి

ఇంటర్మీడియేట్ కెళ్ళి, అంతతో చదువు ఆపకుండా తంటాలుపడయినా పైకి చదివి అభివృద్ధిలోకి రావాలని తండ్రి—కొడుకుల్ని కాదని తల్లి చేసిన నిర్ణయం, నరసింహంగారి మద్దతూ సూర్యం జీవితంలో ముఖ్యమైన మలుపుని నిర్ణయించాయి. కొంతవరకూ ఆ నిర్ణయమే మలుపు తరవాత జీవిత లక్ష్యాల్ని మార్చి ఉండవచ్చు.

కాని మలుపు తరువాత సూర్యం జీవితంలో, ఆచరణలో, దృక్పథంలో ముఖ్యమైన మార్పులు ఏవైనా వస్తే దానికి పుట్టుకస్థానం కొంతవరకూ వెనకెప్పుడో తల్లి, తండ్రి చేసిన నిర్ణయంలో చూడచ్చు. ఎప్పుడైతే తను కావాలనుకున్న పిల్ల తనకి కాలేదో, దానికి తనకి గాయమవుతుందన్న విషయం ఎంత లెక్కలోకి తీసుకోకుండా నిర్ణయం జరిగిందో, అప్పటినుంచీ సూర్యానికి కొంతవరక ఎక్కడో అంతరాళంలో ఏదో మార్పు కలిగింది. అది ఎటొచ్చీ అప్పుడే పైకి రాలేదు. అలాంటి మార్పు చెందిన దృక్కోణంనించి చూడ్డం మొదలెట్టాలంటే దానికి కొంత ప్రోత్సాహం కావాలి. ఆ ప్రోత్సాహం ఇచ్చేవస్తువునికూడా కట్నంతీసుకుని పెద్దింటి పిల్లని చేసుకోవాలన్న ఆ నిర్ణయమే తయారీలో ఉంచింది

## (22) పెద్ద ఉద్యోగం

సూర్యం సెలక్టయ్యాడు కాలేజీ నాటినించీ మాట్లమీద తిరుగుతూ, ఇతని వాలకాన్నిచూసి చీదరించుకున్న సహాధ్యాయులు చాలామంది కంగ్రాచ్యులేషన్సు చెప్పారు. ఆఫీసులో తోటివాళ్ళు, ఆఫీసర్లూ, అందరూ సంతోషంతో పార్టీ ఇచ్చారు. ఇంటిదగ్గర సుబ్బారావుకీ, రమణమ్మకీ అమితానందంతో కళ్ళమ్మట నీళ్ళు వచ్చేశాయి. సూర్యం తమ్ముడు రాఘవుడూ, చెల్లెలు సీతా ఎగిరి గంతులేశారు వార్త విని నరసింహంగారు పరిగెత్తుకొచ్చారు. ఆయన వెనకటి సంగతి ఏమీ మనసులో అట్టేపెట్టుకోలేదు ఎంతో ఉత్సాహంగా మాట్లాడారు. కొద్దిగా సలహాకూడా ఇచ్చారు. "పైకి వెళ్ళేవాడికి చూపు ఎప్పుడూ ముందుకే ఉంటుంది. కొంతలో కొంతేనా వెనక చూపు ఉండటం ఉత్తమలక్షణం అభివృద్ధిలోకి రా" అన్నారు.

"అలాగేలెండి. మీబోటి పెద్దల దయ" అన్నాడు సూర్యం. కాని అలా అంటూనే లోపల ముసలాయన బోరుకొడుతున్నాడు వెంటనే మళ్ళీ ఎలాటి వాడిని ఎలా అనుకున్నాను అని బాధపడ్డాడు.

సన్యాసాడి పెళ్ళికి జందెం దగ్గరనించీ ఎరువేట. సూర్యానికి ఇంటర్వ్యూ కెళ్ళడానికి కోటు, బూట్లు వగైరాలన్నీ ఎరువే. ఆతను ఇంటర్వ్యూకెళ్ళే ముందు బూట్లు కొనడం ఫేర్వుకింద ఇప్పటికీ చెప్పుకుంటారు. చచ్చిచెడి చేయంగల విన్నపాట్లై తక్కువ ధరలోనే నాలుగు కొట్లలో బేరమాడి కొన్నాడు. అది కాస్త ఇంటర్వ్యూకెడుతూ మరిచిపోయి రైలెక్కాడు. తరవాత స్నేహితులెవరో చూసి, స్కూటరుమీద గోదావరిస్టేషనుకి వెళ్లి రైలు కదులుతూండగా అందించారు.

అలాంటివాడికి తిన్నగా వెళ్లి ఉద్యోగంలో చేరాలంటే అంత సులభంకాదు, తనతోబాటు సెలక్టయిన వాళ్లంతా కాస్తోకూస్తో వెనకున్న వాళ్లయియుంటారు. మంచి డాబుగా దర్పంగా వస్తారు. అందులో అప్పుడే ఉద్యోగంలో చేరటం. టూత్ బ్రష్‌నించి టూరెళ్లడానికి కావలసిన సరంజామాదాకా అన్నీ కొత్తగా కొవార్సినవే. అయితే పెద్ద ఉద్యోగస్తుడవుతున్నాడన్న మద్దతుమీద కావలసిన అప్పుపుట్టడం కష్టంకాలేదు. మరీ అనుకున్నంత వీలయినంత పొదుపుగానే కావలసినవి అమర్చుకున్నాడు.

ఉద్యోగంలో ఎక్కడో దూరంలో చేరిన సూర్యానికి మొదట మతిపోయింది. మద్రాసు మహాపట్నంలో కొన్నాళ్లు ట్రైనింగు. ఆపైన ఏదో మారుమూల వేశారు డిప్యూటీ కలెక్టరుగా ఈ ఉద్యోగాలలో ఆ ప్రాంతాలకి ఉన్నతాధికారి అవడంతోటి కొంత హోదా నిలబెట్టుకోవాలసి వస్తుంది. కొంత కిందవాళ్లలోనూ, అది బెట్టు ఉండాలి. సూర్యానికి మొదట తనకి రెట్టింపు వయస్సున్నవాళ్లూ, నిన్న మొన్నటిదాకా తనకి అందరాని అత్యున్నతుల్లా కనబడుతూ వచ్చిన ఇనస్పెక్టర్లూ, తాసిల్దార్లూ వగైరాలు వంగివంగి నంగినంగి దణ్ణాలెడుతూంటే ఎబ్బెట్టుగా తోచేది. తనతోటి ఉద్యోగస్తులంతా మాత్రం మంచి స్టైల్లో ఉండేవారు. వాళ్లతో సమానమైన హోదా తను చూపలేకపోయేవాడు మళ్లీ కాలేజీ మొదటిరోజులనాటి మనస్తత్వం, నేనూఉన్నాననిపించడం మొదలెట్టింది అయితే ఇప్పుడు సూర్యం బాగా చదువుకుని కొన్నాళ్ళ ఉద్యోగంకూడా చేసి రాటుదేరిన మనిషి. అందుకని ఈ పరిస్థితులు అతని భావాలకి ఒక మెలికనిచ్చాయి. ఇంతవరకు తనలో ఏదో తక్కువతనం ఉందని తనే భావించి కొంచెం వంగి నమ్రతగా ఉండేవాడు ఇప్పుడు తను తనలోఉన్న ఆధిక్యతే బుజావు చేసుకున్నాడు తనచుట్టూవాళ్ళు, తనకంటె తక్కువ వాళ్ళు, తనంతవాడు వాళ్లతో మాట్లాడడమే వాళ్లకి మంచిచెయ్యడం. కొంచెం మెడ వెనక్కి వంచి కళ్ళు సగం అరమూతలుగా పెట్టి తూచితూచి మాట్లాడ్డం నేర్చుకున్నాడు. అధికారరీత్యాగా తనకంటే పైవాడయితే తప్పించి, అవతలవాడిక్కూడా కొన్ని అభిప్రాయాలుంటాయని, మాటని తుంచకుండా అవకాశమిస్తే చెబుతాడనీ అనుకునేవాడు తనకి తెలుసునుకనుక. తన అభిప్రాయాలు 'ఆఖరి మాట'గా పరిగణించేవాడు తను ఒక మెట్టుఎత్తులో ఉన్న మానవుడు.

ఎప్పుడేనా ఇంటి దగ్గరి కెళ్ళినప్పుడుమాత్రం కొంచెం తగ్గేవాడు మళ్లీ మామూలుమనిషిలాగా ఉండేవాడు. ఆ పరిస్థితుల్లో తను డిప్టీకలెక్టరుకాదు. ఈ సారి తండ్రిని ఉద్యోగం మానమని పట్టుపట్టలేదు. "చూడు నాన్నా! ఈ పాడు ఉద్యోగాలున్నాయి, చూశావు బోల్డు హడావిడి,పోరు, దర్జా, హోదా. కాని ఇదంతా నిలబెట్టుకునేందుకు సరిపడే డబ్బుమాత్రం ఉండదు. నేనింకా కొంచెం సెటిల్ అయ్యాక మానేద్దువుగానిలే ఉద్యోగం. ఈ లోపు నాకు వీలయినంత, అప్పుడప్పుడు పంపుతూ ఉంటాను"

"అలాగేలేరా ముందు నీ సంగతి కానీ" అన్నాడు సుబ్బారావు

## (23) వివాహం

చాలా పెద్దింటివాళ్లు వచ్చారు పిల్లనిస్తామని; పైగా బోల్డేసి కట్నాలు, కానుకలూ ఇస్తామని. అనేక సంబంధాలు ఏరిఏరి ఒక రెట్టె

# పన్నీరు - కన్నీరు

8 వ పేజీ తరువాయి

ఇంటర్మీడియేట్‌కెళ్ళి అంతతో చదువు ఆపకుండా తంటాలుపడయినా పైకి చదివి అభివృద్ధిలోకి రావాలని తండ్రి—కొడుకుల్ని కాదని తల్లి చేసిన నిర్ణయం, నరసింహంగారి మద్దతూ సూర్యం జీవితంలో ముఖ్యమైన మలుపుని నిర్ణయించాయి. కొంతవరకూ ఆ నిర్ణయమే మలుపు తరవాత జీవిత లక్ష్యాల్ని మార్చి ఉండవచ్చు.

కాని మలుపు తరువాత సూర్యం జీవితంలో, ఆచరణలో, దృక్పథంలో ముఖ్యమైన మార్పులు ఏవైనా వస్తే దానికి పుట్టుకస్థానం కొంతవరకూ వెనకెప్పుడో తల్లి, తండ్రి చేసిన నిర్ణయంలో చూడచ్చు. ఎప్పుడైతే తను కావాలనుకున్న పిల్ల తనకి కాలేదో, దానికి తనకి గాయమవుతుందన్న విషయం ఎంత లెక్కలోకి తీసుకోకుండా నిర్ణయం జరిగిందో, అప్పటినుంచీ సూర్యానికి కొంతవరకు ఎక్కడో అంతరాళంలో ఏదో మార్పు కలిగింది. అది ఎటొచ్చీ అప్పుడే పైకి రాలేదు. అలాంటి మార్పు చెందిన దృక్కోణంనించి చూడ్డం మొదలెట్టాలంటే దానికి కొంత ప్రోత్సాహం కావాలి. ఆ ప్రోత్సాహం ఇచ్చేవస్తువునికూడా కట్నంతీసుకుని పెద్దింటి పిల్లని చేసుకోవాలన్న ఆ నిర్ణయమే తయారీలో ఉంచింది.

## (22) పెద్ద ఉద్యోగం

సూర్యం సెలక్టయ్యాడు. కాలేజీ నాటినించీ సూట్లమీద తిరుగుతూ, ఇతని వాలకాన్నిచూసి పీదరించుకున్న సహాధ్యాయులు చాలామంది కంగ్రాచ్యులేషన్సు చెప్పారు. ఆఫీసులో తోటివాళ్ళు, ఆఫీసర్లూ, అందరూ సంతోషంతో పార్టీ ఇచ్చారు. ఇంటిదగ్గర సుబ్బారావుకీ, రమణమ్మకీ ఆనందంతో కళ్ళమ్మట నీళ్ళు వచ్చేశాయి. సూర్యం తమ్ముడు రాఘవుడూ, చెల్లెలు సీతా ఎగిరి గంతులేశారు. వార్త విని నరసింహంగారు పరిగెత్తుకొచ్చారు. ఆయన వెనకటి సంగతి ఏమీ మనసులో అట్టే పెట్టుకోలేదు. ఎంతో ఉత్సాహంగా మాట్లాడారు. కొద్దిగా సలహాకూడా ఇచ్చారు. "పైకి వెళ్ళేవాడికి చూపు ఎప్పుడూ ముందుకే ఉంటుంది. కొంతలో కొంతేనా వెనక చూపు ఉండటం ఉత్తమలక్షణం. అభివృద్ధిలోకి రా" అన్నారు.

"అలాగేలెండి. మీబోటి పెద్దల దయ" అన్నాడు సూర్యం. కాని అలా అంటూనే లోపల మనసలాయన బోరుకొడుతున్నాడు. వెంటనే మళ్ళీ ఎలాంటి వాడిని ఎలా అనుకున్నాను అని బాధపడ్డాడు.

సన్యాసాడి పెళ్ళికి జందెం దగ్గరనించీ ఎరువేట. సూర్యానికి ఇంటర్వ్యూకెళ్ళడానికి కోటు, బట్ట వగైరాలన్నీ ఎరువే. అతను ఇంటర్వ్యూకెళ్ళే ముందు బూట్లు కొనడం ఫిర్సుకింద ఇప్పటికీ చెప్పుకుంటారు. చచ్చిచెడి చేయంగల విన్నపాల్తై తక్కువ ధరలోనే నాలుగు కొట్లలో బేరమాడి కొన్నాడు. అది కాస్తా ఇంటర్వ్యూకెడుతూ మరిచిపోయి రైలెక్కాడు. తరవాత స్నేహితులెవరో చూసి, స్కూటరుమీద గోదావరిస్టేషనుకి వెళ్ళి రైలు కదులుతూండగా అందించారు.

అలాంటివాడికి తిన్నగా వెళ్ళి ఉద్యోగంలో చేరాలంటే అంత సులభంకాదు, తనతోబాటు సెలక్టయిన వాళ్ళంతా కాస్తోకూస్తో వెనకున్న వాళ్ళయియుంటారు. మంచి డాబుగా దర్పంగా వస్తారు. అందులో అప్పుడే ఉద్యోగంలో చేరటం. టూత్‌బ్రష్‌నించి టూరెళ్ళడానికి కావలసిన సరంజామాందాకా అన్నీ కొత్తగా కొవాల్సినవే. అయితే పెద్ద ఉద్యోగస్తుడవుతున్నాడన్న మద్దతుమీద కావలసిన అప్పుపుట్టడం కష్టంకాలేదు. మరీ అనుకున్నంత వీలయినంత పొదుపుగానే కావలసినవి అమర్చుకున్నాడు.

ఉద్యోగంలో ఎక్కడో దూరంలో చేరిన సూర్యానికి మొదట మతిపోయింది. మద్రాసు మహాపట్నంలో కొన్నాళ్ళ ట్రైనింగు. ఆపైన ఏదో మారుమూల వేశారు డిప్యూటీ కలెక్టరుగా. ఈ ఉద్యోగాలలో ఆ ప్రాంతాలకి ఉన్నతాధికారి అవడంతోటి కొంత హోదా నిలబెట్టుకోవాలిసి వస్తుంది. కొంత కిందవాళ్ళతోనూ, అది బెట్టు ఉండాలి. సూర్యానికి మొదట తనకి రెట్టింపు వయస్సున్నవాళ్ళూ, నిన్న మొన్నటిదాకా తనకి అందరాని అత్యున్నతుల్లా కనబడుతూ వచ్చిన ఇనస్పెక్టర్లూ, తాసిల్దార్లూ వగైరాలు వంగివంగి నంగినంగి దణ్ణాలెడుతూంటే ఎబ్బెట్టుగా తోచేది. తనతోటి ఉద్యోగస్తులంతా మాత్రం మంచి స్టైల్లో ఉండేవారు. వాళ్ళతో సమానమైన హోదా తను చూపలేకపోయేవాడు. మళ్ళీ కాలేజీ మొదటిరోజులనాటి మనస్తత్వం, నేనూఉన్నాననిపించడం మొదలెట్టింది. అయితే ఇప్పుడు సూర్యం బాగా చదువుకుని కొన్నాళ్ళ ఉద్యోగంకూడా చేసి రాటుదేరిన మనిషి. అందుకని ఈ పరిస్థితులు అతని భావాలకి ఒక మెలికినిచ్చాయి. ఇంతవరకు తనలో ఏదో తక్కువతనం ఉందని తనే భావించి కొంచెం వంగి నమ్రతగా ఉండేవాడు. ఇప్పుడు తను తనలోఉన్న ఆధిక్యతే బుజావు చేసుకున్నాడు. తనచుట్టూవాళ్ళూ, తనకంటె తక్కువ వాళ్ళు, తనంతవాడు వాళ్ళతో మాట్లాడడమే వాళ్ళకి మంచిచెయ్యడం. కొంచెం మెడ వెనక్కి వంచి కళ్ళు సగం అరమూతలుగా పెట్టి తూచితూచి మాట్లాడ్డం నేర్చుకున్నాడు. అధికారరీత్యాగా తనకంటే పైవాడయితే తప్పించి, అవతలవాడిక్కూడా కొన్ని అభిప్రాయాలుంటాయని, మాటని తుంచకుండా అవకాశమిస్తే చెబుతాడనీ అనుకునేవాడు తనకి తెలుసునుకనుక. తన అభిప్రాయాలు 'ఆఖరిమాట'గా పరిగణించేవాడు తను ఒక మెట్టుఎత్తులో ఉన్న మానవుడు.

ఎప్పుడేనా ఇంటి దగ్గరి కెళ్ళినప్పుడుమాత్రం కొంచెం తగ్గేవాడు. మళ్ళీ మామూలుమనిషిలాగా ఉండేవాడు. ఆ పరిస్థితుల్లో తను డిప్టీకలెక్టరుకాదు. ఈ సారి తండ్రిని ఉద్యోగం మానమని పట్టుపట్టలేదు. "చూడు నాన్నా! ఈ పాడు ఉద్యోగాలున్నాయి, చూశావు. బోల్డు హడావిడి,హోరు, దర్జా, హోదా. కాని ఇదంతా నిలబెట్టుకునేందుకు సరిపడే డబ్బుమాత్రం ఉండదు. నేనింకా కొంచెం సెటిల్ అయ్యాక మానేద్దువుగానిలే ఉద్యోగం. ఈ లోపు నాకు వీలయినంత, అప్పుడప్పుడు పంపుతూ ఉంటాను."

"అలాగేలేరా. ముందు నీ సంగతి కానీ" అన్నాడు సుబ్బారావు.

## (23) వివాహం

చాలా పెద్దింటివాళ్ళు వచ్చారు పిల్లనిస్తామని; పైగా బోల్డేసి కట్నాలు, కానుకలూ ఇస్తామనీను, అనేక సంబంధాలు ఏరిఏరి ఒక రిక్లె

ఎక్కడుంచవలసిన వాళ్లని అక్కడుంచాలి” అనే మనస్తత్వం.

వివాహం మహావైభవంగా చేశారు. కట్నంకూడా దండిగా యిచ్చారు. పెళ్లికి ఎక్కడెక్కడివాళ్ళూ చాలామంది ఆఫీసర్లూ, అధికార్లూ, ఎం. ఎల్. ఏలూ, పెద్దపెద్ద వ్యాపారస్తులూ వచ్చారు. ఎవరికి తగినట్టు వాళ్లని గౌరవించి పంపించారు. అయితే ఇంతమంది హోదాకలిగి కార్లమీద వచ్చే వాళ్ల హడావిడిలో, ఎంత పెళ్లికొడుకు తలిదండ్రు లయినా, ఏదో కంపెనీలో చిన్న గుమాస్తా ఉద్యోగం చేస్తూ, చెప్పులేనా వేసుకోకుండా తిరిగే సుబ్బారావునీ, పెళ్లాన్నీ మరింత గౌరవించేందుకు అవకాశం లేకపోయింది. అసలు వియ్యంకుడని చెప్పి అక్కడ కొచ్చిన వాళ్లకి పరిచయంచెయ్యడంకూడా కొంచెం అజ్ఞాకరంగా అయి, కొంచెం తికమకపడేవారు లక్ష్మీగారు. “ఏదో ఓ మూల కూచుని కొడుకుపెళ్లి ఇంత వేడుకవుతోంది; మనజన్మలో అనుకున్నామా అని సంతోషించక అందరిమధ్యనా పందిట్లో తిరుగుదామనుకోవడం అత్యాశ” అనికూడా అనిపించింది. పరిస్థితుల లక్షణం కనిపెట్టిన సుబ్బారావే సాధ్యమైనంత తప్పుకు తిరిగేవాడు. అయినా ఒకటిరెండు సంద ర్భాల్లో ఆడపెళ్లివారి ప్రవర్తనవల్ల సుబ్బారావుకీ పెళ్లానికీకూడా హృదయం కలుక్కుమనిపించింది. కొడుకుపెళ్లిలోనే ఏదో తిండికిలేక పెళ్లింటికొచ్చిన వాళ్లతో సమానంగా చూడ్డం ఎంత ఓర్పుగలవాడి కేనా సహించరానిది. సూర్యం ఒంటరిగా ఉన్నప్పుడు సుబ్బారావు వెళ్లి “చూశావురా! ఇలా ఉంది పరిస్థితి” అన్నాడు ఉండబట్టలేక. సూర్యం “ఇంతే నాన్నా! మన మనస్తత్వాలెప్పటికీ మారవు. మనం మగపెళ్లి వారం; మన అడుగులకి ఆడపెళ్లివారు మడుగు లొత్తాలని పాత చెత్త సంప్రదాయాల్ని పట్టుకు వేళ్లాడుతున్నారు మీరింకాను. వారెంతో గౌర వంగా, హోదాగా పెళ్లిచేస్తుంటే ఇలాంటి చిన్నచిన్న విషయాలకి తప్పుట్టుకోవడం బాగాలేదు నాన్నా. అయినా వాళ్ల తాహతెంతది; మన తరహా ఏమిటి.”

పెళ్లయిన కొద్దిరోజులకే సూర్యం—భార్య కాప రానికొచ్చింది. కాపురాని కొచ్చిందంటే తిన్నగా సూర్యం ఉద్యోగంచేస్తున్న ఊరు చేరుకుంది; ఒక వంటకత్తె, అల్సేషియన్ కుక్కతోసహా. ఆ కుక్కంటే ఆవిడకి ప్రాణం. సూర్యం కొంచెం నసిగాడు కుక్కని చూసి. ఆవిడ “పోనిలెండి. నే నెక్కడుంటే ఆ కుక్కా అక్కడే ఉంటుంది. మీ కక్కర్లేకపోతే వెడతాము అంతతోను” అంది. అక్కడితో సూర్యం కళ్లు తేలేసి, మెల్లిగా బతిమాలి నువ్వు లేకపోతే నాకింక జీవితమేమిటని ఊరుకోబెట్టాడు.

## (24) పొట్ట విప్పిచూడ

సూర్యం, గవర్నమెంటిచ్చిన వాన్‌లో అభివృద్ధి కార్యక్రమాల్లో జోరుగా తిరుగుతూండేవాడు. ఒక నాడు ఒక స్కూలు ప్రారంభోత్సవానికి ఆహ్వానించాడు, బి. డి. వో. అక్కడ మీటింగులో ఎక్కడో వెనకాల మనుష్యుల్ని సర్దుతూన్న ఒకతని మొహం కొంచెం పరిచితంగా కనిపించింది. అతనుకూడా మధ్యమధ్య తనకేసి చూస్తున్నాడు. మళ్లీ తను చూస్తే, బెదిరి, చూపు తిప్పుకుంటున్నాడు. మీటింగయ్యాక బి. డి. ఓని అడిగాడు. అతను ఆ చుట్టు పక్కల ఊళ్లకి విలేజ్ లెవెల్ వర్కర్‌అనీ, పేరు మధుసూదనరావనీ చెప్పాడు. సూర్యానికి పాత సంగతులు జ్ఞాపకంవచ్చాయి.

కాలేజీలో మధుసూదనరావు సూర్యంలాంటి వాళ్లకి ‘సమీపించలేని మనిషి’ గా కనబడేవాడు. సాధారణంగా మాటులోనే ఉండేవాడు. బట్ట నలగనిచ్చేవాడు కాదు. పది రూపాయల నోటంటే అణాతో సమానంగా చూచేవాడు. హోటల్‌కి స్నేహితుల్ని వెంటేసుకుపోతే బిల్లెప్పుడూ మధుసూదనరావే చెల్లించేవాడు. అతని చుట్టూ ఎప్పుడూ ఒక బృందం ఉండేది; తనకి స్వంతంగా అంత తాహతు లేకపోయినా అతని నూట్ల నాణ్యాన్ని టైలరింగుని పొగడుతూ, అతనితోబాటు హొక్కా లోపలికి వేసుకుని తామూ మాట్లేసుకున్నామని రొమ్ములు విరుచుకుంటూ, సూర్యంలాంటి వాళ్లని హేళనగా చూస్తూనూ. మధుసూదనరావు ఊరూ వగైరాలు ఎవరికీ వివరంగా తెలియకపోయినా అందరూ వాళ్ల కుటుంబం బాగా ఆస్తిపరులని అనుకునేవారు.

సూర్యం డాక్—బంగళాకి వెడుతూ బి. డి. ఓ. తో మధుసూదనరావుని పంపమని చెప్పి వెళ్లాడు. కాసేపటికి సూర్యం విశ్రాంతి తీసుకుంటుండగా మధుసూదనరావు వచ్చి నమస్కారం చేశాడు. కూర్చోమని కాఫీ తెప్పించాడు సూర్యం. కొంచెం బెరుగ్గానే కూచున్నాడు మధుసూదనరావు.

“జ్ఞాపకముందా మధుసూదనరావ్.”

“ఎందుకు లేదు సార్! అప్పుడు మీరు మాలా అల్లరి చిల్లరగా తిరక్కుండా శ్రద్ధగా చదివానేరు సార్! పైకొచ్చారు.”

“ఇక్కడ మన మిద్దరమే. అంత ఒదుగ్గా సార్ సార్ అనక్కర్లేదులే. జ్ఞాపకముందా ఆ రోజుల్లో నీస్నేహితు డనిపించుకోవటమే ఒకవిజయం. నాలాంటివాళ్లకినీతో మాట్లాడ్డంకూడా బింకుగాఉండేది.”

“అవొక రోజులండి. బాధ్యత పైన బడి, సంపాదాలు మోస్తుంటేగాని తెలియదండి అసలుసంగతి.

“నువ్వు ఎన్నాళ్లయింది ఇక్కడ జేరి? ఈ పనిలో కెలా గొచ్చావు? ఇందులో కెక్కువగా గ్రాడ్యుయేట్సు రారే ?”

“నేను బి. ఏ. లోనే రెండుసార్లు తప్పి, మూడో సారి ప్యాసయ్యాను. తరవాత అన్ని రకాల ఉద్యోగాలకోసం తిరిగాను. గుమాస్తా ఉద్యోగాలకి కూడా క్లాసు కావాలని అడిగేవారు. చివరికి పొట్టపోసుకుందు కేదైతే ఏమిటి ? ఏదో పల్లెటూళ్లో పడి ఉండచ్చని ఇందులో చేరాను.”

“మరి ఆ రోజుల్లో మీది పెద్ద ఆస్తిగల కుటుంబం కదా. నీకు ఉద్యోగం, ఇలాంటిది, చేసి పొట్టపోసుకునే అవసర మెందుకైంది.”

“అదొక దగా జీవితంలెండి. మా పూర్వులకి ఆస్తి ఉండేదట. మా నాన్నగారినాటికి ఏదో భుక్తికి సరిపడ్డ గింజలు వచ్చే భూమి, ఒక ఇల్లు మాత్రమే మిగిలాయి. నాలో పెద్దవాళ్ల రక్తంలో వచ్చిన రాజసం మాత్రం ఉంది; ఆస్తి లేకపోయినాసూ. నేను ఏదో బాగా చదివి పైకి రావాలని మా నాన్న ఆశపడేవాడు. నేను ఎంత అడిగితే అంత లెక్క అడ క్కుండా పంపేవారు. పరిస్థితులు బాగా లేవని కొద్దో గొప్పో తెలిసీ, ఎక్కడనుంచి తెస్తున్నారు డబ్బని అడగలేదు ఎప్పుడూనూ. డబ్బంతా దుస్తులకీ, వినోదాలకీ, స్నేహితులకీ విచ్చలవిడిగా ఖర్చు పెట్టేవాణ్ణి. మధుసూదనరావుకి రూపాయంటే దమ్మిడీతో సమానం అని ఎవరేనా అనుకుంటే నాకు ఏనుగెక్కినంత సంబరంగా ఉండేది. పరీక్ష పోయిన సంగతి తెలుస్తే నాన్న గుండె చెరువవు తుందని, ఫస్టుక్లాసొచ్చే (క్షమించండి) మీలాంటి వారి నంబరొకటి చెప్పి వాళ్లని ప్యాసయినట్లు నమ్మించాను. మళ్లీ ఆనర్సు కోర్సులో చేరి ఇక రెండేళ్లు చదివితే పెద్ద ఉద్యోగం వస్తుందని నమ్మించి విశాఖపట్నం వెళ్లి అక్కడ కులాసాగా గడిపాను.. ఆ రెండేళ్లూ పట్టింది ఈ బి. ఏ. డిగ్రీ కాస్తా తెచ్చుకుందుకు.” ఇంటికొచ్చి పరిస్థితులు చూస్తే మతి పోయింది. ఉన్న కొద్ది ఎకరాలూ, ఇల్లూ కూడా తాకట్టులో ఉన్నాయి. అమ్మ వంటిమీద మంగళసూత్రం మినహా వస్తువులన్నీ వెళ్లిపోయాయి. కాలేజీ వేషాల నిషా దిగిపోయింది.

అయినా పూర్తిగా పులుపు చావలేదు. నాలుగువేలు కట్నం తీసుకుని పెళ్లి చేసుకుని ఓ వెలుగు వెలిగాను. కాని, ఎన్నాళ్ళు! పిల్లలు పుట్టుకు రావడం మొదలెట్టారు. నా బండారం తెలుసుకున్న నాన్నగారు బెంగతో మంచమెక్కారు. ఆస్తి కరారావుడయిపోయింది. నే నిక్కడ చేరాను..

ఏదో గొడవ చాలా చెప్పాను, క్షమించండి.”

“లేదోయ్. నిజంగా విచిత్రమే. ఆ రోజుల్లో కాలేజీలో ఇలా కొంచెం నచ్చగా ఉండేవాళ్ళు ఇంకా కొంతమంది ఉండేవారు. అంతా ఇంతేనంటావా?”

“లేదు. అందులో కొందరు నిజంగా స్థితి పరులే. వాళ్ళు తరవాత డాక్టర్లూ, లాయర్లూ, వ్యాపారస్తులూ అయి బాగానే ఉన్నారు. మొత్తం మీద సగంమందిదాకా చాలా పాతలు పెట్టుకున్న వాళ్లే.”

(సశేషం)


“బాబోయ్! సోలాలో సంగతాలో”

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra PatrikaPress 6 & 7, Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

# మీ చర్మానికి తగినది

# నివియా




## ఇదే మీ చర్మానికి కావలసినది

నివియా క్రీమ్‌లో "యుసిరైట్" — అద్వితీయమైన, సహజ ప్రకృతి పదార్థము వంటిది ఉన్నది. రోజూ స్నానం వల్లను, ఎండ, వాన, గాలిలో తిరుగుచుండుట వల్లను కోల్పోవునట్టి మీ చర్మమందలి చమురులను అది సమకూర్చుతుంది. నివియా మీ చర్మాన్ని మృదువుగాను, యౌవనయుతమైన ఆరోగ్యవంతంగాను వుంచుతుంది. మీ చర్మానికి వాడదగినది. నివియా. ఇప్పుడే!

నివియా — వివిధోపయుక్తమైన క్రీమ్.




